# చతుర కతలు

## రాంగ్‌షో!

'బీచ్‌రోడ్డు! దిగండి!' అన్న కండక్టరు కేకతో సిటీబస్సు రద్దీనుండి బయటపడి తేలిగ్గా ఊపిరిపీల్చుకున్నాను. కట్టినది ఖద్దరు బట్టలు కావటం మూలాన పూర్తిగా చెమటతో తడిసిపోయాయి, నలిగిపోయాయి, తల చెదిరిపోయింది. కాలేజీరోజుల్లో సిటీ బస్సు ప్రయాణంలో ఎంతో ఆనందం వుండేది. ఆ అనుభూతి ఇప్పుడు ఈ వయస్సులో పొందాలనుకోవడం అత్యాశకాక మరేమిటి?

నెమ్మదిగా నడుస్తున్నాను. వేసవి, ఆదివారం మూలాన బీచ్‌లో జనం ఎక్కువగా ఉన్నారు. నన్ను ఈ అవతారంలో చూసినవాళ్లు ఏమనుకుంటారు! అయినా నా పిచ్చిగానీ ఈ మహా నగరంలో నా పరిచయస్తులెందరు? వాళ్లలో ఇప్పుడు నన్ను చూసేవాళ్లెందరూ!?

సముద్రతరంగాల మీదనుంచి వస్తున్న చల్లనిగాలి ఒంటికి తగులుతుంటే ప్రాణానికి హాయిగా వుంది.

"ఓరేయ్ రాజా!" ఎవరిదో బండ గొంతు కెరటాల హెూరును ఛేదించుకొంటూ వినపడింది.

వెనక్కి తిరిగి చూశాను. ఓ మారుతీకారు వచ్చి నా పక్కనే ఆగింది. దానిలోంచి చంద్రం దిగాడు. ఖరీదైన బట్టలు, వేళ్ల మధ్య కాలుతున్న ఖరీదైన సిగరెట్.

"ఇక్కడే వుంటున్నావా? ఏం చేస్తున్నావు" అన్నాడు.

నేను పని చేస్తున్న డిపార్టుమెంటు చెప్పాను.

"నువ్వు చిన్నప్పటినుంచీ పుస్తకాల పురుగువి. ఇప్పుడు ఆఫీసు ఫైళ్ళ పురుగువై వుంటావు! నువ్వు సాధించింది ఏమిటి? ఓ గుమస్తావయ్యావు అంతేగదా!" అన్నాడు నన్ను వెక్కిరిస్తున్నట్టుగా నవ్వుతూ.

నేను మౌనంగా వుండిపోయాను. వాడి ఆనందానికి నా వంతు సహకారాన్ని అందించాను. "ఏం చేస్తున్నావు! అని నన్నడగవేం! కాంట్రాక్టులు చేస్తున్నాను" అన్నాడు ప్రశ్నా సమాధానం తానే ఇస్తూ.

"ఈ కారు!?"

నా మాట పూర్తి కాకుండానే అడ్డు తగిలాడు... "నెల క్రిందటే కొన్నాను. నెంబరు టోటల్ నైన్‌కి అప్లయ్ చేశాను. ఇంకా రిజిస్ట్రేషన్ చేయించలేదు. ఇంట్లో పిల్లలూ, వాళ్లు వాడుకోవడానికి కాంటెస్సా వుందనుకో. నమ్మరుగదా! యమాబిజీ మా కంట్రాక్టర్లకి" తానే ప్రవాహంలా చెప్పుకుపోతున్నవాడల్లా సడన్‌గా టైం చూసుకొని "సారీ! నాకర్జంటు పనుంది మరోసారి కలుద్దాం!" అంటూ నిష్క్రమించాడు.

చంద్రం హైస్కూలు వరకూ నా సహాధ్యాయి. ఇద్దరం ఒకే వూరి వాళ్లం. చంద్రం పదవతరగతి గట్టెక్కలేదు. అల్లరచిల్లరగా తిరిగేవాడు. మళ్లీయిన్నాళ్లకు ఇలా కంటపడ్డాడు.

'తంపటి సెనక్కాయలు... తంపటి సెనక్కాయలు' అన్న అరుపుతోఆలోచనల్ని పక్కనపెట్టి సెనక్కాయలు కొన్నాను. తిని చాలాకాలమయింది. ఏదో లోకాలలో విహరిస్తున్నట్టుగా వుంది నాకు ఆ సాయంకాలం.

మర్నాడు...

ఆఫీసులో నా పనుల్లో నేను బిజీగా వుండగా "సార్! గ్యారేజినుంచి మెకానిక్ మీ కారు తీసుకు వచ్చాడు" అటెండరు వచ్చి చెప్పాడు

---

ముఖచిత్రం: జగన్మోహన్



"సరే లోపలకు పంపించు'' అన్నాను.

"మీరు చెప్పిన కంప్లైంట్స్ అన్నీ సరిచేశాం సార్! ఇవిగో..." అంటూ నా వంక చూసిన చంద్రానికి నోటమాట రాలేదు.

చంద్రం గ్యారేజీలో వర్కరా!? నాకూ ఆశ్చర్యంగానే వుంది.

కారు తాళాలు టేబులు మీద వుంచి తలవంచుకొని ఎవరో తరుముతున్నట్లుగా వేగంగా అంగలేసుకొంటూ వెళ్లిపోతున్న చంద్రాన్ని గ్లాసుకేబిన్‌లోంచి కనిపించినంత మేరా చూశాను.

నన్నో గుమస్తాగా భావించిన చంద్రానికి నేను ఆఫీసర్ సీటులో కనిపించడం, నిన్న తనది అని చెప్పుకున్న కొత్తకారు నాది కావడం పాపం! ఊహించి వుండడు.

**-రతన్‌బాబు**

# పెళ్లివిందు

"నువ్వు వెయ్యి చెప్పు లక్ష చెప్పు నేను మాత్రం ఛస్తే నమ్మను'' అరిచాడు పార్వతీశం.

"నాయనా... నువ్వు నమ్మినా నమ్మకున్నా ఇది మాత్రం వాస్తవం. ఆ పైన నీ ఇష్టం" కూల్‌గా అన్నాడు రమణమూర్తి.

"ఎంగిలి చేత్తో కాకిని తోలని మన సుబ్బిగాడు కూతురు పెళ్లికి మన స్టాఫ్ అందరినీ విందుకు ప్రత్యేకంగా పిలిచాడంటే ఆశ్చర్యంగానే ఉందిగురూ'' సందేహం వ్యక్తం చేశాడు చలపతి.

"ఇంకో విషయం ఉంది... అది చెబితే మీరు మరింతదంగై పోతారు'' అన్నాడు రమణమూర్తి.

"ఇంతకీ ఏంటది?" అన్నారంతా కోరస్‌గా.

"పెళ్లివంటకని మన గున్నిగాడి బామ్మర్దికి వెయ్యినూట పదార్లిస్తానని మాట్లాడాడు''

"ఇది చాలా ఆశ్చర్యంగా ఉందే? వాడు యమ డిమాండున్న వంటల సన్నానిగదరా... ఖరీదైన పెళ్లిళ్లకు ఖరీదైన వంటలు చేసే ప్రసిద్ధుడాయె. అట్టాంటాడికి ఏకంగా వెయ్యి న్నూటపదార్లిస్తానని కుదిర్చాడా?" మహాశ్చర్యంతో తన అనుమానాన్ని పైకి కక్కేసాడు కాశీపతి.

"ఆమధ్య రెండువేల పోర్టబుల్ టీవీని ఆఖరిమాటగా రెండొందల యాభైకి యిస్తావా'' అని షాపోడ్ని అడిగి ఆడి చేతిలో ముక్కచివాట్లు తిన్న మన సుబ్బిగాడు గున్నిగాడి బామ్మర్దికి వెయ్యి నూటపదార్లిస్తానన్నాడంటే నమ్మడానికి మేమేమైనా చెవుల్లో పూలె

ట్టుకున్నామా మూర్తీ'' సణిగాడు అనంతయ్య.

"నమ్మకపోతే నష్టేట్లో మునగండయ్యా! నాకెందుకొచ్చిన సంత, నే చెప్పింది మాత్రం సెంట్‌పర్సంట్ నిజం'' చివాలున అక్కడ్నించి లేచివెళ్లిపోయాడు రమణమూర్తి.

★ ★ ★

ఆ వారంలోజులూ మా స్టాఫ్ అందర్లోనూ ఇదే చర్చనీయాంశం అయిపోయింది. అందరి నోళ్లూ ఊరి పోతున్నాయి. వారం తిరిగేసరికి సుబ్బిగాడి కూతురిపెళ్లి. ముహూర్తం రానేవచ్చింది. మా స్టాఫ్ మహోత్సాహంతో మోసుకొచ్చి చదివించిన పెళ్లి కానుకలన్నీ మొహమా

రత్నాకేఫ్‌లో పట్టుకురా తొందరగా వెళ్లు'' అంటూ.

మా అందరికీ ఆశ్చర్యం వేసింది.

"ఏమోయ్ ఇంకా వంటలు పూర్తికాలేదా? క్యారియర్ తెప్పిస్తున్నావ్. ఎవరికేంటి?" అన్నాడు చలపతి.

"వంట ఎప్పుడో రెడీసార్ మీదే ఆలస్యం" అన్నాడతను రకీమని.

"మరి క్యారియర్ ఎవరి కోసమయ్యా?" అడిగాడు అనంతయ్య.

"ఎవరికేంటి సార్ నాకే"

మేం అలా మిడిగుడ్లు వేసుకుచూస్తుంటే



టపడుతూనే అందుకున్నాడు సుబ్బిగాడు. అంతేకాదు "ఉదయం ముహూర్తం గనుక సాయంత్రం రిసెప్షన్ ఉంది. అందరూ తప్పనిసరిగా రావాలి'' అంటూ పేరుపేరునా చెప్పాడు.

★ ★ ★

సాయంత్రమైంది. మిత్రులందరం కలిసి పిల్లాజల్లాతో సహా డిన్నర్‌కి బయలుదేరాం.

పందిట్లో అడుగెట్టకముందే బయటే కన్పించాడు గున్నిగాడి బామ్మర్ది. ఎవరో కుర్రాడికి ఓ క్యారియర్ అందిస్తూ "ఓ మీల్స్ మన

కొన్ని క్షణాల తర్వాత అతనే అన్నాడు.

"మీ సుబ్బారావుగారు నలభై మంది భోజనాలకి సరిపడ సరుకిచ్చి నూటేభై మందికి సరిపడేలా వండమన్నాడు. కూరల్లోనూ, పులుసుల్లోనూ అడ్డమైనవీ దిట్టంగా తగిలిస్తే అవే సరిపోతాయిలెమ్మన్నాడు అందుకే నాకు వెయ్యి నూటపదార్ల కిరాయిస్తానన్నాడు. మీరంటే తినక తప్పదుగానీ, నాకేం ఖర్మ. అందుకే కారియర్ తెప్పించుకుంటున్నాను'' అతని మాటలు పూర్తికాక ముందే పందిరి ఖాళీ అయిపోయింది.

-ప్రతాపచంద్ర




# భువికి దిగిన తార పై సమీక్షలు

జూన్ చతురలో ప్రచురితమైన పి. చంద్రశేఖర అజాద్ నవల 'భువికి దిగిన తార'పై మాకందిన సమీక్షలలో ఉత్తమంగా ఉన్న ఐదింటిని ఈ దిగువన ప్రచురిస్తున్నాం.

## వెలుగునీడల విశ్లేషణ

*(ప్రథమ బహుమతి రు: 100/- పొందిన సమీక్ష)*

ఒక నవలను చదవడం పూర్తిచేసిన తర్వాత కూడా దాన్నిగురించే ఆలోచిస్తూనే ఉన్నామంటే అది నిస్సందేహంగా మంచి నవలే!

'భువికి దిగిన తార' నవలలో రచయిత రెండు సజీవ పాత్రలకు రూపకల్పన చేశారు. ఒకటి రాఘవ, రెండు శ్రీదుర్గ. పేదరికం ఎంత భయంకరమైనదో, అది జీవితాన్ని ఎన్ని మలుపులు తిప్పుతుందో, మనసును ఎన్ని ముక్కలు చేస్తుందో రచయిత చక్కగా వివరించగలిగారు.

అలాగే ప్రేమ ఎంత పవిత్రమైందో, ఎంత శక్తివంతమైనదో రాఘవ, శ్రీదుర్గల పాత్రల ద్వారా నిరూపించారు.

బాల్యంనుంచి జీవితంలో స్థిరపడేదాకా రాఘవకు తారసపడిన భజంగరావు, వెంకట్రావు, కాస్తంత జాలి చూపిన హెూటల్ సర్వర్, భర్తంటే భయపడే అక్క, అర్థంచేసుకున్న సరోజలాంటి భార్య... ఇవన్నీ జీవితంలో తారసపడే పాత్రలే! అందుకే నవలకు మంచి నేచురాలిటీ వచ్చింది.

ముఖ్యంగా శ్రీదుర్గ పాత్ర చిత్రీకరణ అద్భుతం అని చెప్పవచ్చు. సారాకొట్టులో పార్శిల్స్ అందజేసే చిన్న పాప, వెండితెర మీద మెరిసినా ఆమెలో గర్వంలేదు. హృదయానికి అహంకారపు పొరలు అంటలేదు.

అయితే నవలలో గొప్ప వెలితి కనిపించింది. ప్రస్తుతం సినిమా ఫీల్డ్ ఎంత అస్తవ్యస్తంగా ఉందో, దాన్ని ప్రక్షాళనం చేయడానికి ఎటువంటి ఎక్స్‌పెరిమెంట్స్ అవసరం? అన్నదానికి సమాధానంగా రచయిత తన భావాలను శ్రీదుర్గ పాత్రద్వారా చెప్పించారు. అయితే ఎందుకో శ్రీదుర్గ, రాఘవ ఎక్స్‌పెరిమెంటల్ సినిమా తీయడానికి చేసిన ప్రయత్నాలు నవలకు పారలల్‌గా నడవలేదు. అదంతా మరో ప్రహసనంగా, కొంచెం విసుగ్గా అనిపించింది.

ఏదేమైనా రొటీన్‌కి భిన్నంగా, ప్రేమకు చక్కటి భాష్యం చెబుతూ, జీవితంలోని వెలుగునీడల విశ్లేషణను చక్కగా వివరించిన రచయిత అభినందనీయుడు.

-జి. జ్యోతి
జగ్గయ్యపేట

## ఆశావాదం

*(ద్వితీయ బహుమతి రు: 75/- పొందిన సమీక్ష)*

ప్రకృతిలో వెలుగునీడలున్నట్లే, ప్రతి రంగంలోనూ మంచి చెడులుంటాయి. సినీ రంగమూ అంతే. అది గ్లామరస్ ఫీల్డ్ కనుక దానిలో అన్నీ ఎక్కువే!

"సినిమా అంటే అదో మాయాప్రపంచం కాదు. ఓ కళారూపం అని అందరూ గుర్తించాలి. చూద్దాం అలాంటి రోజులొస్తాయేమో'' అంటారు నవలా రచయిత. బహుశా ఈ ఆశావాదాన్ని జనాల్లో కల్పించడానికే నవల రాశారేమో!

వాస్తవానికి నేడు సినిమా టెక్నికల్‌గా అద్భుతమైన ప్రగతిని సాధించింది. కానీ అదే సమయంలో తన విలువల వలువల్ని వొలిచేసుకుంది. సినిమా అనేది పవర్‌ఫుల్ మీడియా అది సకళ కళల సమ్మేళనం. సర్వజన హృదయ సమ్మోహనం.

ఈ నవల్లో చెప్పినట్లే వ్యాపారదృష్టి పెరిగిపోయి సాహిత్యం, సంగీతాలపట్ల సరైన అభిరుచిలేని నిర్మాతలవల్ల సినీఫీల్డ్ పతనంవైపు పరుగులు తీస్తోంది. సినిమాల్లో నేడు ఘోరాతిఘోరంగా దెబ్బతిన్నది సాహిత్యమే. మన సినిమాలు ఇంత ఛండాలంగా ఉండడానిక్కారణం మనం మన మూలాల్ని విడిచి, పాశ్చాత్య ధోరణుల్ని గుడ్డిగా అనుకరించడం కూడా. ప్రతి చెత్తనూ 'న్యూవేవ్' అని పేరు తగిలించి ప్రచారం చేసుకోవడం అలవాటైపోయింది.

ఈ నవల్లో కొంత అస్పష్టత వుంది. శ్రీదుర్గ వాళ్ళ తాతగారు తెలుగుదేశాన్ని ఓ ఊపు ఊపిన రచయిత అట. వారు ఇంతవరకు సొంతం ఎవరికీ అర్థంకాలేదట! పేరు చెప్పలేదు. పేరు చెప్పకపోయినా సాహితీప్రియులందరికీ చప్పున స్ఫురించే పేరు చలం. రెండో విషయం - శ్రీదుర్గ పాట. అది పాట కాదు, ప్రాణం అంటారు రచయిత. మరి ప్రాణమైన ఆ పాట ఏది? దాని పల్లవేమిటి? ఇతివృత్తమేమిటి?

నా దృష్టిలో ఈ రెండంశాల కారణంగా నవల అస్పష్టంగా, అసంతృప్తిగా ముగిసిందనిపించుతుంది. ఇతివృత్తం పాతదే. చెప్పినతీరు నిండునదీప్రవాహంలా శాంత గంభీరంగా వుంది. సెలయేటి గలగలలు, సెన్సేషనల్ గడబిడలు లేవు. శైలి సింప్లీ సుపర్బ్! సినిమాల్లాగే, పత్రికా సాహిత్యం కూడా సెక్స్, హింస, ప్రతీకారంలాంటి భయానక భీభత్స భావాలను వెదజల్లుతున్న దశలో, వాటికి పూర్తిగా భిన్నమైన, ఆలోచనాత్మకమైన ఓ సైలెంట్ నవలను ప్రచురించినందుకు సంపాదకులవారికి కృతజ్ఞతలు.

-మహబూబ్ కమల్
న్యూపాల్వంచ

# శస్త్రచికిత్స

*(మూడవ బహుమతి రు: 50/- పొందిన సమీక్ష)*

**పి.** చంద్రశేఖర ఆజాద్‌గారి నవల 'భువికి దిగిన తార' చదివిన తర్వాత మన సినిమా రంగం ఎంతగా పతనం చెందిందో మరోసారి కళ్ళకు కట్టింది. సినిమారంగంమీద ఆకర్షణతో శ్రీదుర్గలా, అంతకంటే ఘోరంగా బలైన జీవితాలు ఎన్నో ఉన్నాయి. ప్రజలందరిపై చెడు ప్రభావం చూపెడుతున్న ఈ సినిమా రంగాన్ని ఎలా శస్త్రచికిత్స చేయాలో కూడా రచయిత రాఘవ పాత్రద్వారా చూపించారు. మనకెందుకులే, మనం ఏం చేయగలుగుతాం అని నిరాశాపూరితంగా మాట్లాడి చేతులు దులుపుకునే పెద్దమనుషులుకి 'మనకే కావాలి, మనమే చేయగలుగుతాం' అనే ఉత్సాహపూరిత భావాలు నవల చదివిన తర్వాత కలుగుతాయేమో!

సినిమారంగమేకాదు, అక్కడక్కడ రచయిత ఈ సమాజంలోని అసమానతల్ని రాఘవ హొటలు అనుభవాలు, శ్రీదుర్గ సారాయిదుకాణం అనుభవాలద్వారానూ, సినిమాల పేరుతో శరీరాన్ని అర్పించటం మొదలగు సంఘటనలద్వారా చూపెట్టి, ఎందువలన ఓ మనిషి తనలాంటి మనిషిముందే తలవంచుకుని బానిసగా ఉంటున్నాడు, ఒకరిని వేరొకరు దోచుకునే పరిస్థితి ఎందుకు ఉందని ప్రశ్నిస్తున్నాడు. శరీరంతో అవసరంలేని మానసిక ప్రేమ ఎలా ఉంటుందో ప్రేమపేరుతో తాత్కాలికోద్రేకాలకు లోనౌతున్నవారికి ఈ నవల ద్వారా తెలుస్తుంది. ఈ దేశంలో ఎందరో సామాన్యులు బతకడంకోసమే మనస్సును చంపుకుని జీవిస్తున్నారనీ, అంతమాత్రంచేత వాళ్ళంతా దుర్మార్గులు కారనీ రచయిత చెప్పారు. ప్రస్తుత సమాజానికి, సినిమారంగానికి తప్పనిసరిగా శస్త్రచికిత్స అవసరమనీ, అది




ఎవరో చేయరనీ, మనమే చేయాలనీ తెలియజే శారు. ఓ మంచి నవల చదివిన అనుభూతి కలిగింది ఈ నవల చదివిన తర్వాత.

-మంచాల శ్రీనివాసరావు
పిరంగిపురం

## మంచి నవల

*(నాలుగవ బహుమతి రు: 50/- పొందిన సమీక్ష)*

**ఓ** మనసున్న సినీనటి జీవితాన్ని 'క్లోజప్' లో చిత్రించడానికి రచయిత చేసిన ప్రయత్నం అభినందనీయం. సినీరంగం ఓ పంచరంగుల హరివిల్లని భావించే యువతీయువకులకు ఓ చక్కని సందేశాత్మక నవలనందించారు.

మనం చూసి ఆనందించే రంగురంగుల పూలు వాసనలేని కృత్రిమపు పువ్వులని తెలిసినప్పుడు మనకు ఎంతటి ఆశాభంగం కలుగుతుందో... సినీప్రపంచం గురించి కొన్ని ఉన్నతాభిప్రాయాలను ఏర్పరచుకున్నవారికి శ్రీదుర్గ పాత్ర చిత్రణను లోతుగా పరిశీలించినప్పుడు అదే భావం కలుగక మానదు. నడక, ఆట, పాట, నవ్వు, ఏడుపు... అన్నింటికీ కృత్రిమంగా అలవాటుపడిపోయిన ఓ నటి నా అనేవారి ప్రేమకోసం ఎంతగా పరితపించిపోతుందో దుర్గపాత్ర స్పష్టంచేసింది. 'ఎక్స్ట్రా' గా ముద్రపడిపోయిన నటీనటులలో ఎంత టాలెంట్ ఉన్నా సినీరాజకీయంలో ఎలా మరుగునపడిపోతున్నారో దుర్గ పాత్రద్వారా నిర్మొహమాటంగా చెప్పించారు. ముఖ్యంగా నటన, నాట్యం అన్ని విద్యలూ వ్యాపారంగా మారుతున్న ఈ ప్రపంచంలో సహజత్వానికి అద్దంపట్టే సినిమా తీయాలని రాఘవ, దుర్గ సంకల్పించడం, అందుకు బాలకృష్ణ తదితరులు చేయూతనివ్వడం, చివరికి సఫలీకృతులు కావటం నేటి పరిస్థితులలో అసహజంగా కనిపించినా... అసాధ్యంమాత్రం కాదనిపించింది.

అయితే ఒక మంచి నవలను చదివామనుకుంటున్న తరుణంలో 'ముగింపు' ఆశాభంగమే కలిగించింది.

-పేరిపు లక్ష్మి
కాకినాడ

## మేలుకొలుపు

*(అయిదవ బహుమతి రు: 50/- పొందిన సమీక్ష)*

**నే**డు ఒకరంగంలో జరుగుతున్న అన్యాయాలను మనసుకు హత్తుకునేలా చూపి, ప్రజలను ఆలోచింపచేసి, పరిష్కారాన్ని సూచించి, సామాజిక మార్పుకు తోడ్పడే అత్యంత శక్తివంతమైన మాస్‌మీడియా సినిమా! ఆ సినిమాకు నేడు గ్రహణంపట్టింది. యువకులలో హింసను, సెక్స్‌ను ప్రేరేపిస్తోంది. ఆవిధంగా వక్రమార్గంలో పయనిస్తున్న నేటి సినీరంగాన్ని సక్రమమార్గంలో నడిపింపచేయాలనే ప్రయత్నమే ఈ నవల. కోట్లు ఖర్చుపెట్టి చెత్తను ప్రొడ్యూస్ చేయకుండా, జనాకర్షణకోసం కృతకమైన డ్యూయెట్లు, రెండర్థాల మాటలు, అశ్లీలత, అసహజత్వాలకు తావులేకుండా, సహజత్వం ఉట్టిపడేలా తక్కువ బడ్జెట్‌తో సినిమా తీసి కృతకృత్యులైన రాఘవ, దుర్గలు నేటి నిర్మాతలకు, దర్శకులకూ ఆదర్శప్రాయులు. ఉదాత్తమైన భావాలతో, కొత్త నటీనటులతో సరికొత్త ప్రయోగాలతో సినిమా తీస్తే ఆర్థికంగా ఫెయిల్ అవుతుందని భయపడే నిర్మాతలకు ఈ నవల నైతికబలాన్ని కలగజేస్తుంది. 'ప్రివ్యూ'ను చూపడంలో కూడా రచయిత చూపిన కొత్తవిధానం హర్షించదగినదిగా ఉంది.

నవల పూర్వార్థంలో రాఘవ, దుర్గల బాల్యం ఆసక్తిదాయకంగా నడిచింది. ఆ తరువాత సినీ నిర్మాణ వివరాలు కొంత విసుగు కలిగించినా, నిద్రావస్థలోఉన్న నేటి సినీరంగానికి మేలుకొలుపు పాడుతూ ఒక ప్రయోజనాన్ని ఆశిస్తూ నవల ముగియటం సంతృప్తి కలిగించింది.

-గుబ్బల సత్యనారాయణరావు
ముమ్మిడివరం



సోషల్‌వర్క్ విద్యార్థిగా పోస్ట్‌గ్రాడ్యుయేట్ పట్టా పుచ్చుకున్న అతడు సభాముఖంగా ప్రొఫెసర్లు, తోటివిద్యార్థులముందు ఒక 'ఆదర్శ ప్రతిజ్ఞ' చేశాడు.

తల్లిదండ్రుల్నీ, తనని ప్రేమించిన మరదల్నీ... అందర్నీ బాధించిన ఆ ప్రతిజ్ఞ ఏమిటి?

దానిని ఆచరణలో పెట్టబోయిన అతడు పొందిన అనూహ్య అనుభవాలు ఎలాంటివి?

హాస్యాన్నందిస్తూనే ఆలోచింపచేసే బలరాం రచన 'హీరో' ఈ నెల చతుర సమగ్ర నవల



# హీరో

— బలరాం

అలలు అలలుగా ఎగిసిపడే సాగరకెరటాలు తీరాన్నితాకుతూ తెల్లటి నురగలు సృష్టిస్తు న్నాయి. నిర్మలాకాశంలో నీలి సముద్రం ప్రతి బింబిస్తోందా... అనిపించేలా ఆకాశం నిండు గా ఉంది. పగలంతా అలసిపోయిన సూరీడు పశ్చిమ కనుమల్లోకి జారుకుంటున్నాడు. పగ టిని రాత్రి ఆక్రమిస్తున్న ఛాయలు వింతగా ఉన్నాయి. గూటికి చేరే కంగారులో దారితప్పి కాబోలు రెండుమూడు పక్షులు ఆకాశంలో ఒంటరిగా ప్రయాణిస్తున్నాయి. ఇన్ని అందాలు సొంతం చేసుకున్న విశాఖతీరం వెలిగిన ముత్యాల దండల్లా బారులు తీరిన లైట్లతో మిలమిల మెరుస్తోంది.

సముద్రతీరానికి అరకిలోమీటర్ ఎగువన పచ్చని చెట్ల తాజాగాలి పూల పరిమళాన్ని మోసుకొస్తోంది. ఎత్తయిన రాతి కట్టడాలమధ్య కొలువుదీరిన చదువులతల్లి 'ఆంధ్రాయూనివ ర్సిటీ ప్రాంగణంలోని 'హర్షవర్ధన్ హాస్టల్, అది. రెండవ అంతస్థులో అరవైతొమ్మిదో నెంబర్ రూంలో, అప్పుడే స్నానం చేసొచ్చి టేబుల్ ఫ్యాన్ ముందుకూర్చుని ఆ సుఖాన్న నుభవిస్తున్నాడు వినయ్. రూంమేట్ బా. పిరాజు బెడ్మీద పడుకొని సినిమా పత్రిక చదువుకుంటున్నాడు.

"రేయ్ బాపి! వెళ్ళి స్నానం చేసిరా అలా సెంటర్ వరకూ వెళ్ళి టీ తాగివద్దాం" అన్నా డు వినయ్.

"స్నానం తర్వాత కానీ పద వెళ్దాం" అంటూ ఉత్సాహంగా లేచాడు బాపిరాజు.

"అరేయ్ మురికిశ్రీ! నీ కంపు నీకిష్టం కావచ్చు, నీ పక్కన తిరుగుతూ దాన్ని నేను భరించాలికదా వెళ్ళి కంపు వదిలించుకురా'' అంటూ ఒక టవల్ బాపిరాజుమీద విసిరాడు వినయ్.

"స్నానం రోజుకో పూట చేస్తే చాలు గురూ రెండుపూటలా చెయ్యాలంటే నీలాంటి ముని పుంగవుడికి తప్ప నాలాంటి వాడికెలా సాధ్య పడుతుందోయ్. దానికి గొప్ప తీరికా, ఓపికా కావాలి మరి'' అన్నాడు బాపిరాజు.

"స్నానం చెయ్యడానికి ఓపిక కావాలా! పిచ్చిగా వాగకు'' అన్నాడు వినయ్.

"అవునోయ్ అసలే ముదిరిపోయిన బ్యాచి లర్ని! పైగా బాత్రూమూ, ఏకాంతం, కూనిరాగం, సడెన్గా ఏ శ్రీదేవో, నగ్మానో, గుర్తొచ్చారనుకో! అపుడెలా? అందుకే స్నాన మంటే భయం" సీరియస్గా చెబుతూ బకెట్ పట్టుకొని లేచాడు బాపిరాజు.

వినయ్ నవ్వకుండా వుండలేకపోయాడు.

"అరే! మరచిపోయాను, మీ మదర్ ఉత్తరం రాసింది. నా టేబుల్ సొరుగులో ఉంది తీసుకో' అంటూ బాతురూంవైపు వెళ్ళిపోయా డు బాపిరాజు.

★ ★ ★

"ఉత్తరం చదివి మూడ్ పాడుచేసుకున్నట్లు న్నావ్. ఏంటి విశేషం!" టీ తాగుతూ అడిగాడు బాపిరాజు.

"ఏముంది చదువు పూర్తికావస్తోంది కదా పెళ్ళి చేసుకోమని రికమండేషన్లు. ముఖ్యంగా మా అమ్మగారు వాళ్ళన్నయ్య కూతుర్ని నాకి చ్చి పెళ్ళి చెయ్యాలని గంపెడంత ఆశతో ఉంది. నాకా మేనరికాలు ఇష్టంలేదు. పైగా జన్యుపరంగా మేనరికాలు మంచివి కావుగ దా! అందుకని మా అమ్మగారు అడిగినప్పుడ ల్లా ఆవిడ మనసు నొప్పించడం ఇష్టంలే క"తర్వాత చూద్దాం ముందు నా చదువు పూర్తికానివ్వండి'' అంటూ నెట్టుకొచ్చాను. ఇప్పుడా విషయం చాలా సీరియస్గారాసిందా విడ" భారంగా చెప్పాడు వినయ్.

"అయితే సెంటిమెంటల్గా బాగా వర్రీ అవుతున్నావన్నమాట. అవున్లే మరి తల్లి మన సు నొప్పించడమంటే సామాన్యమైన విషయం కాదులే. పోనీ మీ నాన్నగారు హైస్కూల్ హెడ్మాస్టర్ కదా విషయం ఆయ నమీదకు తోసెయ్ ఆయనే సమర్ధించుకుంటా రు'' సలహా ఇచ్చాడు బాపిరాజు.

"ఈ విషయంమీదే మా నాన్నగారికీ




అమ్మకూ రోజూ మనస్పర్థలొస్తాయిరా. నాన్న గారు ఎడ్యుకేటెడ్‌గనుక ఆయన నన్ను సమర్థి స్తారు కానీ మా అమ్మగారిది పాతకాలపు మనస్తత్వం. ఆవిడ ఎనిమిదో తరగతివరకే చదివిందిలే! ఎమ్మే చదివిన నాన్నగారితో అప్పట్లో ఆవిడకు ఎలా పెళ్ళయిందో తెలీదు కానీ ఇద్దరూ ఉత్తర దక్షిణ ధృవాలనుకో. ఇద్దరికీ ఎన్ని మనస్పర్థలొచ్చినా ఒకరినొకరు ద్వేషించుకునే స్థాయికి మాత్రం చేరలేదు. ఇప్పటికీ మా నాన్నగారు భోజనం చెయ్యందే ఆవిడెప్పుడూ ముందుగా తినదు. అలాగే ఆవిడెపుడన్నా ఒంట్లో బాగోక భోజనం చెయ్య కపోతే ఆ రోజు నాన్నగారు టీ కూడా అయి ష్టంగానే తాగుతారు. ఆవిడ కోలుకునే వరకు తల్లడిల్లిపోతారు. ఆవిధంగా వుంటుంది వారి జీవితం! వాళ్ళకి ఒక్కగా నొక్కకొడుకుని నేను. బంగారం ముద్దలు చేసి తినిపించినట్లు గా పెంచారు నన్ను. వాళ్ళ ప్రాణాలన్నీ నామీదే. వాళ్ళ కలలన్నీ నా గురించే! అందుకే నేనింత మథనపడేది'' అంటూ హోటల్లో బిల్ చెల్లించి బయటకొచ్చి హాస్టల్‌వైపు వెన్నె ల్లో నడుస్తున్నాడు వినయ్.

వెనకే బాపిరాజు.

"అయితే ప్రస్తుతానికి పరిష్కారంలేని సమ స్య నీది! అన్నిటికీ కాలమే సమాధానం చెబుతుందిలే ప్రస్తుతానికి ఆ విషయం వది లేయ్ అన్నట్టు ఈవాళ బుధవారం కదా! టైంటేబుల్ ప్రకారం మన మెస్‌లో క్యాబేజి కూర- కాకర కాయ పచ్చడీను వాటిని తలుచు కొంటేనే గుండెగుభేలుమంటుంది కానీ పద అలా జగదాంబ సెంటర్‌కెళ్ళి హోటల్లో చికెన్ మంచూరియా. పీతలపులుసుతినొద్దాం, పద" అంటూ వినయ్‌ని ఆ రూట్‌కి మళ్ళించాడు బాపిరాజు.

★ ★ ★

హోటల్లో ఒక మూలగా తమకిష్టమైన అలవాటైన టేబుల్ ముందు కూర్చున్నారు వినయ్, బాపిరాజు. వినయ్ మ్యూజిక్ వింటూ వేళ్లు టేబుల్‌మీదపెట్టి లయబద్ధంగా కదుపు తున్నాడు. బాపిరాజు 'మెనూ' పరిశీలిస్తున్నా డు. వెయిటర్ వచ్చాడు. అయిటమ్స్ ఏం కావాలో బాపిరాజే ఆర్డరిచ్చాడు.

"ఏమిటోయ్ సరదాగా ఏదన్నా మాట్లాడు. సమస్యలు నీకే కాదు కోట్లకు పడగలెత్తిన బిర్లాకి, హర్షద్‌మెహతాకి, ఫుట్‌పాత్‌మీద అడు క్కొనే బిచ్చగాడికి రోడ్డుమీద చిత్తుకాగితాలేరు కునేవాడికి ఎవరి స్థాయిలో వారికి సమస్యలు న్నాయిమరి. వాళ్ళంతా నీలా డీలాపడిపోతు న్నారనుకుంటున్నావా? ఫరెగ్జాంపుల్ హర్షద్ మెహతా! ప్రజలు సొమ్ముదాచుకున్న బ్యాంకులకు ఆయన పెట్టిన కుచ్చుటోపీలన్నీ బయటపడితే ఎట్‌లీస్ట్ మరణశిక్షకన్నా ఎక్కువ శిక్షే పడుతుందట- మరి ఆయన చూడు ఎంచక్కా భారమంతా రామ్‌జెత్మా లానీ మీద కొంత, ప్రధానమంత్రిమీద కొంత వదిలేసి హాయిగా ఫ్రెండ్స్‌తో కలసి స్కాచ్ బాటిల్ మూతలు ఊడబీకుతూ సరదాగా పార్టీలు చేసుకోవడంలేదూ'' అంటూ వినయ్‌ని మూడ్‌లోకి తెచ్చే ప్రయత్నం చేస్తున్నాడు బాపిరాజు.

అతని మాటలు వినయ్‌మీద పనిచేస్తున్న ట్లే వినయ్ మొహం విప్పారింది.

బేరర్ ఫుడ్ అయిటమ్స్, కూల్‌డ్రింక్స్ తెచ్చి టేబుల్‌మీద నీట్‌గా సర్ది వెళ్ళిపోయా డు.

"ఇతరుల ఆనందానికి, తృప్తికీ ప్రాణాల ర్పించి తమ సమస్తం సమర్పించేవాళ్ళనే మంటారు వినయ్?" ప్రశ్నించాడు బాపిరాజు.

"త్యాగశీలురంటారు... ఇంతకీ ఎవరిగు రించి నీవు మాట్లాడేది'' వినయ్ అడిగాడు.

"ఇదిగో ఇపుడు మనం తింటున్న కోడిని గురించే! పాపం ఎక్కడ పుట్టిందో - ఎలా పెరిగిందో ఈరోజు మన విందుకోసం ఆహుతై పోయింది, పిచ్చికోడి'' అంటూ విచారవదనం పెట్టాడు బాపిరాజు.

"ఇదెక్కడి మెట్టవేదాంతంరా బాపీ'' అంటూ వినయ్ నవ్వేశాడు.







# ఉరకలు వేసే వృద్ధాప్యం!

డెబ్బైఏడు సంవత్సరాల వయసులో వురకలు వేసే బిల్‌మెక్క్లింటన్ని చూస్తే ఈ తరం యువత సిగ్గుపడాల్సిందే. కేవలం మూడు సంవత్సరాల కాలంలో 50 గోల్డుమెడల్స్ సంపాదించిన ఈ తాతగారు ఒక్క ఈతలోనేకాక మరెన్నో క్రీడల్లో ప్రముఖుడు. వీటన్నిటితో పాటుగా మాట్లాడటంలో కూడా ఛాంపియన్ అనిపించుకున్నాడు. గంటలతరబడి అనర్గళంగా మాట్లాడతాడీ వృద్ధుడు.రోజూ పొద్దున్నే మూడున్నర కిలోమీటర్ల వరుగు, ఓ కిలోమీటరు ఈతతోపాటు క్రికెట్, డిస్క్‌త్రోయింగ్ మొదలయిన ఆటలెన్నో హుషారుగా ఆడతాడు. క్రానిక్ ఆర్థరైటిస్‌తో బాధపడుతున్నా లాంగ్‌జంప్, హైజంప్‌లాంటి పోటీల్లో మొదటి పేరు ఈయనదే. జీవితంలో సిగరెట్టు కానీ, మధ్యంగానీ ముట్టని బిల్ ప్రతి వ్యక్తికీ సంపూర్ణజీవితం కావాలంటే వ్యాయామం అవసరం అని చెపుతాడు. ఎక్కడో ఆస్ట్రేలియాలో పుట్టిపెరిగిన ఈ ఉక్కుమనిషికి ఓల్డ్‌ఏజ్ హోమ్‌లకెళ్లి అక్కడి వృద్ధులకి చిన్న చిన్న వ్యాయామ పద్ధతులు నేర్పాలని కోరిక.

"మనిషి తాను చేసిన కర్మనుబట్టి వివిధ జన్మలెత్తుతాడని గీతలో చెప్పారు కదా- ఎన్ని జన్మలెత్తినా సరే కోడిగా మాత్రం జన్మించకూడదనుకుంటున్నానోయ్ ఎందుకంటే ఏ అనామకుడి పంటికిందో అన్యాయంగా నలిగిపోవాల్సి వస్తుందా జీవితం" అంటూ మరో జోక్ విసిరాడు బాపిరాజు.

"అంత పాపభీతి ఉన్నవాడివి నాన్‌వెజ్ వదలి పక్కా శాకాహారం తినొచ్చు కదట్రా నీ పేరు చెప్పుకొని కొన్ని మూగజీవాలయినా హాయిగా మరో నాలుగు రోజులు బతుకుతాయి'' అన్నాడు వినయ్.

"అందుకేనోయ్ నేను 'పాపపరిహార ప్రక్రియ' ఒకటి చేపడుతున్నాను నా జీవితంలో ఏదో ఒకటైంలో ఒక కోడిపిల్లనిగుడ్డునుండి బయటపడ్డ క్షణం నుంచి దానికి ముసలి వయసొచ్చి దాని కాలం తీరిపోయేవరకూ భక్తిశ్రద్ధలతో పోషించి అది చనిపోయాక శ్రాద్ధ కర్మలు కూడా శాస్త్రోక్తంగా నిర్వహించి వాటి రుణం తీర్చుకుంటాను'' అన్నాడు బాపిరాజు.

"ఇంకానయం దాన్ని పెళ్ళాడతానన్నావు కాదు'' అన్నాడు వినయ్.

ఇద్దరూ నవ్వుకుంటూ హోటల్‌నుండి బయటకొచ్చి ఆటోని పిలిచి హాస్టల్‌వైపు బయలుదేరారు.

ఎత్తు పల్లాలతో కూడిన రోడ్లుకావడంతో ఆటోలో కొంతదూరం ప్రయాణించి మధ్యలో దిగిపోయి వెన్నెల్లో నడక ప్రారంభించారు.

"మీ నాన్నగారు వచ్చి చాన్నాళ్ళయ్యింది ఎప్పుడొస్తారు'' అడిగాడు బాపిరాజు.

"ఈ వారంలో వస్తారాయన అప్పటికి మన కాలేజి ఫంక్షనూ- ఫేర్‌వెల్ పార్టీలు కూడా అయిపోతాయి. ఇక చదువుకీ ఈ క్యాంపస్‌కీ గుడ్‌బై అన్నమాట" చెప్పాడు.

"మీనాన్నగారు నాకు వెల్ నోటెడ్ అనుకో. మీ అమ్మగారిని నీవద్ద ఉన్న ఫోటోలో తప్ప స్వయంగా చూడలేదు. ఈసారి నీతో వచ్చి మీ అమ్మగారికి నీ ప్రాబ్లెమ్ నచ్చ చెప్పే ప్రయత్నంలో నావంతు కృషి నేను చేస్తాను. మరి ముందుగా మీ అమ్మగారి గురించి కాస్త వివరంగా చెప్పావంటే నేనొక ఐడియా కోస్తాను మరి'' ఆసక్తిగా అడిగాడు బాపిరాజు.

"ఓ.కే. నేను చెబుతూ ఉంటాను నువ్వు సీన్ ఊహించుకో మా నాన్న సూర్యనారాయణ గారు. హైస్కూల్ హెడ్‌మాష్టర్. మా అమ్మ కళ్యాణమ్మగారు. మామూలు గృహిణి- వారికి నేను ఒక్కణ్ణే కొడుకుని! తెలుసుగా, నేనిపుడు ఎం.ఏ సోషల్‌వర్క్ ఫైనలియర్. చకచకా చెప్పసాగాడు, వినయ్!

★ ★ ★

"ఏవండీ పాపం! వాడెలా ఉన్నాడో, ఏం తింటున్నాడో, చూసి చాన్నాళ్ళయ్యింది. మొన్న దసరాకి రమ్మని ఎన్ని ఉత్తరాలేసినా పరీక్షలున్నాయని రానన్నాడు, మీరెళ్ళి చూసిరండీ... మీకే చెబుతుంట! ఒక రెండ్రోజులు హైస్కూల్‌కి సెలవుపెట్టి బాబుని చూసిరండి'' అంది కళ్యాణమ్మ.

సూర్యనారాయణ చదువుతున్న పేపర్లోంచి తల పైకెత్తి ఒక సారి కళ్ళజోడు సరిచేసుకున్నారు "వాడేమీ చిన్నపిల్లాడు కాదు. ఎమ్.ఏ. సోషల్ వర్క్ చదువుతున్నాడు. నువ్వనవసరంగా బెంగపెట్టుకోకు. ఇక్కడ హాఫ్ ఇయర్లీ ఎగ్జామ్స్ జరుగుతుంటే రెండ్రోజులు సెలవు పెట్టి వైజాగ్ ఎలా వెళ్తాను. ఈ విషయం డి.ఇ.ఓ.దాకా వెళ్ళిందంటే ఆయన నన్ను హెడ్‌మాష్టర్‌గా డిస్మిస్ చేసి, అదే హైస్కూల్లో బెల్‌కొట్టే అటెండర్ ఉద్యోగంలో వేస్తాడనే ఇంగితజ్ఞానం కూడా లేకుండా మాట్లాడుతున్నావ్. సరేగానీ నేనిప్పుడన్న "ఇంగితజ్ఞానం" అనే మాట పెద్ద తిట్టేమీ కాదు నువ్వనవసరంగా ఆందోళనపడకు'' అంటూ మళ్ళీ పేపర్లో తలదూర్చాడు సూర్యనారాయణ.

"హు... నామాట ఎప్పుడు విన్నారు కనుక బుద్ధి తక్కువై అడిగాను లెండి పాపం వాడికి గారెలంటే ఎంతో ఇష్టం. నేతిలో ముంచుకొని సంబరంగా తినేవాడు. పొద్దుట చేసిన గారెలు




వాడు గుర్తొచ్చి తినలేకపోయాను. మీకేం తెలుసు తల్లిప్రేమ. నెలకో వెయ్యి రూపాయలు పంపించి చేతులు దులుపుకుంటారు'' అని దిగులుగా అంది కళ్యాణమ్మ.

"వైజాగ్‌లో కూడా గారెలుంటాయి. ఆ విషయానికొస్తే అమెరికాలో కూడా హొటళ్ళుంటాయి. వాటిలో వేడివేడి గారెలు దొరుకుతాయి. నువ్వు మరీ సెంటిమెంట్ ఫీలవ్వకు. సరేగానీ నేనన్న సెంటిమెంట్ అనే పదంలో ఎలాంటి నిందా లేదు నువ్వు బెంబేలు పడకు'' అన్నాడు సూర్యనార్యాయణ.

ఆ మాటకు కళ్యాణమ్మకు కోపం వచ్చి విసురుగా లోనికెళ్ళిపోయింది. ఒక పావుగంట తర్వాత గ్లాసుతో కాఫీ తెచ్చి ఆయన ముందు పెట్టింది.

"మీతో ఒక ముఖ్యవిషయం మాట్లాడాలి మా అన్నయ్య నిన్నొచ్చి మళ్ళీ గుర్తుచేశాడు. ఏ విషయమూ చెప్పేయండి మా అనసూయకు చాలా సంబంధాలొస్తున్నాయి మరి మేం కూడా మా జాగ్రత్తలో ఉండాలి కదా అన్నాడండీ'' చెప్పింది కళ్యాణమ్మ.

"ఇది చాలా పాత విషయం. దీనికి నువ్వు 'ముఖ్యమయిన విషయం' అని గొప్ప పేరు పెట్టినందుకు నేను చాలా చింతిస్తున్నాను. ఇక మీ అన్నయ్య సంగతికొస్తే వాళ్ళమ్మాయి మనబ్బాయి కోసమే పుట్టిందని నేననుకోవటంలేదు. పూర్తిగా అది అతని భ్రమే. పెళ్ళి చేసుకొనేవాడి ఇష్టాయిష్టాలెలా ఉన్నాయో తెలుసుకోకుండా ఈ విషయం నువ్వూ నేనూ చర్చించటం ఇండియా- పాకిస్థాన్‌లలాగ ఒక నిర్దిష్టమైన "ఇగో" లేకుండా శాంతి ప్రయత్నాలు చేసినట్లే అవుతుంది. సరే గానీ నేనిప్పుడన్న "ఇగో" అన్న పదంలో ఎలాంటి చెడ్డ మీనింగూ లేదు సుమీ! నువ్వనవసరంగా హైరానా పడకు'' తన సహజధోరణిలో చెప్పారు సూర్యనారాయణ.

కళ్యాణమ్మకు కోపం వచ్చింది.

"వాడిష్టమేంటి! బోడి సలహా మీరూనూ... వాడు నా మాట కాదనడు. ఆరు నూరైనా నూరు ఆరైనా మా అన్నకూతురితో వాడి పెళ్ళి జరగాల్సిందే. అనసూయకేం తక్కువ! చారడేసి కళ్ళు, గుండ్రటి మొఖం, దబ్బపండులా బొద్దుగా వుంటుంది. ఆస్తిలో మనతో సమానంగానే వున్నారు. లక్షణమైన మేనరికాన్ని వదలి బయటి పిల్లని చేసుకొంటే నా తరపు బంధువులంతా నన్నాడిపోసుకోరూ'' అంది ఆవేశంగా.

"సరే అలాగే కానియ్. వాడొప్పుకుంటే మధ్యలో సైంధవుడిలా నేనెందుకడ్డుపడతాను. కానీ వాడు పక్కా తెలివైనవాడు మేనరికాలు అంత మంచివి కావనే విషయం వాడు టెన్త్ క్లాస్‌లోనే గ్రహించి ఉంటాడు. ఒకవేళ వాడికి తెలీకపోయినా మేనరికాలు ప్రోత్సహించడం తెలివైన తల్లితండ్రుల లక్షణం కాదు. నువ్వు అమాయకంగా తీసుకునే నిర్ణయం అమలు జరిగితే నీ ముద్దుల మనవడిని కోతిలాగానో- కొక్కిరాయిలానో చూడాల్సి వస్తుంది. దానికి కారణం 'జెనిటిక్స్'. ఇది నీకు తెలీదు చెప్పినా అర్థం కాదు. సరేగానీ నేనిప్పుడన్న 'జెనిటిక్స్' అనే మాట సైన్స్‌కి సంబంధించింది అంతే గానీ నిన్ను కించపరచడానికి నేను చేసిన ప్రయత్నం ఏమీ కాదని గమనించు'' అన్నాడు సూర్యనారాయణ.

"సరే మీతో వాదించే ఓపిక నాకు లేదు కానీ వాడొచ్చాకే అన్నీ తేల్చుకుందాం. మధ్యలో మీరక్కడకు వెళతారుకదా వాడి మనసు మార్చే ప్రయత్నం మాత్రం చేయకండి. అలా చేశారో ఈ సంవత్సరం ఆవకాయ, బూడిది గుమ్మడి కాయ వడియాలు చెయ్యడం మానేస్తాను. మీరీ ఏడాదంతా బజార్లో దొరికే బూజుపట్టిన ఆవకాయతోనే తిప్పలు పడాల్సివస్తుంది. నేను చేసే ఆవకాయ, వడియాలు లేకుండా మీకు ముద్దదిగదన్న సంగతి మరచిపోకండి'' అంటూ కళ్యాణమ్మగారు విసురుగా లోనికెళ్ళిపోయింది

"ఆవకాయమీద మక్కువ, వడియాలమీద ఇష్టం నాకుంటే ఉండవచ్చుగాక, కేవలం ఆ చిన్న పాయింటే ఆధారంగా నన్ను బెదిరించా




లనుకోవడం చాలా హాస్యాస్పదమైన విషయం. పక్కా బ్లాక్‌మెయిలింగ్! ఇక్కడ మనిద్దరం ఉన్నాం కనుక సరిపోయింది మూడో మనిషుంటే నీ ప్రతిజ్ఞ విని ఫక్కున నవ్వుతారు. ఇక నుండి నీవు ఏ ప్రతిజ్ఞ చేసినా నా హెడ్ మాష్టర్ స్థాయికి తగ్గని విధంగా ప్రయత్నించు నాకూ ఆనందంగా వుంటుంది'' అంటూ ఆమెకు వినిపించేలా తన స్వరాన్ని పెంచి చెప్పారు సూర్యనారాయణ.

★ ★ ★

"అదిరా మా ఇంటి వాతావరణం అర్థమయ్యిందా'' చెప్పాడు వినయ్.

"అర్థమయ్యింది. ఇద్దరివీ భిన్నదృక్పథాలు అయినా బ్యాలన్స్ తప్పని అనుబంధం వారిమధ్య ఉంది. మీ అమ్మగారు నీవు ఒప్పుకుంటావని హండ్రెడ్ పర్సంట్ కాన్ఫిడెన్స్‌తో ఉంది. ఏం జరుగుతుందో ఎలా జరగాలో మాత్రం మీ నాన్నగారికి తెలుసు. ఇక జరిగే కార్యక్రమాలకు బాధ్యత వహించే ప్రముఖ వ్యక్తివి నీవే'' అన్నాడు బాపిరాజు.

"ఒకరి వత్తిడితో జరిగే పెళ్ళిళ్ళు తర్వాత చాలా కాంట్రవర్సీగా మారతాయని నా ఉద్దేశ్యంరా. కేవలం ఒక ఆడ, ఒక మగ అనే రెండు శరీరాల్ని కలిపినంతమాత్రాన పెళ్ళి అనే పదానికి పవిత్రత వస్తుందనుకోను. జీవితంలో మూడొంతుల కాలాన్ని లైఫ్ పార్టనర్‌తో గడపాల్సి ఉంటుంది కనుక అందంగా ఉందనో, ఆస్తి ఉందనో, అందుబాటులో ఉందనో తొందరపడి లాటరీ పద్ధతిలో సెలక్ట్ చేసుకోవడం చాలా అర్థరహితమైన విషయం. ఉదాహరణకి నా మేనమరదలు అనసూయనే తీసుకుందాం. ఆమె నా మరదలు అనే తప్ప ఆమెమీద నాకెలాంటి అభిప్రాయమూలేదు. ఆమె ఐస్‌క్రీములకోసం పేచీ పెట్టే రోజుల నుంచీ నాకు తెలుసు. కాస్త వయసొచ్చాక లగ్జరీగా అలంకరించుకోవడం వెరైటీ డ్రస్‌లు కట్టుకోవడం ప్రారంభించింది. అది చూసి మా

అమ్మలాంటి వాళ్ళకు ఆమె గొప్ప అందా లరాశి అనే అభిప్రాయం ఏర్పడిపోయింది తప్ప ఆమె అంతరంగం గురించి వాళ్ళెవరూ తెలుసుకొనే ప్రయత్నం చేయలేదు. స్వతహాగా నాకున్న పరిశీలనా దృష్టితో ఆమెను చాలాసా ర్లు గమనించాను. ఆమెకు తన అందాలను డ్రస్సులను ఎదుటి వాళ్ళు గమనించాలనే తహతహలెక్కువ. అఫ్‌కోర్స్ ఆ వయసులో సహజమనుకో ఒకసారి మా బంధువులతను చనిపోతే అక్కడికి కూడా ఆమె వాళ్ళ నాన్నతో ఫుల్ మేకప్‌తో వచ్చింది. అందరూ లోలోపల ఆమె గురించి మరో విధంగా అనుకోవచ్చు కదా. అలాంటి సున్నితమైన విషయాల్లో ఎలా ప్రవర్తించాలో ఆమెకు తెలీదు. సాధారణంగా ఆడపిల్లలు పదునాలుగోయేటనుండే డిగ్నిఫైడ్ గా ప్రవర్తించడం ప్రారంభిస్తారు. అనసూ యకు పంతొమ్మిదేళ్లొచ్చినా అలాంటి హుందా తనపు ఛాయలు మచ్చుకైనా కనిపించవు. పైగా లేకితనం కొట్టొచ్చినట్లు కనిపిస్తుంది. ఈ వయసులో ఇలా ఉంటే ప్రవర్తనా పరంగా ఆమె ముందు ముందు నేర్చుకొనేదేమీ ఉండ దు. అహాన్ని, గర్వాన్ని, పెంచుకోవడం తప్ప. మరి అలాంటామెతో నా జీవితం ముడిపెడితే ఎలా ఉంటుందంటావ్'' చిన్న బ్రేక్ ఇచ్చాడు వినయ్.

"ఇంపాజిబుల్! నందికీ పందికీ ఉన్నంత డిఫరెన్స్ ఉంటుంది. అనసూయలాంటి వాళ్ళ కి, చిరంజీవి, సుమన్ లాంటి వెండితెర హీరోలు అర్ధమయినంత ఈజీగా మన, ఐమీన్... నీ సల్స్ దొరకడమంత సులభం కాదు వినయ్. మరి నీ దృష్టిలో ఎలాంటి ఐడియల్ ఉమెన్ దాగివుందో నాకు తెలీదు కదా'' బాపిరాజు సందేహం వెలిబుచ్చాడు.

"నాకాబోయే భార్య ఇలా ఉండాలి అలా ఉండాలి అని నేనేమీ ఊహించుకోలేదింతవ రకూ! కానీ అనసూయలా మాత్రం ఉండకూడ దనిపిస్తుంది. నా సైకాలజీ నీకు కొంత తెలుసు గదా! పరిస్థితులనుబట్టి నేనో నిర్ణయం తీసు కుంటాను అది మిగతా వాళ్ళకు నచ్చనీ నచ్చకపోనీ నేను అమలు జరుపుతాను. నా చర్యలవల్ల సమాజానికి ఎలాంటి హాని జర గని విధంగా నా జీవితాన్ని నేను సమర్ధ వంతంగా నెట్టుకురాగలను. అంటూ కాస్త ఉద్వేగంగా చెప్పాడు వినయ్.

"అంటే'' బాపిరాజు క్వశ్చన్‌మార్క్ ము ఖంపెట్టాడు.

"ఒక అందమైన అమ్మాయికి చదువు, ఉత్సాహవంతమైన ప్రవర్తన, ఉద్యోగం, ఉందనుకో ఆమెను పెళ్ళాడటానికి యువకు లంతా పోటీ పడొచ్చు. అదే అమ్మాయి యాదృచ్ఛికంగా జరిగిన ఏక్సిడెంట్లో తన అందాన్ని కోల్పోయి అవిటిగా మిగిలిందనుకో ఆమెను పెళ్ళాడటానికి కాదుకదా కన్నెత్తి చూట్టానికి కూడా వారిలో నూటికి నూరు శాతం యువకులు సాహసించలేరు! కారణం గ్లామర్! అది లేకుండా ఆడపిల్లను యువకులు అంత తొందరగా ఐడెంటిఫై చేయలేరు. కానీ నేను అలాంటి అవిటి అమ్మాయిని కూడా పరిస్థితులు ప్రోత్సహించినపుడు పెళ్ళాడగల విధంగా ఉండాలంటే నీవు ఒప్పుకుంటావా! నా శ్రేయస్సుకోరే ఫ్రెండ్‌గా నీవు సమర్ధించవు కానీ నా ఆశయాల దృష్ట్యా, నాకున్న బాధ్య తల దృష్ట్యా నేను ఆ పని ధైర్యంగా చేయగలిగి ఉండాలి. అందుకు ఎవరు అభ్యంతరం చెప్పి నా విననక్కర్లేని స్థితిలో ఉండాలి'' అంటూ సీరియస్‌గా వివరణ ఇచ్చాడు వినయ్.

ఆశ్చర్యంతో కొన్నిక్షణాలు తబ్బిబ్బయ్యా డు బాపిరాజు.

"వినయ్! నీవు చిన్నప్పటినుండీ కొన్ని ఆశయాలు, ధ్యేయాలు పెట్టుకుని పెరిగావని నీ ప్రవర్తనే చెబుతుంది. యూనివర్సిటీలో నిన్ను చూసిన మొదటిరోజులలోనే నీ స్వభావా నికి నేను ఎంతో ఆనందపడ్డాను. హాస్టల్లో నాకు సహచరుడిగానే వస్తున్నావని తెలిసి నా ఆనందానికి అవధుల్లేకుండా పోయాయి. నిజా నికి తెగిన గాలిపటంలా తిరిగే నన్ను దారిలో పెట్టింది నువ్వే! ఆర్థికంగా బాధపడుతున్న

నన్ను గర్వంగా తలెత్తుకునేలా చేశావు. ఈ బట్టలు కూడా నీవు కొనిచ్చినవే జీవితాంతం నీకు నేను కృతజ్ఞుడిగా వుంటాను. ఇవన్నీ ఎందుకు చెబుతున్నానో తెలుసా! వినయ్ నీలో మానవతా విలువలున్నాయి. అందరిలా కాకుండా సమాజానికి ఏదో చెయ్యాలనీ, ఉపయోగపడాలనీ నిరంతరం ఆలోచిస్తావు. జీవితాన్ని కమర్షియల్ చేసుకోవడం నీ కిష్టముండదు. కానీ, వినయ్! దయచేసి నీ జీవితాన్ని మాత్రం ఆశయాలకు, అర్థంలేని ఆదర్శాలకే బలిచేయకు. నీవన్నావె అవిటమ్మాయని, అవన్నీ భరించి ఎవరిని ఉద్ధరిస్తాం కన్నవాళ్ళనీ, అయినవాళ్ళనీ క్షోభకి గురిచేయడం తప్ప అందులో ఆనందమే ముంది? సుఖాలూ, సంతోషాలూ లేకుండా జీవితాంతం బాధలతో వ్యధలతో బతకాలనా నీ ఉద్దేశ్యం. నీవు నీ సిద్ధాంతాలకోసం తీసుకొనే నిర్ణయాలకంటే నీ అనసూయే బెటర్ అనిపిస్తోంది నాకు. పోనీ, అనసూయ కాకపోతే అనంతలక్ష్మి ఎవరోకరు నీకు నచ్చిన అమ్మాయితో హాయిగా జీవితాన్ని పంచుకో ప్లీజ్' అంటూ బాపిరాజు భావోద్రేకంతో చెప్పాడు.

"నా శ్రేయస్సుకోరుతున్నందుకు నీకు నా అభినందనలు చెబుతున్నాను బాపీ. కానీ నా జీవన విధానాన్ని ఎవరూ మార్చలేరంతే. అనసూయ నాకిష్టంలేదు దట్సాల్. జీవితంలో నీవు నన్నెప్పుడడిగినా అదే నా సమాధానం' అన్నాడు వినయ్.

హాస్టల్ సమీపించింది! దార్లో కనిపించిన ఫ్రెండ్స్‌ని విష్‌చేస్తూ రూంకి చేరుకున్నారిద్దరూ.

"రేపు ఫైనల్ క్లాస్. ప్రొఫెసర్ గోపాలకృష్ణగారు మనల్ని చాలా క్వశ్చన్స్ అడుగుతారు ప్రిపేరవ్వు'' అంటూ వినయ్ ఒక పుస్తకాన్ని బాపిరాజువైపు తోశాడు.

అప్పటికే బాపిరాజు మంచంమీద వాలి కాళ్ళు తేలేసి "ఏం నడిచాంరా బాబూ కాళ్ళు పట్టేశాయి. ప్రొద్దుటేలేచి చదువుదాంలేవోయ్. ముందు ముసుగుదన్ని పడుకో' అంటూ లైట్ ఆర్పేశాడు. వినయ్‌కి కూడా బద్ధకంగా ఉండటంతో మంచంమీద వాలిపోయాడు.

ఎంత అలసిపోయినా వినయ్‌కి వెంటనే నిద్రరాదు. తనకలవాటయిన రీతిలో ఒక దృశ్యాన్ని ఊహించుకుంటూ ఉంటాడు. సముద్ర తీరం, తెల్లని పండువెన్నెల, ఒక తెల్లగుర్రం. దానిపై అస్పష్టంగా- ఫలానా అని తెలీని అందమైన అమ్మాయి స్వారీ చేస్తూ తీరం వెంబడి వెన్నెల్లో- గాలిలో తేలే దూదిపింజలా తేలిపోతూ మెల్లగా కదలిపోతుంటుంది.

అలా చాలాసార్లు ఆ దృశ్యాన్ని ఊహించుకుంటూ మగతగా నిద్రలోకి జారిపోతాడు వినయ్.



ఉదయం తొమ్మిదయింది...

"ఈ బ్లూషర్ట్ బ్రౌన్ ప్యాంట్‌మీద టక్ చెస్తే ఎలా ఉంటుందోయ్- మెకన్నాస్ గోల్డ్ సినిమాలో ఉమర్ షరీఫ్ డ్రెస్‌లా ఉంటుందా?" బ్లూషర్ట్ టక్ చేసుకుంటూ అడిగాడు బాపిరాజు.

"ఉమర్‌షరీఫ్ నీలా గంటల తరబడి గుడ్డలు మార్చుకోడు! ఆ సినిమాలో చివరికంటా ఒకటే ప్యాంట్ ఒకటే షర్ట్‌తో ఉంటాడు కానీ, ముందు నువ్వు త్వరగా కానియ్, మెస్‌కెళ్లి టిఫిన్ చేసే పనొకటుంది కదా" అన్నాడు వినయ్.

అంతకుముందే వినయ్ నీట్‌గా డ్రస్ చేసు




కొని వరండాలో కొచ్చి బాపిరాజుకోసం నించు న్నాడు.

"అబ్బే ఈ బ్లూషర్ట్ పెద్ద ఎఫెక్టివ్‌గా లేదోయ్! క్రీమ్‌కలర్ షర్ట్ వేసుకుంటాను'' అంటూ బ్లూ షర్ట్ విప్పేశాడు బాపిరాజు.

"సరే తీరుబడిగా నీకు నచ్చిన బట్టలు మార్చుకొనిరా నేను టిఫిన్ చేసి క్లాసుకెళ్ళిపో తా'' అంటూ వినయ్ అక్కడినుండి విసురుగా కిందికి దిగొచ్చేశాడు.

"వచ్చేస్తున్నా బాసూ, వన్‌మినిట్'' అంటూబాపిరాజు రూం లాక్‌చేసి క్రీమ్ కలర్ షర్ట్ తొడుక్కోకుండానే దాన్ని బుజాన వేసు కొని వినయ్ వెనకే పరుగు ప్రారంభించాడు.

వినయ్ క్యాంపస్‌లో నడుస్తున్నాడు. బా పిరాజు నడుస్తూనే షర్ట్ తొడుక్కొని టక్ చేసుకున్నాడు. హాస్టల్లో టిఫిన్ చేసి తమ సోషల్‌వర్క్ డిపార్ట్‌మెంట్‌వైపు నడక ప్రా రంభించారు.

"ఇక వారం పదిరోజుల్లో మనం ఈ మెస్‌కి దూరమైపోతాంరా వినయ్. ఎంత గొప్పగా వంటలు చేయించినా పరమ చండాలంగా ఉన్నాయంటూ వార్డెన్ని ఏడిపించేవాడిని. సొంత ఇంట్లో కూడా చేయని అల్లరి ఈ ఐదేళ్ళూ హాస్టల్లో ఎలా చేసాన్రా. ఇపుడు వాటన్నిటికీ దూరమైపోతున్నాం. మనకోసం అలా వండిపెట్టి మనం ఏమన్నా అంటా మేమో అని భయపడుతూ వడ్డించే ఇలాంటి ఆత్మీయులు మన ఇళ్ళల్లో దొరుకుతారా'' అంటూ బాపిరాజు కొంచెం ఎమోషనల్‌గా మాట్లాడే సరికి వినయ్ ఆశ్చర్యపోయాడు. బాపిరాజువైపు తిరిగి "మనం బాగా చదువు కొని ఏదో ఉద్ధరిస్తామని గవర్నమెంట్ మన లాంటి విద్యార్థులమీద ఎంత ఖర్చుపెడు తోందో తెలుసా! ఈ యూనివర్సిటీలో ఎం.ఏ. డిగ్రీ తీసుకుపోయే ప్రతి విద్యార్థిమీదా కనీసం ఐదులక్షలు ఖర్చుపెడుతోంది. ఇంతా చేస్తే మనం ఉద్యోగాల్లో స్థిరపడ్డాక లంచగొండుల మై గవర్నమెంట్‌కి సక్రమంగా చెల్లించాల్సిన పన్నులు కూడా ఎగ్గొట్టి సదా నష్టపరుస్తునే వుంటాం. మరి మనకెందుకు ఇన్ని వసతులు కల్పిస్తుందో తెలీదు. ఇదే పెట్టుబడి ఒక శ్రామికుడికి పెడితే వాడు రోజంతా కష్టపడి పనిచేసి మూడేళ్లల్లో ఐదు లక్షలకి పదిలక్షలు లాభం చూపిస్తాడు. తన పొట్టనిండినందుకు జీవితాంతం కృతజ్ఞుడై ఉంటాడు. మరి మన మేం చేస్తున్నామో తెలుసా! కోడి కూరలో పిండుకోడానికి నిమ్మకాయ సకాలంలో టేబుల్ మీదకు రాలేదని బందులూ, హర్తా ళ్ళూ నిర్వహించి వార్డెన్‌తో క్షమాపణలు చె ప్పించుకొని, అతని ఉద్యోగం పీకించి, అతని మీద ఆధారపడిన వాళ్ళ కుటుంబ సభ్యు లందరి నోళ్ళల్లో మట్టికొడుతున్నాం. అందుకే నేను చెప్పేది. 'విద్యార్థిగా విద్యనే నేర్చుకోవా లని రాజకీయాలతో చుట్టూ ఉన్న వాతావరణా న్ని కలుషితం చేయవద్దని'.

"బాపీ నీవు హాస్టల్లో సరదాకో, తోటి ఫ్రెండ్స్‌లో నీ పాపులారిటి పెరగడానికో గిన్నె లు నేలకేసి కొట్టినా నేను అప్పుడేమీ అనలేదు! ఎందుచేతో తెలుసా 'నీవు ఇలా పశ్చాత్తాపప డే రోజు వస్తుందని ఊహించాను కనుకే'

"బాసూ నీవు సామాన్యుడివికావు. మా లాంటి వాళ్ళకి ముందుచూపు ఉండదు. తా త్కాలిక ఆనందానికికన్నూమిన్నూ కాన కుండా ప్రవర్తించి ఇదిగో ఇలా బాధపడతా మని మాకప్పుడు తెలీదు వినయ్. చేతులు కాలేక బర్నాల్ రాసుకోవడం తప్ప అసలు చేతులు కాలకుండా ప్రవర్తించడం నీకు తెలి సినంత నేర్పుగా నాకసలు తెలీనే తెలీదు.'' అన్నాడు బాపిరాజు.

"అది నేర్పు కాదురా ఓర్పు. ఓర్పు కావాలంటే బుద్ధి ఉండాలి. బుద్ధి కావాలంటే విజ్ఞానం కోసం శ్రమించాలి. శ్రమించాలంటే నిశ్చలమైన సంకల్పసిద్ధి కావాలి. సారీ నీకు భగవద్గీత బోధిస్తున్నాననుకోకేం" నవ్వుతూ చెప్పాడు వినయ్.

"మంచిని గూర్చి చెప్పే నీలాంటి వాళ్ళు



నాకు సాక్షాత్తు శ్రీకృష్ణభగవానులతో సమానం. ఆయన దేవుడో కాదో వేరే విషయం. సమాజానికి ఉపయోగపడే సత్యాలను బోధించి ఆది కాలంలోనే ఆయన చక్కటి సోషల్‌వర్క్ చేపట్టాడనిపిస్తుంది'' బాపిరాజు చెబుతున్నాడు. ఇంకో నలభై గజాలు నడిస్తే వినయ్ వాళ్ల క్లాస్‌రూం వస్తుంది. అక్కడ నాలుగువైపులా వెళ్ళే క్రాస్‌రోడ్స్ ఉండటంతో చాలా మంది ఫ్రెండ్స్ ఎదురవుతుంటారు.

ఎప్పటిలాగానే వినయ్ అక్కడకు రాగానే అలవాటుగా నలుదిక్కులూ పరికించి చూశాడు. దూరంగా వనకన్యలా లయబద్ధంగా అడుగులు వేసుకుంటూ, చెక్కు చెదరని చిరునవ్వుతో ఒంపుతిరిగిన పెదాలతో, గాలికి ఊగిసలాడే జాజికొమ్మల్లాంటి కురులను సవరించుకుంటూ, ఎగురుతున్న దూదిపింజలా గాలిలో తేలుతూ వస్తోందా అని భ్రమ కలిగించేలా గమ్మత్తయిన నడకతో వస్తోంది వసంత.

వినయ్‌కి ఆమె అలా నడచి వెళుతుంటే చూడటం, కనుచూపు మేరలో ఆమె కనిపిస్తే ఆమె తన కళ్ళముందుగా కదలి వెళ్ళిపోతుంటే, కొన్ని క్షణాలు మధురమైన ఆనందానికి లోనుకావడం చాలా ఇష్టమైన విషయం.

వినయ్ ఆగాడు. బాపిరాజుకి ఆ సంగతి తెలుసు గనక వినయ్ పక్కనే నిలబడ్డాడు. వసంత చాలా దూరంనుంచే వ్యక్తులను గమనిస్తోందేమో దగ్గరగా వచ్చేక ఎవరినీ చూడకుండా ఎదురుగా కొంతమంది మనుషులు ఉన్నారనే స్పృహే లేనట్లు నడచి వెళ్ళిపోతోంది

వినయ్ యూనివర్సిటీకొచ్చిన రోజునుంచీ ఎంతో శ్రద్ధగా ఆమెని గమనిస్తూనే వున్నాడు. ఆమె క్యాంపస్‌లో ఎక్కడెదురైనా చాలామంది గుడ్లప్పగించి చూస్తారు. కానీ ఆమె నావంక చూసింది అని ధైర్యంగా చెప్పగలిగే కుర్రాడే లేడంటే ఆమె ఎంత చాకచాక్యంగా ప్రవర్తిస్తుందో అనే విషయం వినయ్‌కి చాలా ఉద్వేగాన్ని కలిగిస్తుంది. యూనివర్సిటీలో తన కళ్లముందు ఎందరో కుర్రాళ్లు కాస్త నీటుగా అలంకరించుకొచ్చిన అమ్మాయిలను టీజ్ చేశారు. కానీ వసంతని ఎవరూ అలా చెయ్యడం గమనించలేదు. అందుకు ఎవరూ సాహసించలేదు. బహుశా ఆమె తన ప్రవర్తన తోనే ఎదుటివారిని హద్దులో ఉంచగల సమర్థురాలని కాబోలు. ఎవరూ ఆమెను పలకరించే ప్రయత్నంచేయరు. ఆమెకి ఆడ స్నేహితులు కూడా తక్కువే! ఇద్దరే ఇద్దరు, బహుశా ఆమె రూమ్మేట్స్ కాబోలు, ఎపుడన్నా వాళ్లతో కనిపిస్తుంది అంతే!

వినయ్ ఊపిరి బిగబట్టాడు. తన కళ్ళ ముందుగా ఓ ముగ్ధమనోహర దృశ్యం కదలిపోయింది. ఎప్పటిలాగానే వసంత వినయ్‌ని, బాపిరాజుని కన్నెత్తి చూడనేలేదు.

పొరపాట్న అయినా చూస్తుందేమోనని వినయ్, బాపిరాజు ఆశపడుతుంటారు. ఈ విషయంలో వసంత ఎప్పుడూ ఓడిపోదనే వినయ్ నమ్ముతాడు. ఆమె పేరు వసంత అని కూడా వినయ్‌కి తెలీదు. ఎవరో పక్క డిపార్ట్‌మెంట్ అమ్మాయి. బహుశా ఎకనామిక్స్ క్లాసు కాబోలు అటే వెళుతోంది. అంతే తెలుసు వినయ్‌కి. ఆమె విషయంలో కామెంట్స్‌కి వినయ్ అవకాశమివ్వడు కనుక బాపిరాజు నోరు మూసుకుంటుంటాడు.

"హల్లో... మెరుపుతీగ వెళ్ళిపోయింది'' అంటూ వినయ్ కళ్ళముందు బాపిరాజు అటు ఇటు చెయ్యి ఆడించాడు.

వినయ్ నవ్వాడు.

"అవునూ నీవెన్నో నీతులు చెబుతావు. పైగా కొన్ని ప్రిన్సిపుల్స్‌కి లోబడి ఉంటావుకదా! మరి ఆ ఒయ్యారిని చూడగానే ఇంచుమించు నిషాలోకి వెళ్ళిపోతావేం గురూ! రెండేళ్ళనుంచి చూస్తున్నాను. ఆమెను అలా చూస్తూనే ఉన్నావు. ఒకవేళ నీకు లైకింగనుకో కనీసం మాట్లాడే ప్రయత్నం చేయచ్చుకదా.. ఒకవేళ ఆ విషయంలో నీకు భయమనుకో

 

నాలాంటి జేమ్స్‌బాండ్స్‌ని సలహా అడగొచ్చు కదా! ఏంటోగురూ నీవు దూకవు. నన్ను దూకనివ్వవు. ఆమె విషయంలో గతంలో నేను నోరుజారితే నా నోటినిండా ఇసుకపోసేవాడివి. మరి నీవు చేస్తున్నదేంటి? ఎన్నాళ్ళిలా? ఆమె స్లోమోషన్‌లో నీ కళ్ళముందు వెళ్ళిపోతుంటే నీవేమో చాలా డీప్‌గా భావప్రాప్తి పొందుతుంటావు. అంతేలే తాను చేస్తే శృంగారం. మిగతావాళ్ళు చేస్తే వ్యభిచారం" బాపిరాజు తన బాధనంతా వెళ్ళగక్కాడు.

"బాపీ నీకెన్నోసార్లు చెప్పాను. సృష్టిలో అందమైన భావాలెన్నో... అందులో స్త్రీ ఒకటి"

వినయ్ చెబుతుండగా బాపిరాజు మధ్యలో కల్పించుకొని "ఇదేదో విమల్‌వాళ్ళ ఆడ్ కొటేషన్‌లాగుందే'' అన్నాడు.

"ఎగ్జాక్ట్‌లీ... విమల్‌వాళ్ళకి ఆ కొటేషన్ ఇచ్చిన మహానుభావుడెవరోకానీ రెండుమాటల్లో స్త్రీ గురించి చాలా చెప్పేశాడు. అందమైన ఆడపిల్ల కనిపిస్తే నీలాంటి సగటు యువకులు కీటకాల్లాగ ఆమెను ప్రేమించాలనుకోవడం, ఆమెను వలలో వేసుకొనే ప్రయత్నాలు చేయడం, వీలు దొరికితే ఆమెను అనుభవించడంలాంటి చిల్లర కోర్కెలకు నేను చాలా దూరమని నీకు తెలుసు. నేనింతకాలం ఆమెను ప్రేమతోనో, కోరికతోనో చూస్తున్నాననుకోవడం నీ అవివేకం" చెప్పాడు వినయ్.

"అంటే ప్రేమా లేకుండా, కోర్కె లేకుండా ఒక బ్రహ్మాండమైన అమ్మాయిని ఇంక దేని కోసం చూస్తారబ్బా'' బాపిరాజు సందేహం వెలిబుచ్చాడు.

"చూడు బాపిరాజూ! నా అంతరంగం గురించి పూర్తిగా చెప్పాలనుకోవడంలేదుకానీ ఫ్రెండ్‌వి కనుక నీకు నా గురించి కొన్ని తెలియాలి కనుక చెబుతున్నాను. నాకు పండు వెన్నెల్లో చందమామని చూడటం ఇష్టం. మేడపై పడుకొని కొబ్బరాకుల సందుల్లోంచి గంటలతరబడి అలా చూస్తూనే ఉంటాను. ఎందుకంటే దానికి ఇష్టం అని ఒక చిన్న పేరు పెట్టడానికి నా మనసొప్పుకోదు. ఇష్టంకన్నా ఎక్కువ విలువ కలిగిన అంశమిది. ముద్ద బంతి పూలను చూస్తే నాకు చెప్పలేని ఆనందం. వాటిని చెట్టుమీదే చూడటం నాకత్యంత ఇష్టమైన కోరిక. ఈ విశాఖపట్నంలో ఎన్నో విదేశీ స్వీట్లు దొరుకుతాయి. కానీ మా అమ్మ సంక్రాంతికి చేసే పాలన్నంముందు అవన్నీ బలాదూర్. ఎందుకు? అనుభవమే తప్ప సమాధానం దొరకని మధుర భావాలవి. వాటన్నిటిలానే ఆ అమ్మాయి కూడా. ఎందుకో ఆమెను అలా చూడటం ఇష్టం. అఫ్‌కోర్స్... ఆమె కనిపిస్తేనే సుమా. రోజంతా ఆమెకోసం ఆలోచించను. ఆమె అందాలను విడివిడిగా గమనించే ప్రయత్నం నేనెప్పుడూ చేయలేదు. కొన్ని వందలమంది అమ్మాయిలు మన కళ్ళ ముందు ఈ కాంపస్‌లో అప్రయత్నంగా కదిలి పోతారు. మరెవ్వరిలోనూ లేని గొప్ప గుణమేదో ఆమెలో ఉంది. వందమందిలో నా కళ్ళను కట్టిపడేసే సహజమైన మృదుకదలికలేవో ఆమెలో ఉన్నాయి. అందుకే ఆమెను చూడటంలో ఇష్టపడే మధురిమ అది. దాన్ని నేను ప్రేమ అని భావించి ఆమె వెనుకే పరుగులు తీయడం చాలా సిల్లీ విషయం. ప్రేమంటే కోర్కెలు తీర్చేది కాకూడదని నా అభిప్రాయం. ఇంకో వారంరోజులు ఆమెను చూడొచ్చు. క్లాసులయిపోతే ఎవరిళ్ళకు వాళ్ళమే. ఎప్పుడన్నా నా స్మృతిపథంలో అలలుగా కదిలితే ఆ జ్ఞాపకాల్లోంచి ఆమెను చూడటం తప్ప మరేమీ కోరుకోను'' అంటూ వివరణ ఇచ్చాడు వినయ్.

"నీ అంతరంగం ఒక అనంత సాగరం. విశాలమైన మనస్తత్వం నీది. కానీ నిన్ను అర్థంచేసుకొనే స్టాండర్డ్‌లో జనం లేరు. అదే నా బాధ. నీవు చెప్పినవన్నీ మరొక అనామకుడిన్నాడనుకో! దాన్ని 'సీ అండ్ ఎంజాయ్' అంటాడు! అలా నేనంటే నా గొంతు నొక్కేస్తావు. పోనీ ఆ అమ్మాయి నీకు భార్యగా లభిస్తే నీవెలా ఫీలవుతావు'' అడిగాడు బాపిరాజు.

"నాకిష్టమైన ఆ మధురిమ నా భార్య కావాలని నేను ఆశించను. ఒకవేళ ఆమె నా భార్య అయినా పెద్దగా ఫీలవను. దగ్గరగా చనువుగా వుండే భార్య కనుక ఆమె అంతరంగంతో అనుభవాలు పంచుకోవడంలో థ్రిల్ ఫీలవ్వచ్చేమోకాని, ఆమెను ఆరాధించి పెళ్ళిచేసుకోవడంలేదుకదా ప్రస్తుతం" చెప్పాడు వినయ్.

"ఏమోరా ప్రేమవిషయంలో గురువుగారు దేవదాసు, పెద్దగురువు మజ్నూలాంటివాళ్ళు చెప్పని థీరీ చెబుతున్నావు నీవు. వాళ్ళెప్పుడూ తన లవర్‌ని ఎలా కలవాలా అని లక్షా తొంబయ్ ప్లాన్‌లు వేసుకొనేవారు. హెల్త్‌నీ, వెల్త్‌నీ లెక్కచేయకుండా ప్రేయసిని కలవడానికి షార్ట్‌కట్‌లన్నీ ఆలోచించి చివరికి దారుణంగా తనువు చాలించారు. మరి నీవేమో ప్రేయసి కళ్ళకి నిండుగా కనిపిస్తే చాలు. ఆమె మన సొంతం కానక్కర్లేదు. ఆమె మరొకడికి భార్య అయినాసరే మరెప్పుడన్నా కనిపిస్తే అదే పులకరింత. అదే చిలకరింత అంటున్నావు. సరే నేను సామాన్యుణ్ణి. అవన్నీ నాకేంతెలుసు. ఏదో ఎర్రగా బుర్రగా ఉండే పిల్ల కనిపిస్తే మాట్లాడే చనువిస్తే సరదాగా అలా బీచ్‌కి తీసుకుపోయి, రెండు ఐస్‌క్రీంలు తీసుకుని చప్పరించేసి తర్వాత వేరుశనక్కాయలు కొనుక్కొని వాటి తొక్కలు తీసి ఆమెకు తినిపిస్తూ, వీలయితే పిక్చర్‌కి తీసుకెళ్ళి పక్కనే కూర్చుని లైట్‌గా ఆమె భుజాలను తాకుతూ... ఆమె స..." అంటూ బాపిరాజు చెప్పబోతుండగా 'కట్' అని అరిచాడు వినయ్.

"ఆపరా నీ పురాణం. నీవేకాదు జంతువులు కూడా చాలా సమర్థవంతంగా ఆ పని నిర్వహిస్తాయి'' అన్నాడు.

బాపిరాజు నోరు తెరచి అలానే ఉండిపోయాడు. "ఏమైంది'' అన్నాడు వినయ్.

"పచ్చివెలక్కాయ గొంతులో పడింది'' అన్నాడు బాపిరాజు.

అంతలో వాళ్ళు క్లాస్‌ని సమీపించారు.

క్లాస్‌రూం స్టూడెంట్స్‌తో నిండుగా ఉంది. అందరూ ఉత్సాహంగా ఉన్నారు. ప్రొఫెసర్ గోపాలకృష్ణగారు క్లాస్‌లోకొచ్చారు.

★ ★ ★

"గుడ్‌మార్నింగ్ సార్' అంటూ స్టూడెంట్స్ గోపాలకృష్ణగారిని పలకరించారు.

"వెరీ గుడ్‌మార్నింగ్' అంటూ చాలా హుందాగా ప్రతిపలికారు ప్రొఫెసర్ గోపాలకృష్ణ.

క్లాసంతా నిశ్శబ్దంగా ఉంది. "వెల్ మై డియర్ స్టూడెంట్స్! ఈరోజు మీరంతా చాలా ఉద్వేగపూరితమైన అనుభవానికి లోనవుతున్నారుకదూ! నాకు తెలుసు! పలు ప్రాంతాల నుండి, విభిన్న వర్గాలనుండి మనమంతా ఇక్కడకు వచ్చి రెండేళ్ళ అనుభవాలతోపాటు అనుబంధాలు కూడా ఏర్పరచుకొని ఇక నుండి విడిపోతున్నామనే పైకి తెలీని ఒక బాధ మీ హృదయాలను కలచివేస్తోంది కదూ! అవును విడిపోక తప్పదు. ఎందుకంటే జీవితమంటే ఒక్క చదువు, స్నేహమేకాదుకదా! ఇంకా ఎన్నో కొత్త అనుభవాలకు ఊపిరిపోయాల్సిన మరింత జీవితం ముందుంది. అంచేత కొన్ని కావాలంటే కొన్ని వదులుకోవాలి. జీవిత మాధుర్యాలను వెదుక్కొంటూ మనిషి మరింత ముందుకు పోవాలని, వెనుదిరిగి చూసుకొనే అవకాశమే లేకుండా మీ వ్యక్తిత్వాలను మలచుకోవాలని నేను కోరుతున్నాను. ప్రతి సంవత్సరం మీలాంటి విద్యార్థులకు వీడ్కోలు ఇచ్చి సాగనంపిన అనుభవాలు నాకెన్నో ఉన్నాయి. నా విద్యార్థులు వెళ్ళిపోతున్న ప్రతిసారీ నా కళ్ళు చెమ్మగిల్లుతాయి. వాటిని మీరు గుర్తించలేరు. అవి నానుండి వెలువడే ఒక నిట్టూర్పులో బయటపడొచ్చు లేదా అనుభవంతో ముడతలు పడిన నా కనుబొమ్మల్లో దాగి ఉండచ్చు. చూస్తుండగానే కాలచక్రం ఎంత గిర్రున తిరిగిపోయింది! బిక్కుబిక్కుమంటూ క్లాస్‌లోకి అడుగుపెట్టిన మీ అమాయక వదనాలు నాకింకా గుర్తున్నాయి. మరి మీరిప్పుడు ఎంతో విజ్ఞాన సంపన్నులై నా. కంటికి చాలా హుందాగా




కనిపిస్తున్నారు. ఒక సంఘటన చెబుతాను... మీరంతా ఎమ్మే ఫస్టియర్‌లో జాయిన్ అయిన రోజులు. మన బాపిరాజు ఒకసారి నా కాబిన్‌కొచ్చి 'సార్ టక్ చేసుకొని క్లాస్‌కొస్తే మీరేం అనుకోరుకదా' అంటూ చాలా అమాయకంగా ప్రశ్నించాడు. 'నీవు మొత్తం గుడ్డలు విడిచి క్లాస్‌కొచ్చినా నేనేం అనుకోను. ఆపాటి ధైర్యం నీకుంటే' అని సమాధానమిచ్చాను'' అని నవ్వుతూ చెప్పారు గోపాలకృష్ణ. క్లాసంతా గొల్లున నవ్వారు. అందరూ తనని చూస్తున్నారని బాపిరాజు జేబురుమాలు తీసి తుడుచుకునే వంకతో ముఖాన్ని కప్పుకున్నాడు.

"సో... ఏమిటంటే ప్రొఫెసర్స్ దగ్గర మార్క్స్ ఉంటాయికదా. వాళ్ళవద్ద మర్యాదగా ఉంటే మార్క్స్ పొందొచ్చు అనే దృక్పథంతో విద్యార్థులు రకరకాల ప్రయత్నాలు చేస్తారు. అలాంటి నేపధ్యంలో ఏర్పడిన ఒక భయాన్ని బాపిరాజు చూపించాడు అప్పుడు. మరిప్పుడు బాపిరాజు కర్ఫ్యూలో కూడా బజారుకెళ్ళి సిగరెట్స్ తేగలడు'' అని గోపాలకృష్ణ గారనగానే క్లాస్‌లో మళ్ళీ నవ్వులు. ఈసారి బాపిరాజు సీటులోంచి జారి కూర్చుండిపోయాడు.

"వెల్ మైడియర్ స్టూడెంట్స్! ఈరోజుతో మీ విద్యార్థి జీవితానికి తెరపడబోతోంది.

సోషల్‌వర్క్ ఒక ప్రత్యేకత కలిగిన పాఠ్యాంశం. ఎకనమిక్స్, పాలిటిక్స్‌లాంటి సబ్జక్ట్‌తో పోలిస్తే మీరు నేర్చుకున్న ఈ శాస్త్రం మీ జీవనసరళిపై విశిష్ట ప్రభావాన్ని చూపిస్తుందని నా నమ్మకం. మీరు చదువుకున్నది సామాజిక శాస్త్రం కనుక మీలో ప్రతి ఒక్కరూ మన సమాజానికి ఉపయోగపడే కార్యక్రమాలు చేపట్టాలి. కేవలం స్వలాభమే ధ్యేయంగా పెట్టుకోకుండా, మీకు వీలయినన్ని సేవలు సమాజానికి పంచండి. మీ జీవితాలను చరితార్థం చేసుకోవాలని కోరుతున్నాను'' అంటూ తన ఉపన్యాసాన్ని కొద్దినిముషాలు ఆపి, మళ్ళీ ప్రారంభించారు ప్రొఫెసర్ గోపాలకృష్ణ.

"వెల్ మైడియర్ స్టూడెంట్స్! ఈ సంవత్సరంనుండి మేమో కొత్త సంప్రదాయాన్ని ప్రారంభిస్తున్నాం. ఈ విషయమై నేను, నా తోటి ప్రొఫెసర్స్ చాన్నాళ్ళుగా తర్జనభర్జనలు చేసి, దానికి మన వైస్‌ఛాన్సలర్, గవర్నర్ అమోదాన్ని పొంది ఈ సంవత్సరంనుండే అంటే మీతోనే ప్రారంభిస్తున్నాం. రేపు పదమూడవ తేదీన జరగబోవు వార్షికోత్సవంలో మీరంతా సమావేశమవబోతున్నారుకదా! సరిగ్గా ఆ రోజునే గవర్నర్ సమక్షంలో మీరంతా ఒక ప్రతిజ్ఞ చేస్తారన్నమాట. అంటే ఒక్కొక్కరే వేదికమీదకొచ్చి సమాజానికి నేను నా వంతు బాధ్యతగా ఈ నిర్ణయం తీసుకుంటున్నాను అంటూ మీరు ఒక ప్రతిజ్ఞ చేయాల్సి ఉంటుంది. దాన్ని మేం రికార్డ్ చేసుకొని మీరేప్రాంతంల్లో ఉన్నా ఆ బాధ్యత/విషయమై గుర్తుచేస్తూ ఉంటాం. మీరు చేసిన ఆ వాగ్దానం విషయంల్లో మీరు సక్సెస్ అయినట్లయితే ఇదే యూనివర్శిటీలో మీకు అత్యంత విశిష్టమైన డాక్టరేట్‌కు సమానహోదాగల విశిష్ట గౌరవం లభిస్తుందన్నమాట. అందుచేత మీరంతా రేపు జరగబోయే వార్షికోత్సవంలో ఎలాంటి సామాజికపరమైన నిర్ణయం తీసుకోవాలో బాగా ఆలోచించి ప్రిపేరవుతారని ఆశిస్తాను. ఉదాహరణకి 'నేను ఒక అనాధను చేరదీసి ఆ వ్యక్తిని పోషించి విద్య నేర్పించి అతనికి ఒక జీవితాన్ని కల్పిస్తాను'... ఇలాంటి నిర్ణయాలు మీరు తీసుకోవాల్సి ఉంటుంది. సరే... మీకు బాగా అర్థమైందనుకుంటాను. ఏం బాపిరాజూ! వినయ్, సూరి, పల్లవీ'' అంటూ విద్యార్థులవంక చూశారు గోపాలకృష్ణయ్యగారు.

అందరూ అర్థమైందని, చాలా ఉత్సాహకరమైన విషయమని, తామంతా ఆనందంగా అలాంటి నిర్ణయాలు తీసుకోవటానికి సిద్ధంగా ఉన్నామని చెప్పారు.

"వెల్ మైడియర్ స్టూడెంట్స్! ఇదే నా ఆఖరి క్లాస్. నిజానికిది లెసనని భావించను. మనమంతా సహృదయంతో ఏర్పాటుచేసుకున్న చిన్న మీటింగ్‌లా భావించాలని కోరుతు

న్నాను. రెండేళ్ళపాటు నాతో చాలా మర్యాదగా వుంటూ మీ మర్యాదను కాపాడుకున్న మీ సంస్కారానికి నేను కృతజ్ఞతలు చెబుతున్నాను. విష్‌యూ ఆల్ ద బెస్ట్ ఆఫ్ లక్. మళ్ళీ మనం వార్షికోత్సవంలో జరిగే ఫేర్‌వెల్ పార్టీలో కలుద్దాం. థాంక్యూ'' అంటూ గోపాలకృష్ణ గారు క్లాసునుండి బయటకు నడిచారు.

★ ★ ★

తనతో ఇన్నాళ్ళూ కలిసి చదువుకున్న కొంతమంది సన్నిహితులకు వినయ్ పార్టీ ఇవ్వాలని నిర్ణయించుకున్నాడు. ఆ మేరకు ఏర్పాట్లన్నీ పూర్తిచేశాడు.

ఆహ్వానం అందుకున్న ఫ్రెండ్సందరూ హోటల్ ఆనంద్‌కి చేరుకున్నారు. వినయ్ తెల్లటి బట్టలు ధరించి చాలా ఆహ్లాదంగా కనిపిస్తున్నాడు. బాపిరాజు పార్టీ ఏర్పాట్ల గురించి హోటల్ మేనేజర్‌తో మాట్లాడుతున్నాడు.

ఆహ్వానితులందరూ వచ్చారని తృప్తి చెందిన వినయ్ వారినుద్దేశించి "ప్రియమైన మిత్రులకు నా కృతజ్ఞతలు. రెండేళ్ళుగా ఒక కుటుంబ సభ్యుల్లా కలిసిమెలసి ఒకరిపట్ల మరొకరు స్పందిస్తూ మన విద్యార్థి దశను పూర్తిచేశాం. జీవన పోరాటంలో మనవంతు కర్తవ్యం నిర్వహించడానికి తలోదిక్కూ వెళ్ళి










పోతాం. ఎవరు ఎక్కడున్నా! ఏం చేస్తున్నా గతాన్ని తలుచుకొనే అవకాశం వస్తే ఆ గతంలో మన యూనివర్సిటీ జ్ఞాపకాలు మదిలో మెదిలితే వాటితోపాటు నన్ను కూడా గుర్తుంచుకుంటారని ఆశిస్తూ ఈ చిన్న పార్టీని మీకోసం ఏర్పాటుచేశాను. ప్లీజ్ ఎంజాయ్ ది పార్టీ'' అని వినయ్ క్లుప్తంగా చెప్పగానే ఫ్రెండ్సంతా తప్పట్లు కొట్టారు.

హొటల్లో ఏర్పాటుచేసిన స్పీకర్లోంచి మడొన్నా సంగీతం వినిపిస్తోంది.

"థాంక్స్ వినయ్! చాలా గొప్పపార్టీ ఏర్పాటుచేశావ్. ఈ పార్టీనే ఇంత గ్రాండ్‌గా చేస్తున్నావ్. మరి నీ పెళ్ళి రిసెప్షన్ అదరహో అనుకుంటా'' అన్నాడొక ఫ్రెండ్ తందూరి చికెన్ తింటూ.

"వినయ్ ఈజ్ ఆల్వేజ్ వినయ్. మనిషెంత సిన్సియరో అతని అభిరుచులూ అలా గ్రేట్‌గానే ఉంటాయి'' అన్నాడింకో ఫ్రెండ్.

అందరి కామెంట్స్‌కి వినయ్ నవ్వుతూ థాంక్స్ చెబుతున్నాడు.

"వినయ్‌గారూ! మీలా గ్రేట్‌గా పార్టీ ఇవ్వలేనుకానీ మా ఇంట్లో మా కుటుంబ సభ్యులమధ్య మీకు డిన్నరివ్వాలనుకుంటున్నాను. మీరు తప్పకుండా రావాలి అంది'' ఒకమ్మాయి.

"ష్యూర్ తప్పకుండా'' అన్నాడు వినయ్.

"ప్రొఫెసర్ గోపాలకృష్ణయ్యగారు మనకిచ్చిన ఎసైన్‌మెంట్ గురించి ఏం ఆలోచిస్తున్నావ్ వినయ్'' అడిగాడొక ఫ్రెండ్.

"అదిప్పుడు చెబితే థ్రిల్లేముంటుంది. ఆరోజు స్టేజీమీద ఎనౌన్స్ చేస్తానుకదా! అది విని మీరంతా వండరైపోవచ్చు లేదా షాక్ కావచ్చు'' చెప్పాడు వినయ్.

ఫ్రెండ్సంతా కబుర్లు చెప్పుకుంటూ పార్టీని ఎంజాయ్ చేస్తున్నారు. ఇంతలో బాపిరాజు మైక్ పుచ్చుకుని ఎత్తయిన ఒక టేబుల్ ఎక్కి మిమిక్రీ చేస్తున్నానంటూ ఎనౌన్స్ చేశాడు. ఫ్రెండ్సంతా ఘొల్లుమని నవ్వారు.

"వద్దు దిగిపో నీ మిమిక్రీ వద్దు'' అని అరిచారు.

అయినా బాపిరాజు వినకుండా "కళని గౌరవించలేని మనిషి మనిషే కాడు. అందుకే దేశంలోని ప్రతిభ ఉన్న కళాకారులంతా డ్రెయినేజీల్లో పడిపోతున్నారు సారీ... మరుగునపడిపోతున్నారు. నా ప్రతిభ ఏమిటో మీరు గుర్తించకపోవచ్చు. కానీ నాకు బాగా పేరొచ్చాక మీరంతా నాతో ఫొటోలకోసం, ఆటోగ్రాఫ్‌ల కోసం ఎగబడతారు. ప్లీజ్ వినండి... దయచేసి వినండి'' అన్నాడు బాపిరాజు.

"దయచేసి వినండని నీవు ముందే చెబితే వినేవాళ్ళంకదా. దానికి ముందు పెద్ద ఉపో

ధ్యాతం ఎందుకు?" అన్నాడు వినయ్.

బాపిరాజు మిమిక్రీ ప్రారంభించాడు. 'మెక న్నాస్ గోల్డ్ సినిమాలోని మొదటి సీన్ అని చెప్పి మైక్ నోట్లోపెట్టుకొని ఏవేవో పిచ్చికూతలు కూశాడు. ఫ్రెండ్సంతా చెవులు మూసుకున్నారు.

'సెకండ్ వరల్డ్ వార్' అని మరో ఐటం చేశాడు. ఈసారి ఫ్రెండ్సంతా చెవులు మరింత గట్టిగా మూసుకున్నారు. మిమిక్రీ వద్దు మూకాభినయం చెయ్యమన్నారు. బాపిరాజు సరేనన్నాడు.

పిచ్చికుక్కకి పిచ్చెక్కకముందెలా ప్రవర్తిస్తుంది. పిచ్చెక్కాకెలా ఉంటుంది. నేలమీద పడిన ఐస్‌క్రీంని ఎలా నాకుతుందో చేసి చూపించమన్నారు.

బాపిరాజు కంగారుపడి "ఆ ఐటంకంటే గొప్పది ఆడవాళ్ళు స్నానంచేసి జుట్టు దువ్వుకుని ఎలా బట్టలు కట్టుకుంటారో చేసి చూపిస్తానన్నాడు.

ముందు కుక్కది చెయ్ తర్వాత అది చేద్దువుగాని అని పట్టుపట్టారు. ఇక చేసేదిలేక కుక్కలా మూకాభినయం ప్రారంభించాడు. అతని అవస్థకి ఫ్రెండ్సంతా కడుపుబ్బ నవ్వుకుంటున్నారు. బాపిరాజు మూకాభినయంలో జీవించేస్తున్నాడు. అందరూ హాయిగా నవ్వుకుంటున్నారు.

పార్టీ ముగిసింది. ఫ్రెండ్సంతా వినయ్‌కి వీడ్కోలు చెప్పి, బాపిరాజుకి 'నటశునక' బిరుదునిచ్చి వెళ్ళిపోయారు. వినయ్, బాపిరాజు హాస్టల్‌కి చేరుకున్నారు.

"అబ్బ! ఏం పార్టీనో నా కొంప కొల్లేరయిపోయిందిరా బాబూ. కుక్కలా నటించేసరికి తలప్రాణం తోక్కొచ్చింది'' అంటూ బాపిరాజు బెడ్‌పై వాలిపోయాడు.

"సర్లేవోయ్... నీ యాక్టింగ్ టాలెంట్‌ని చక్కగా నిరూపించుకున్నావుకదా! నేనిచ్చిన పార్టీకన్నా నీ ఎంటర్‌టైన్‌మెంట్‌కే వాళ్ళంతా ఆనందించారు తెలుసా?" అన్నాడు వినయ్.

"నీవు నన్ను ఒకవిధంగా మునగచెట్టు ఎక్కిస్తున్నావేమో అనిపిస్తోందోయ్'' అన్నాడు బాపిరాజు.

"మదర్ ప్రామిస్ నేను నిజంగానే అంటున్నారా'' అన్నాడు వినయ్.

"ఏమోనోయ్ అప్పుడెప్పుడో మా నానమ్మ నేను ఇంట్లో సరదాగా నటిస్తుంటే 'మహానటుడు చిత్తూరు నాగయ్యలా చేస్తున్నావురా బాపీ' అంటూ మెచ్చుకొంది. తర్వాత నీవు మెచ్చుకుంటున్నావురా... థాంక్స్‌రా'' అంటూ ఆనందపడిపోతున్నాడు బాపిరాజు.

"మీ తాతగారు కూడా నటుడే అని నాకెప్పుడో చెప్పినట్లు గుర్తోయ్'' అన్నాడు వినయ్.

"అవును సత్యహరిశ్చంద్రలో నక్షత్రకుడిగా వేసేవాడట. ఆయన పేరు కూడా బాపిరాజే. ఆయన పోయాక నేను పుట్టానంట. మా తాతే రెండోజన్మ ఎత్తి నారూపంలో పుట్టాడని నాకు 'బాపిరాజు' అని పేరెట్టేసింది మా బామ్మ. లేకపోతే లవ్లీగా వుండే నేమ్ పెట్టుకొనేవాడిని సెంటిమెంట్స్‌కి కమిట్టయిపోయాను ప్చ్'' అన్నాడు బాపిరాజు బాధగా.

"బాపిరాజు చాలా హుందాగల పేరోయ్. ఎందుకు వర్రీ అవుతావ్. ఆ పేరుతో ఓ గొప్ప రచయిత ఉన్నాడు. తరతరాల సంప్రదాయం నిండివుంది. తెలుగుతనం తొణికిసలాడుతుంది. నాకు వినయ్ అని పేరు పెట్టారుగానీ నీ పేరులాంటిది ఉంటే బావుండునని పిస్తోంది'' అన్నాడు వినయ్ సరదాగా.

"సర్లే మా నాన్నగారి పేరేంటో తెలుసా?"

ఏమిటన్నాడు వినయ్.

"తాతబ్బాయ్'' అని చెప్పి దుప్పటి ముసుగుతన్నేశాడు బాపిరాజు.

వినయ్‌కి నవ్వాగింది కాదు. అలా చాలాసేపు నవ్వుకుంటూ నిద్రకోసం ప్రయత్నిస్తున్నాడు వినయ్. 'నిర్మల సముద్రతీరం... పండువెన్నెల... మబ్బుల చాటున దోబూచులాడే చందమామ... తెల్లగుర్రమెక్కి తీరం వెంబడి





పోయే అమ్మాయి... కళ్ళముందు కదిలాయి. మెల్లిగా నిద్రలోకి జారిపోయాడు వినయ్.



**యూ**నివర్శిటీ వార్షికోత్సవం సందర్భంగా గవర్నర్‌గారికి స్వాగతం బానర్లతో కాంపస్ ఆహ్లాదంగా ఉంది. ఆడిటోరియంలో సభావేదిక కళాత్మకంగా అలంకరించబడింది. బాడ్జీలు పెట్టుకొని నిర్వాహకులయిన విద్యార్థులు, ప్రొఫెసర్లు ఉత్సాహంగా ఏర్పాట్లు చేయడంలో హడావిడిగా తిరుగుతున్నారు. సాయంత్రానికల్లా ఆహ్వానితులంతా రాసాగారు. ప్రొఫెసర్ గోపాలకృష్ణయ్యగారు స్వాగత ద్వారంవద్ద నిలబడి అందరినీ వినయంగా ఆహ్వానిస్తున్నారు. ఆడిటోరియం అంతా ఆహ్వానితులతో కళకళలాడుతోంది. వైస్‌ఛాన్సలర్ కారు రాగానే గౌరవసూచకంగా బాణాసంచా కాల్చారు. ఇంతలో గవర్నర్‌గారి కారు కూడా రావడంతో మరింత సందడి మొదలయింది. గవర్నర్‌గారిని విద్యార్థినులు వేదిక ఎక్కేంతవరకూ పూలు చల్లుతూ ఆహ్వానించారు.

సభ మొదలైంది. ముందుగా ప్రొఫెసర్ గోపాలకృష్ణయ్యగారు సభికులకు, సభావేదికనలంకరించిన పెద్దలకు స్వాగతం పలికి కార్యక్రమాన్ని వివరించారు. వైస్‌ఛాన్సలర్, కొంతమంది పెద్దలు ప్రసంగించాక గవర్నర్‌గారు తమ సందేశాన్నిచ్చారు.

గోపాలకృష్ణయ్యగారు మైక్‌ముందుకొచ్చి "ఇప్పుడు సోషల్‌వర్క్ విద్యార్థులు తమ ఆశయాల రూపకల్పనకు శ్రీకారం చుట్టిన తమ మనోభావాల విషయమై గవర్నర్‌గారి సమక్షంలో, గౌరవ మేధావుల సమక్షంలో ప్రమాణంచేస్తారని ఆశిస్తున్నాను. ముందుగా కుమారి గీతాంజలి తమ నిర్ణయాన్ని ప్రకటించవలసిందిగా కోరుతున్నాను'' అన్నారు.

గీతాంజలి సభకు నమస్కారాలు చేసి "నా జీవితంలో ఒక నిరుపేద ముసలి స్త్రీని చేరదీసి ఆమెను చనిపోయేవరకూ సొంత బిడ్డలా ఆదుకోవాలన్నదే నా ధ్యేయం" అని చెప్పగానే సభలో హర్షామోదాలు తప్పట్ల రూపంలో మిన్నుముట్టాయి.

తర్వాత గీతాంజలి గవర్నర్‌గారి ముందుంచిన ఒక ఫైల్‌లో తన ఆశయాన్ని రాసి సంతకం చేసి ఆయన అందించిన పూలబొకేను తీసుకుని వేదిక దిగింది.

తర్వాత "అమరనాథ్ తన ఆశయాన్ని తెలియజేవలసిందిగా కోరుతున్నా'' అని గోపాలకృష్ణయ్యగారు ప్రకటించారు.

"సభకు నమస్కారములు. నేను నా జీవితంలో ఖాళీ సమయాన్ని పేద విద్యార్థులకు ఫీజు తీసుకోకుండా ట్యూషన్స్ చెప్పి నావంతు కర్తవ్యాన్ని నిర్వహిస్తాను'' అంటూ అమర్‌నాథ్ ప్రమాణంచేశాడు.

తర్వాత కుమారి అరుణ, "నేను నెలకొకసారి ఒక మురికివాడను పరిశీలించి అక్కడి చిన్నపిల్లలకు అంటువ్యాధులు రాకుండా తగిన చర్యలు చేపడతాను. స్థానిక ప్రాథమిక ఆరోగ్యకేంద్ర సేవలు వారికి పూర్తిగా అందేలా ప్రయత్నంచేస్తాను'' అంది.

తర్వాత గోపాలకృష్ణయ్యగారు మైక్ ముందుకొచ్చి "ఇప్పుడు చిరంజీవి బాపిరాజు తన ఆశయాన్ని తెలియజేస్తాడని ప్రకటించగానే సభలోనివారంతా గొల్లుమని నవ్వారు.

ఏమిటా ప్రత్యేకత! ఎవరా వ్యక్తి!! అనుకొంటూ గవర్నర్‌గారు వేదిక ఎక్కుతున్న బాపిరాజువంక దృష్టి సారించారు.

బాపిరాజు మైక్‌ముందుకొచ్చి "సభకు, సభా వేదికమీదున్న పెద్దలకు నా నమస్కారములు. మనది పవిత్ర భారతదేశం. మనకో గొప్ప సంస్కృతి ఉంది. అనాదిగా స్త్రీలకు మనం మహోన్నతమైన విలువిచ్చి గౌరవిస్తున్నాం.

నేడు మన సంస్కృతికి చెదలు పట్టి అశ్లీలం విజృంభించి సభ్యసమాజపు స్త్రీని వివస్త్రను చేసి ప్రకటనల ఫ్రేములో ఇరికించి స్త్రీ అందాలను ఆటబొమ్మలుగా మలచి గోడలకెక్కిస్తున్నారు. ముఖ్యంగా నేడు ప్రతి ఇరవై గజాలకూ ఏదో ఒకచోట దర్శనమిచ్చే సినిమా పోస్టర్లను చూస్తుంటే బాధ్యతగల ఏ పౌరుడికైనా ఒళ్ళు మండకమానదు. అలాంటి అసభ్య సినిమా పోస్టర్లు, వ్యాపార ప్రకటనలు నా కళ్ళల్లో పడితే వెంటనే వాటిని చించేస్తాను. అవి ఊడిరాకపోతే వాటిమీద బురద చల్లేస్తాను. 50 అడుగుల ఎత్తున్న హోర్డింగయినాసరే చర చరా ఎక్కేసి బురద పూసేస్తాను" అని బాపిరాజు చెప్పగానే జనం మళ్ళీ గోలగా అరిచి వెటకారధోరణిలో తప్పట్లు కొట్టేశారు. బాపిరాజు అవి తనకు లభించే అభినందనలు అనుకొని గర్వంగా నలుదిక్కులా చూస్తున్నాడు.

ప్రొఫెసర్ గోపాలకృష్ణయ్యగారు మైక్ ముందుకొచ్చి "ఇందులో పసలేదయ్యా బా






పిరాజూ! నీవు ఎన్ని వాల్‌పోస్టర్లని చించగలవు! అది నీ ఒక్కడివల్లా సాధ్యం కాదుకానీ ఆ విషయం వదిలేయ్. నీకు మరో అవకాశం ఇస్తున్నాం" అంటూ గోపాలకృష్ణయ్యగారు నవ్వుతూ వెనక్కి వెళ్ళారు.

బాపిరాజు రెండు సెకన్లు ఆలోచించి "ఈసారి నేను టచ్ చేయబోతున్న సమస్య సామాన్యమైనది కాదు. సిగ్మండ్ ఫ్రాయిడ్, డార్విన్, ఐన్‌స్టీన్‌లాంటి గొప్పగొప్ప మేధావులు ఎత్తుకోవాల్సిన స్టాండర్డ్‌గల సమస్య! ఆదిమానవుడి స్థాయినుండి 'నేటి ఆధునిక మానవుడిదాకా బుర్రలు పగిలేలా ఆలోచించి జవాబు దొరకక పజిల్‌గా మిగిలిపోయిన విషయం ఇది. ఈ సమస్యతోనే మనుష్యుల మధ్య, సమాజాలమధ్య, జాతులమధ్య గొడవలు జరుగుతున్నాయి. 'కలడు కలండనెడు వాడు కలడో లేడో'నని గొప్పగా స్మరించిన వారే అనుమానించిన సబ్జెక్ట్. 'దేవుడున్నాడా లేడా?' అని. దేవుడు ఎక్కడ ఉన్నాసరే నా జీవితాంతం వెదికి పరిశోధించి పట్టేస్తాను..." అంటూ బాపిరాజు తన ప్రసంగాన్ని ఆపగానే గవర్నర్‌తోసహా వేదికమీదున్న పెద్దలూ, ప్రేక్షకులూ అందరూ నవ్వేశారు.

గోపాలకృష్ణయ్యగారు మైక్‌ముందుకొచ్చి "బాపిరాజు ఎంతటి సమర్థుడో మీరు చూశారుగా! నిజానికి బాపిరాజు తన చుట్టూ ఉన్నవారిని నవ్విస్తూ సమాజానికి ఆరోగ్యకరమైన సందేశాన్నివ్వడమే చక్కని ఆశయమని నా అభిప్రాయం. అతను అలా పదికాలాలపాటు శత్రువులను సైతం నవ్వించగలిగే సామర్థ్యాన్ని సంపాదించాలి. ఆమేరకు ప్రమాణం చేస్తే సరిపోతుంది" అని బాపిరాజుతో గవర్నర్ ముందే సంతకం చేయించారు.

బాపిరాజు వేదిక దిగొచ్చి వినయ్‌పక్కన కూర్చుంటూ "తర్వాత నీపేరేనోయ్ రెడీగా ఉండు. సరేగానీ గమనించావా నిన్ను మంత్రం వేసినట్లు కట్టిపడేసే అందాలబొమ్మ అదిగో అక్కడ కూర్చుంది" అంటూ లేడీస్ వింగ్‌వైపు చూపించాడు.

వినయ్ అటు చూశాడు.

వసంత ఫ్రంట్‌నుండి థర్డ్‌లైన్లో ఒక చైర్‌లో కూర్చుని ప్రోగ్రామ్ చూస్తోంది.

"ఇప్పుడు మిస్టర్ వినయ్ తన ఆశయాన్ని ప్రకటించవలసిందిగా కోరుతున్నాను" అని ప్రొఫెసర్‌గారు ఎనౌన్స్‌చేశారు.

వినయ్ వేదికమీదకు వెళ్ళి సభామర్యాదలు పూర్తిచేసి, "సమాజంలో సమస్యలుకానీ, అన్యాయాలనుకానీ ముఖ్యంగా ఎదుర్కోవాల్సింది స్త్రీలే. మగవారికి సమస్యలున్నాయి. అవి కృషిచేస్తే పరిష్కారయోగ్యమైనవే. కానీ

స్త్రీల సమస్యలు మత, కుల, సామాజిక, రాజకీయపరమైన కట్టుబాట్లతో ముడిపడి వుంటాయి. కనుక అవి చాలా క్లిష్టమైనవని నా ఉద్దేశ్యం. పిల్లలుండీ భర్త చనిపోతే స్వ తంత్రంగా మరో వ్యక్తిని పెళ్ళాడటానికి స్త్రీకి చాలా గట్స్ కావాలి. కులంకాని నచ్చిన వ్యక్తిని పెళ్ళాడ్డడానికి చాలా ధైర్యం కావాలి. నచ్చని భర్తకి విడాకులివ్వాలంటే ఎంతో అంతర్గత సంఘర్షణకి లోనుకావాలి. ఇలాంటి ప్రాబ్లమ్స్ మగవాడు చాలా సింపుల్‌గా పరిష్కరించుకోగలడు. అందుకే నా ఆశయాన్ని వారి సమస్యలను ఆధారం చేసుకొని రూపొందించాను'' అని చెప్పి వినయ్ రెండు సెకన్‌లు ఆగాడు.

సభంతా నిశ్శబ్దంగా ఉంది. ముఖ్యంగా వినయ్ ప్రసంగం స్త్రీలను బాగా ఆకట్టుకుంది కాబోలు... అతని నిర్ణయం వింటానికి అందరూ ఉత్సాహంగా చూస్తున్నారు. వినయ్ ఒకసారి సభనంతా కలియజూసి నిశ్శబ్దాన్ని ఛేదిస్తూ "కట్నాలకు, అందాలకు, సంఘంలో గౌరవానికి అతీతంగా నేను.... నేను ఒక వితంతువుని అంటే భర్తపోయిగానీ, భర్త వదిలేసిగాని, చదువు సంస్కారం ఉన్న నా వయసు వితంతువుని పిల్లలున్నాసరే నా భార్యగా స్వీకరిస్తాను'' అని ప్రకటించాడు.

సభలో తప్పట్లు మిన్నుముట్టాయి. చాలా మంది ఆశ్చర్యపోయారు. బాపిరాజు షాక్ తిన్నాడు.

అయితే ముందు వరసలో కూర్చున్న కొంతమంది అమ్మాయిలు హేళనగా ఏవో కామెంట్స్ చెయ్యడం కూడా వినయ్ గమనించాడు. ఆ ముందునుండి మూడవలైన్లో వసంత కూడా తన ప్రకటన విని పక్కామెతో ఏవో చెప్పి విరగబడి నవ్వడం గమనించిన వినయ్ మనసు చివుక్కుమంది.

"గౌరవనీయులయిన మహిళామణులు కొంతమంది నా ఆశయ ప్రకటన విని ఎందుకో గేలిచేస్తున్నారు. మీకు ఏవైనా సందేహాలుంటే సభాముఖంగా తెలియజేయవచ్చు'' అన్నాడు వినయ్.

ముందు వరసలో ఉన్న అమ్మాయిలు మళ్ళీ ఘొల్లున నవ్వేశారు. వారి ఆలోచన ఏమిటో వినయ్‌కి తెలియడంలేదు. అంతలో ఎవరో కొన్ని చీటీలమీద ఏవో కామెంట్స్ రాసి వేదికమీదకు పంపించారు. వాటిని గోపాలకృష్ణయ్యగారు అందుకుని మరోపక్కగా మైక్ ముందుకొచ్చి,

"మిస్టర్ వినయ్! మీ ప్రకటన మీద కొంత మంది తమ సందేహాలు పంపించారు. వీటికి నువ్వు సమాధానం చెప్పాలి'' అన్నారు గోపాలకృష్ణ. వినయ్ సరేనన్నాడు.

"మీరు వితంతువుని ప్రత్యేకించి పెళ్లాడటంలో మీ ఉద్దేశ్యమేమిటి? ఆమెనుండి ఎక్కువ మొత్తంలో కట్నం రాబట్టాలనా?" అంటూ చదివి ఈ ప్రశ్న కుమారిస్వర్ణ అడుగుతున్నారు అన్నారు గోపాలకృష్ణగారు.

వినయ్ చిన్నగా నవ్వుకొని,

"నేను ముందే చెప్పాను. ఇలా నేను వితంతువుని పెళ్లాడటంలో ఆమెకు జీవితాన్ని పంచి ఇచ్చినట్లుంటుందని మరియు మరి కొంతమంది నాలాంటి యువకులకు నేను ఆదర్శం కావాలన్నదే నా ఉద్దేశం తప్ప ఇందులో కట్నాల ప్రసక్తేముంది'' అన్నాడు వినయ్. ఆ మాటకు వినయ్ తరఫునుండి స్టూడెంట్స్ పెద్దపెట్టున తప్పట్లు కొట్టారు.

గోపాలకృష్ణగారు మరో ప్రశ్న చదువుతున్నారు.

"మీరు వితంతువుని గ్యారంటీగా పెళ్లాడతారని నమ్మకమేమిటి? అద్భుతమైనఓఅందగత్తె రేపు మీ మనసు దోచుకుందంటే మీ ఆశయాలు హుళక్కేకదా. ఈ ప్రశ్న పంపించినవారు కుమారి వసంత" గోపాలకృష్ణగారు వినయ్ వంక చూశారు.

"ఓ.కే! వసంతగారూ! మీ సందేహం బాగానే వుంది. నా మనసు అందెగత్తెల్లాంటి గజదొంగలు దోచుకోగలిగేంత డెలికేట్‌కాదు.




# ఏరిన ముత్యాలు

☆ మేధావులు, తమ మేధస్సుని చదువుకోవడానికి ఉపయోగించే లాంతరులాగా కాక అందరికి దారిచూపే లైట్‌హౌస్‌లా ఉపయోగించాలి.

-హెచ్.డబ్ల్యు.బెక్‌వర్

☆ కొత్త అభిప్రాయాలను ఎప్పుడూ అనుమానిస్తారు. వ్యతిరేకిస్తారు. దానికి కారణం అవి అంతకుముందే ప్రచారంలో లేవు కాబట్టి.

-జాన్‌లాక్

☆ నిరంతరం తాగుతుండేవారు రుచికోసం చూడడు. నిరంతరం మాట్లాడేవాడు మరేదీ ఆలోచించడు.

-మాథ్యూప్రియర్

☆ యుద్ధంలోనూ, భార్యను ఎంచుకోవడంలోనూ ఒకసారి తప్పుచేస్తే జీవితాంతం దాని ఫలితాన్ని అనుభవించాలి.

-మిడిల్‌టన్

☆ మానసికంగా తనకన్నా చిన్నవాడైన పురుషుడిని స్త్రీ ప్రేమించలేదు.

-మేడమ్ డ్యుఫత్

☆ నైతికంగా మనిషిని దిగజార్చటంలో డబ్బును మించింది మరొకటిలేదు.

-సోఫాక్లిస్

☆ వయసుతోపాటు మానసిక పరిణతి సాధించని వ్యక్తులకు వృద్ధాప్యం శాపంలాంటిది.

-థోలన్

☆ పెళ్లిచేసుకోవడం అంటే హక్కుల్ని సగానికి సగం తగ్గించుకొని బాధ్యతల్ని రెండింతలుగా పెంచుకోవడం.

-ఆర్థర్ స్కోపెన్ హావెన్

☆ మంచీ చెడూ అని రెండు రకాలు లేవు. ఆలోచనల్లో అలా అనుకుంటాం, అంతే!

-షేక్స్‌పియర్

☆ ఏ వ్యక్తి జీవితంలోనూ, అన్నీ రసవత్తరమైన ఘట్టాలే ఉండవు. చాలాకాలం మామూలుగా జీవించి, ఒక్కక్షణంలో మహత్తరమైన అనుభవాలకు గురికావచ్చు.

-బుచ్చిబాబు

☆ నగరాలు మనిషి పెరుగుదలకు దోహదం చేస్తాయి. వారిని సంభాషణా చతురులుగా మారుస్తాయి. వినోదాన్ని కలిగిస్తాయి. కాని వారిని కృత్రిమంగా తయారుచేస్తాయి.

-ఎమర్సన్

☆ ఏం వ్రాయబోతున్నావో తెలియకుండా ప్రారంభించి, ఏం వ్రాశావో తెలియకుండా ముగించినప్పుడే మంచి ప్రేమలేఖ వ్రాయడం సాధ్యమవుతుంది.

-రూసో

సేకరణ: పట్నం శేషంశెట్టి

# చతుర సమీక్ష

ఈ శీర్షికద్వారా ప్రతినెలా 'చతుర'లో వెలువడే నవలను సమీక్షించే అవకాశాన్ని కల్పిస్తున్నాం. పాఠకులు తమకు నవల ఎందుకు నచ్చిందో లేదా ఎందుకు నచ్చలేదో వివరిస్తూ రచన బాగోగులు గురించి రాయాలి. సమీక్షలు రాసేవారు కథ మొత్తం మళ్ళీ చెప్పకుండా, అవసరమైనమేరకే ప్రస్తావిస్తూ రాయాలి.

1. సమీక్ష అరఠావుకి మించకుండా కాగితానికి ఒకవైపునే రాయాలి.
2. ఏ నెల సమీక్ష ఆ నెల 20వ తేదీలోపు మాకు అందేటట్లు పంపాలి.
3. మీ సమీక్షకు తప్పనిసరిగా ఈ కింది కూపన్ జతపరచాలి.
4. కవరుపై 'చతుర సమీక్ష'కు అని పేర్కొని ఎడిటర్, 'చతుర', ఈనాడు కాంపౌండ్, హైదరాబాద్-500 482 అనే చిరునామాకు పోస్ట్‌చేయాలి.

**మాకు సకాలంలో అందిన సమీక్షలలో ఎన్నికచేసిన అయిదు ఉత్తమ సమీక్షలకు రు. 100/- ప్రథమ బహుమతి, రు: 75/- ద్వితీయ బహుమతి, రు: 50/- చొప్పున మూడు తృతీయ బహుమతులను అందజేస్తున్నాం. పాఠకుల పరిశీలనాశక్తిని, రచనాసక్తిని పెంచే లక్ష్యంతో ఏర్పాటుచేసిన ఈ సమీక్షా రచనలో పాల్గొని ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకోగోరుతున్నాం.**

★ కొందరు బహుమతి విజేతలు తమ బహుమతి తాలూకు చెక్కు అందలేదనీ, అడ్రసు మారిందనీ రాస్తున్నారు. బహుమతి మొత్తాలు ప్రతినెలా మొదటివారంలోనే పంపుతున్నాం. అడ్రసుల విషయంలో కూపన్‌లో రాసేటప్పుడే జాగ్రత్తపడటం మంచిది. ఈ విషయంలో ఉత్తర ప్రత్యుత్తరాలు సాధ్యంకాదు.

**కూపన్**

**....... ఆగస్ట్ చతుర నవల హీరో ..............**

**సమీక్షకుని పేరు :** ..............................

**చిరునామా :** ..............................

..............................

..............................

..............................

ఇక నమ్మకం అంటారా? నేను ఈరోజు గవర్నర్‌గారి ముందు సంతకం ఒక్కటే పెట్టను. నా ఆశయాలన్నీ ఒక వైట్‌పేపర్‌మీద బాండ్ కూడా రాసిస్తాను. మీకు నా జీవితంపట్ల శ్రద్ధ లేక అనుమానం వుంటే ఆ పత్రం ఆధారంగా నన్ను మీరు నీలదీయవచ్చు'' అని చెప్పి ముగించాడు వినయ్.

మొదటి వరసలోని అమ్మాయిలు తల దించుకున్నారు. చాలామంది తప్పట్లు కొట్టేశారు.

వినయ్ గవర్నర్‌గారి ముందు తన నిర్ణయాన్ని వ్రాసి సంతకంచేసి వేదిక దిగాడు.

సభ ముగిసింది. తర్వాత సాంస్కృతిక కార్యక్రమాలు జరిగాయి. అందరూ వినయ్‌ని అభినందించారు. ప్రొఫెసర్ గోపాలకృష్ణయ్యగారు వినయ్‌ని స్టేజ్ బయట ఏకాంతంగా కలిసి "మిస్టర్ వినయ్! ఒక ప్రొఫెసర్‌గా నేనేమీ అనకూడదు. కానీ నీమీద నాకున్న ప్రత్యేకాభిమానం ఇలా అడిగిస్తోంది అంతే. నీ బంగారు భవిష్యత్తు..."

గోపాలకృష్ణయ్యగారి వాక్యాన్ని కట్ చేస్తూ, "రాజారామ్మోహన్‌రాయ్, గాంధీజీ, కందుకూరిలాంటివారిలా గొప్పపనులు చేయలేకపోయినా నా జీవితంలో అందుబాటులో ఉంటే ఈ చిన్న మంచిపని చేయడంలో పెద్దగా బాధలు ఎదురుకావని నా ఉద్దేశం సార్' అన్నాడు వినయ్. "ఎనిహౌ యూ ఆర్ గ్రేట్. కీపిటప్'' అని గోపాలకృష్ణయ్యగారు వినయ్‌కి షేక్ హ్యాండ్ ఇచ్చి వెళ్ళిపోయారు.

★ ★ ★

"ఏమోయ్ బాపిరాజు... బావున్నావా?" అన్న పిలుపు వినగానే బాపిరాజు కంగారుగా లేచాడు.

"అరే సూర్యనారాయణ బాబాయ్‌గారా... రండి... రండి. ఆరోగ్యం ఎలా ఉందండి?" అంటూ ఆయన చేతిలో ఉన్న మామిడిపళ్ళ బుట్టను, పొట్లాలను అందుకొని టేబుల్‌మీద పెట్టాడు.

"అంతా బానేవుందయ్యా!"

"ఏడీ... మావాడేడి?" అని నవ్వుతూ ఛైర్‌లో కూర్చున్నారు సూర్యనారాయణగారు.

"లైబ్రరీ బుక్స్ డ్యూస్ కట్టేసి క్లీన్ సర్టిఫికెట్ తీసుకోడానికి అడ్మినిస్ట్రేటివ్ ఆఫీసుకు వెళ్లాడండి. వచ్చేస్తాడు. ఈలోగా మీకు కాఫీ, టిఫిన్ తెస్తాను'' అంటూ లేవబోయాడు బాపిరాజు.

"వద్దులేవయ్యా అవన్నీ ముగించుకున్నానులే! ఏంటి విశేషాలు? ఈ వారంలో ఇంటికొచ్చేస్తున్నారా?" అని ప్రశ్నించారు సూర్యనారాయణగారు.

"అవునండి. ఇంకో నాలుగురోజులు పోయాక ఇంటికెళ్ళిపోవాలని వినయ్ నాతో అన్నాడు. ఇవ్వాళో రేపో టికెట్స్ కూడా రిజర్వ్ చేయించుకోవాలన్నాడు''

బాపిరాజు సమాధానం చెప్పాడు.

"సంతోషం రెండేళ్ళు మా వాడితో కల్సివున్నావ్. ఇక నీవు మీ ఊరెళ్లి చేసేదేవుంది. వినయ్‌తో మా ఇంటికొచ్చేయ్... ఇద్దరూ కలిసి ఉద్యోగ ప్రయత్నాలు చేద్దురుగాని. ఇంతకీ వాడు పెళ్లి విషయం నీతో ఏమన్నా చర్చించాడా?" అడిగాడు సూర్యనారాయణగారు.

"థాంక్స్ బాబాయ్‌గారు. నన్ను మీ సొంత కొడుకుతో సమానంగా చూసుకుంటున్నారు. వినయ్ కూడా నన్ను తనతో వచ్చేయమంటున్నాడు. నాకంటూ వెనకెవరూలేరు. ఇద్దరక్కయ్యలున్నారు. వెళితే వాళ్లింటికే వెళ్లాలి. వాళ్లూ పిల్లాపాపలతో ఉన్నారు. అందుకే నేనూ వినయ్‌తోటే ఉంటాను. ఇక వినయ్ పెళ్లి విషయమంటారా... అదొక వింత సంఘటన అని బాపిరాజు అనగానే. "వింత సంఘటనా ఏమిటోయ్ పొరపాట్న వాడు అరకులోయలో ఉన్న ఏ గిరిజనతండా అమ్మాయినో పెళ్లాడలేదుకదా'' ఆతృతగా అడిగారు సూర్యనారాయణగారు.

"అలా జరిగినా కాస్త బెటరనిపించేది బాబాయ్'' అని బాపిరాజు దీనంగా బదులిచ్చా

డు.

"అయితే ఏదో జరిగిందన్నమాట మీ రూంలోకి అడుగుపెట్టగానే అనుకున్నానోయ్. ఇక్కడి వాతావరణం మునిపటిలా లేదని. సర్లే ఏం జరిగిందో వివరంగా చెప్పు'' సూర్య నారాయణగారి కంఠంలో అనుభవంతో కూడిన అధికారం ధ్వనించింది.

"బాబాయ్ ఇవాళో రేపో మీకెలాగూ తెలీక మానదు. పైగా మీ క్షేమాన్ని కోరే శ్రేయోభిలాషిగా నాకు తెలుసుండీ మీకు చెప్పకపోవడం ద్రోహమే అవుతుంది కనుక చెప్పేస్తున్నాను. నయానో భయానో వినయ్‌ని దార్లో పెట్టాల్సిన బాధ్యత తండ్రిగా మీకుంది. కనుక మీకీ విషయం ఇప్పుడు తెలియడమే చాలా మంచిది'' అంటూ వినయ్ తీసుకున్న నిర్ణయాన్ని పూసగుచ్చినట్లు చెప్పేశాడు బాపిరాజు.

హెడ్‌మాస్టర్‌గా తలపండిన వాడు కనుక ఆ షాక్ తాలుకూ భావాలేవీ ముఖంలో కనబడనీయలేదు సూర్యనారాయణగారు. కళ్లజోడు తీసి ఒకసారి కండువాతో తుడుచుకుని మళ్ళీ పెట్టుకుంటూ "నా కొడుకు సమాజంలో గొప్ప మార్పు తెచ్చి అందరికీ ఆదర్శంగా నిలబడటం నాకెంతో ఆనందంగా వుందయ్యా... అలాగే మా కుటుంబపరువుని కూడా మంటగలిపేసే పనిచేస్తున్నందుకు అంతకుమించిన బాధగా వుంది బాబూ. అదృష్టంకొద్దీ నాకు ఆడపిల్లలు లేరుకానీ ఉంటే ఈ పరిస్థితుల్లో వాళ్ళ పెళ్లి జరగడానికి వీడి నిర్ణయం చాలా దెబ్బతీసేది. సరేలే, నా అనుభవంలో ఎన్నో సంఘటనలు జరిగాయి. అందులో ఇదొకటి. ఇక వినయ్ పట్టుదల అంటే కర్ణుడి నిర్ణయంలాంటిదే. నేను కాదుకదా నా ముత్తాత దిగొచ్చినా వాడి నిర్ణయం అమలు కావలిసిందే. జరిగేదంతా కాలంతో ముడిపడి వుంది'' అంటూనే సూర్యనారాయణగారు మంచి నీళ్లు తాగి బెడ్‌పై నడుం వాల్చారు.

పదినిమిషాలు గడిచాక వినయ్ రూంలోకొచ్చాడు. "నాన్నగారూ! ఎంతసేపయ్యింది వచ్చి'' ఆనందంగా వచ్చి తండ్రి పక్కన కూర్చున్నాడు వినయ్.

"రెండు గంటలయ్యిందిలేరా. నీ ఆరోగ్యమెలా ఉంది?" అడిగారు సూర్యనారాయణగారు. "ముందు చెప్పండి! మీరూ, అమ్మా, ఆరోగ్యంగా ఉన్నారా! అమ్మని చూసి చాన్నాళ్లయింది నాన్నా'' వినయ్ సంబరంగా అన్నాడు.

ఆ క్షణంలో వినయ్ చిన్నపిల్లాడిలా కన్పించాడు సూర్యనారాయణగారికి. "ఇప్పటి వరకూ బాగానే ఉన్నాంరా. ఇకముందు ఎలా ఉంటామో మరి'' అన్నారు సూర్యనారాయణ గారు. "అదేంటి నాన్నా నాలుగురోజుల్లో ఇంటికొచ్చేస్తున్నా. ఇకనుండి మీరు, అమ్మ అడుగు కిందపెట్టడానికి వీల్లేదు. అన్నీ నేనే చేసిపెడతాను సరేనా!" అన్నాడు వినయ్. "సరేలే ఈ రాత్రికే నేను తిరుగుప్రయాణం. స్టేషన్‌లోనే టికెట్ రిజర్వ్ చేసుకున్నాను. నీకు డబ్బు అవసరం ఏమన్నా ఉంటే పర్సులో అయిదు వేలు ఉన్నాయి తీసుకో. కాలేజిడ్యూస్‌కట్టి రికార్డులన్నీ సబ్‌మిట్ చేసేయ్. నీవు ఖచ్చితంగా సోమవారం పొద్దుటే వచ్చేస్తున్నావని మీ అమ్మతో చెప్పేస్తాను'' అంటూ సూర్యనారాయణగారు వినయ్‌కి పర్సు అందించారు. వినయ్ రెండువేలు తీసుకొని మిగతావి తండ్రికి ఇచ్చేశాడు.

మధ్యాహ్నం భోజనానికెళ్ళొచ్చిన తర్వాత ఒకగంట సూర్యనారాయణగారు నిద్రపోయి లేచి స్నానంచేసి స్టేషన్‌కి బయలుదేరారు.

వినయ్, బాపిరాజు స్టేషన్‌వరకూ వచ్చి సూర్యనారాయణగారిని ట్రెయిన్ ఎక్కించి తిరిగి రూంకొచ్చేశారు. "సారీరా మీ నాన్నగారికి నీ కథంతా చెప్పేశాను'' అంటూ సందేహిస్తున్నాడు బాపిరాజు.

"అందుకే కాబోలు నాన్నగారు అంత గంభీరంగా వున్నారు. పోనీలేరా నాకొంత బరువుదించేశావు థాంక్స్'' అన్నాడు వినయ్.

"ఇక మీ అమ్మగారికి మీ నాన్నగారు చెప్పి




ఆవిడకి ధైర్యం చెబుతారుగానీ నీవు నిశ్చింత గా వుండొచ్చు. అంతేకదా'' అన్నాడు బాపిరాజు.

"నిశ్చింతా పాడా. రేపొద్దున్నుంచే మా ఇంట్లో ప్రపంచయుద్ధం మొదలవుతుంది. నేను వెళ్లాక అది తారాస్థాయికి చేరుకొని తర్వాత శాంతి ఒడంబడికలతో మెల్లగా వాతావరణం ప్రశాంతమవుతుంది. అంతవరకూ సమస్య మండుతూనే వుంటుందిలే'' వినయ్ బదులిచ్చాడు.

"నీ ప్రపోజల్‌ని వాళ్లు అంగీకరిస్తారంటావా?'' బాపిరాజు అడిగాడు.

"ఐదు లక్షలు కట్నం తీసుకొని మా కులం అమ్మాయిని చేసుకొంటే మా తల్లితండ్రులతో పాటు మా ఊళ్లో అందరూ ఆనందిస్తారు. అలాగాక పిల్లలున్న వితంతువుని పెళ్లి చేసుకుంటున్నాననితెలిస్తే నన్నో పిచ్చాడిలా చూస్తారని నాకు తెలుసు. నేను నా కోసం బ్రతకాలనుకున్నప్పుడు వేరేవాళ్ళకోసం నా జీవితాన్ని మార్పులకు గురిచేయడం నాకిష్టం ఉండదు. నన్నింట్లోంచి వెళ్లిపొమ్మన్నా నేను బాధపడను'' అన్నాడు వినయ్. "ట్రెండ్ సెట్టర్స్‌ని సమాజం మొదట్లో అపార్థం చేసుకుని హేళన చేసినా ఆ విలువలు అర్థమయ్యాక ప్రజలు బ్రహ్మరథం పడతారు''

"నీ గొప్పతనం తెలియడానికి టైం పడుతుందిరా. ఈలోగా నీవు నీ ఆత్మీయుల్ని దూరం చేసుకుంటావు. సరేలే. నీకు విజయం చేకూరాలని నేను మనసారా కోరుకుంటున్నాను. ఆదివారం రాత్రికి ప్రయాణం. మిగతా కార్యక్రమాలు ఆలోచించు'' అన్నాడు బాపిరాజు.

★ ★ ★

"ఏంటమ్మా... ఏదన్నా వ్రతంగాని చేస్తున్నారా! ఇల్లంతా ముస్తాబు చేస్తున్నారు. పైగా మంచి పిండివంటలు కూడా చేస్తున్నారు'' పక్కింటావిడ అడిగింది కళ్యాణమ్మగారిని.

"లేదమ్మా. మా అబ్బాయి వినయ్ చదువులు ముగించుకుని ఈరోజు వచ్చేస్తున్నాడు అందుకు. ఖాళీగా వుంటే కాస్త రాకూడదూ. అరిసెల పాకం పడదాం'' అంది కళ్యాణమ్మ.

"ఓ దాన్దేముంది? మావారు ఆఫీసుకెళ్లగానే వచ్చేస్తాను. ఎన్ని పిండివంటలు గనుకా! మీరు ముగ్గురేగా'' అంది పక్కింటావిడ.

"మా వినయ్ వస్తున్న శుభసందర్భంగా మన వీధిలో అందరికీ పంచిపెడదామని'' చెప్పింది కళ్యాణమ్మ.

"మా వినయ్ పెద్దమనిషయ్యాడు. అందుకే పండుగ చేస్తున్నాం అని చెబితేసరి'' అని పక్కింటావిడ జోక్ చేసింది.

"నీ దుంపతెగ తెలుగు సినిమాలు చూసి మాటలు బానే నేర్చావే అమ్మాయ్'' అంటూ కళ్యాణమ్మ నవ్వేసింది.

అంతలో సూర్యనారాయణగారు అటుగా రావడం చూసి "తొమ్మిదిన్నర కావస్తోంది. ఇంకా స్కూల్‌కెళ్లలేదేంటి? పొరపాట్న లీవుగాని పెట్టారా ఏంటి?'' అంటూ ప్రశ్నించింది కళ్యాణమ్మ.

"అవును ఈరోజు లీవు పెట్టాను. వాడి కోసం కాదులే. రాత్రి నీవు చేసిన హల్వా తిన్నందుకు మోషన్స్ పట్టుకున్నాయి. ఇప్పుడు నేనన్న 'మోషన్స్' అనే పదంలో ఎలాంటి ఆరోపణా లేదు. 'విరేచనాలని' దానర్థం. నువ్వేం పెద్దగా ఇదవ్వకు'' అన్నారు సూర్యనారాయణగారు.

"పోదురూ బడాయి. అది మీ జీర్ణశక్తి లోపం కావచ్చు తప్ప నా హల్వా లోపం కాదు! నిజానికి హల్వాలో 'ఫాల్ట్' ఉంటే నాకూ విరేచనాలు పట్టుకోవాలికదా... ఇప్పుడు నేనన్న ఫాల్ట్ అనే పదంలో విపరీతార్థమేం లేదు. లోపం అని దానర్థం. మీరనవసరంగా బెంబేలు పడకండి'' అంది కళ్యాణమ్మ.

ఆ మాట వినగానే సూర్యనారాయణగారు రెండు క్షణాలు కొయ్యబారిపోయాడు. "గారాల కొడుకు ఇంటికొస్తున్నాడనే సంబ

రంలో తెలివితేటలు కూడా పుట్టుకొస్తున్నాయే నీకు. మంచి పాయింటే లాగావు. నేనిప్పుడన్న పాయింట్ అనే పదం... హుఁ సరేలే నీ పనులు కానియ్'' అంటూ బాత్‌రూంకేసి వెళ్ళిపోయారు సూర్యనారాయణగారు.

అవునుమరి పెద్దగా చదువుకోనిదైతే మాత్రం ఇన్నేళ్లుగా ప్రతి ఇంగ్లీష్ పదానికీ విడమర్చి మరీ అర్థం చెబుతుంటే ఆ మాత్రం ఎడ్యుకేట్ కావడంలో పొరపాటేముంది? అని కళ్యాణమ్మ తెలివికి లోలోపల మురిసిపోయాడు సూర్యనారాయణ.

"అత్తయ్యా! నేనొచ్చేశా'' అనే పిలుపువిని కళ్యాణమ్మ వెనక్కి తిరిగిచూసింది.

"రావే అనసూయా అలా సన్నబడిపోయావేమే!" ఆప్యాయంగా ఆహ్వానించింది కళ్యాణమ్మ.

"నేను సన్నబడ్డానా! అయితే నేను చేస్తున్న డైటింగ్ ఫలించిందన్నమాట" అంటూ తన ఒళ్ళంతా ఒకసారి చూసుకుంది అనసూయ.

"డైటింగా...?" ఆశ్చర్యంగా పలికింది కళ్యాణమ్మ. "అవునత్తయ్యా ముప్పూటలా పుష్టికరమైన ఆహారం తింటుంటే ఒళ్లంతా బరువెక్కి కొవ్వు పేరుకుపోయి దూదిబస్తాలా తయారవుతారని పుస్తకంలో చదివానులే. అందుకే డైటింగ్ చేస్తున్నాను. పొద్దుటే పదిహేను ఇడ్లీలు తినేదాన్నికదా. ఇప్పుడు ఐదు తగ్గించి పది తింటున్నాను. రెండు గ్లాసుల హార్లిక్స్ బదులు ఒక్కటే తాగుతున్నాను''






సూర్యనారాయణగారిని అనుకరిస్తూ.

"సరి! ఆయన రోగం నీక్కూడా అంటుకుందీ. ఇక లాభంలేదు నీ రోగం నీ మొగుడొచ్చి తీర్చాల్సిందే" అంది కళ్యాణమ్మ.

"ఛీ... ఏంటత్తయ్యా మీరు మరీను" సిగ్గుతో మెలితిరిగింది అనసూయ. "సర్లే. రెండురోజులు ముందుగా వస్తే నీదేం పోయేదుందే. పైగా నాక్కాస్త సాయపడేదానివికదా" అంది కళ్యాణమ్మ.

"వారం ముందుగానే వద్దామనుకున్నాను. అంత తొందరపడకే వాళ్లకి లోకువయిపోతావు" అంటూ మా అమ్మ ఆపేసింది. నాకయితే బావ గురించి తలుచుకోందే క్షణం గడవదు" చెప్పింది అనసూయ.

"అయ్యో... మా ఇంట్లో నీకు లోకువేమిటే? మాక్కాబోయే కోడలివి. ఇంటి యజమానురాలివి నువ్వయితేనూ. మీ అమ్మకి ఇంకా తిక్కవాగుడు తగ్గలేదన్నమాట. అంతా మా తమ్ముడు, వాడే, మీ నాన్న. వాడిచ్చిన లోకువేలే. ఇలా తవ్వుకుంటే ఎన్నయినా వుంటాయి. కానీ నువ్వెళ్లి చక్కా స్నానం చేసిరా భోంచేద్దువుగాని. శుభ్రంగా మొహానికీ, కాళ్లకీ కాస్త పసుపు రాసుకొని స్నానం చెయ్. నీ రంగుకి పసుపు కూడా కలిస్తే చందనపు బొమ్మలావుంటావు" అంటూ హడావిడిగా చెప్పేసింది కళ్యాణమ్మ.

ఎవరన్నా తన అందాన్ని మెచ్చుకొంటే చాలు అనసూయకి అదో ఇది. ఆనందంతో గాలిలో తేలిపోతున్నట్లుంటుందామెకు. ఆ అనుభూతితో బాత్‌రూంకేసి బయలుదేరింది. బాత్‌రూమ్ దగ్గరే తచ్చాడుతున్న సూర్యనారాయణగారు అనసూయకి ఎదురయ్యారు.

"హల్లో గుడ్‌మార్నింగ్ అంకుల్ హౌ ఆర్ యూ?" అంది అనసూయ.

"ఎవరూ... అనసూయా... నువ్వా అమ్మాయ్. ఏమిటో రోజుకోలా కనిపిస్తావు. పైగా నీ డ్రస్‌లేమో పక్కా మోడ్రన్. పోల్చుకో

అంటూ ఉత్సాహంగా చెప్పింది అనసూయ.

"ఓహో... ఒళ్లు తగ్గించుకోడానికి పత్యం చేస్తున్నావా? నీ మొహం. చక్కగాతిని వళ్లొంచి పనిచేస్తే చాలునే. బలవంతంగా ఆకలిని చంపుకోనక్కర్లేదు. నీకులానే మా పక్కింటి బ్యాంక్ గుమాస్తా వాళ్లమ్మాయి ఒళ్లు తగ్గించుకోడానికి నానాతిప్పలూ పడి ఆఖరికి క్షయరోగిలా తయారయ్యింది" అంది కళ్యాణమ్మ నవ్వుతూ.

అనసూయ కూడా నవ్వేసింది. "ఏంటో అత్తయ్యా ఏం తిన్నాసరే పూరీలా ఉబ్బిపోతుంది నా బాడీ. ఇప్పుడు నేనన్న బాడీ అనేమాటలో ఎలాంటి చెడ్డమీనింగూ లేదు. ఒట్ఠి శరీరమనే అర్థం" అంది అనసూయ

లేకపోయాను. మీ అమ్మా, నాన్న బావున్నారా? తర్వాత మాట్లాడుకుందాం. ముందు నువ్వు స్నానం కానిచ్చిరామ్మా'' అన్నారు సూర్యనారాయణగారు.

"థాంక్స్ అంకుల్. మీరు చాలా డల్‌గా కనిపిస్తున్నారు ఏమయ్యింది?" అడిగింది అనసూయ.

"ఏముందమ్మా! అనుభవించేవాడికి బాధగాను, వినేవాళ్లకు సరదాగాను వుండే సమస్య. నాకు విరేచనాలు పట్టుకున్నాయి. ఇప్పుడు కాస్త ఫర్వాలేదు నువ్వెళ్లమ్మా'' అంటూ సూర్యనారాయణగారు అక్కణ్ణుంచి వరండాకేసి వచ్చేశారు.

అనసూయ స్నానంచేసి, చక్కగా డ్రెస్ చేసుకుని కళ్యాణమ్మ వద్దకు వచ్చింది.

"చూడమ్మా నీకేం కావాలో అవి ప్లేట్‌లో వేసుకుని తిను. మొహమాటపడొద్దు సుమా'' అంది కళ్యాణమ్మ. "తిండి దగ్గర నాకు మొహమాటం లేదత్తా! ఇవన్నీ నేను తినేస్తే మీ అబ్బాయికి ఏమీ మిగలవని నా భయం" అంది అనసూయ.

"ఓసి నీ వడ్డాణం ఉండ్రాజవరం సంతకెళ్ల! మాటలు బానే నేర్చావే'' నువ్వుతూ అంది కళ్యాణమ్మ. "వడ్డాణమా? ఉండ్రాజవరమా? ఇవెక్కడి సూక్తులత్తయ్యా!" అంది ఆశ్చర్యంగా అనసూయ.

"ఇప్పటి పిల్లలు మీకు తెలీదుకానీ పట్టుపరికిణి, ముప్పయ్యారు కుచ్చిల లంగా, దానిపై పల్చటి ఓణి వేసుకొని ఆ బట్టలన్నీ బిగిస్తూ వడ్డాణం నడుం దగ్గర పెట్టుకుని పేరంటానికెడితే దేవకన్యల్లా ఉండేవాళ్లం అప్పుడు. నా పాత ఫొటోల్లో నేను పెట్టుకున్న వడ్డాణముంది చూపిస్తాలే. మా అమ్మమ్మ ఆనందమొచ్చినా కోపమొచ్చినా మమ్మల్ని అలానే తిట్టేది చిన్నప్పుడు. పరిస్థితులు దిగజారితే వడ్డాణం సంతలో అమ్మేసుకునేవాళ్లని, చితికిపోతున్న కుటుంబమని గేలిచేయడమే దానర్థం" అంటూ వివరణ ఇచ్చింది కళ్యాణమ్మ.

"అదిగో అలా వడ్డాణంలో చూసే మీ అత్తయ్యని పెళ్లి చేసుకున్న అభాగ్యుణ్ణి నేనేనమ్మా'' అంటూ సూర్యనారాయణగారొచ్చారు లోనికి.

"అదేంటి అంకుల్! ఎంతో పుణ్యం చేసుకుంటేనే అత్తమ్మలాంటి దేవత దొరికేది'' అంది అనసూయ.

"విన్నారా... చిన్నపిల్ల చెబుతోంది నా గొప్పతనం. మీకేం తెలుస్తుంది?" అంటూ నిట్టూర్చింది కళ్యాణమ్మ.

"అవును. నీ గొప్పతనం చిన్నపిల్లలకే బాగా తెలుస్తుందిలే' అంటూ ప్లేటులో ఉన్న గారె ఒకటి తీసుకుని నోట్లో వేసుకోబోయాడు సూర్యనారాయణ. "ఇదిగో ముందే చెబుతున్నా మీ అరుగుదలమీద పూర్తి నమ్మకం మీకుంటేనే తినండి. ఆనక నన్ను ఆడిపోసుకుంటే కుదరదు'' అంది కళ్యాణమ్మ.

"చూడు! గారెలు నన్నెప్పుడూ దగా చెయ్యవు. హల్వా నా ఒంటికి పడదు కనుక అలా జరిగింది. చాలామంది తింటే గారెలు తినాలని, వింటే భారతం వినాలని చెబుతారు గానీ నాకు మాత్రం- గారెలు తింటూ భారతం వినాలనుంటుంది'' అని సూర్యనారాయణగారనేసరికి అనసూయ పెద్దగా నవ్వేసింది.

"సరే నేను స్టేషన్‌కెళ్లి అబ్బాయిని రిసీవ్ చేసుకుంటాను. ఇంకో గంటన్నరలో స్టేషన్‌కొచ్చేస్తాడు వాడు'' అంటూ బయలుదేరబోయారు సూర్యనారాయణగారు.

"అంకుల్ ప్లీజ్! నేనూ స్టేషన్‌కొస్తా'' అంది అనసూయ.

"నువ్వెందుకమ్మా? మీ అత్తకు తోడుగ వుండు. ఇంకో రెండు గంటల్లో మీ క[illegible] ముందుంటాంగా'' అన్నాడాయన.

"పోన్లెండి సరదాపడుతోంది. వాడు ఊళ్లో దిగగానే మొదటి చూపులు, పలకరింపుల చెయ్యాలని ఇదవుతోంది తీసుకెళ్లండి'' రి[illegible]మెండ్ చేసింది కళ్యాణమ్మ.

"సరే పదమ్మాయ్'' అంటూ సూర్యనా




యణగారు బయలుదేరారు. వెనుక అన సూయ వెంబడించింది.



"**చూ**డమ్మా స్టేషన్ ఇక్కడికి దగ్గరే కదాని నేను నడుచుకుంటూ వెళదామనుకున్నాను. నీకు ఇబ్బందయితే చెప్పు. ఏదన్నా ఆటోలో వెడదాం" అన్నారు సూర్యనారాయణగారు అనసూయని ఉద్దేశించి.

"అఖ్ఖర్లేదంకుల్ సరదాగా నడిచివెళ్దాం. అవీ-ఇవీ చూసుకుంటూ వెళ్లడమంటే నా కెంతో ఇష్టం" అంది అనసూయ.

"పాతికేళ్ల పూర్వం రాజమండ్రిలో గుర్రబ్బ ళ్లుండేవమ్మాయ్. ఆ తర్వాత రిక్షాలొచ్చాయ్. ఇప్పుడు సిటీబస్సులు, ఆటోలు, చాలా చిత్రంగా మారిపోయిందీ వూరు. ఇదిగో ఈ సెంటర్లో ఆప్పట్లో ఒక భోజనహెూటలుండేది. అప్పుడప్పుడు ఇక్కడే భోజనం చేసేవాడిని. అప్పట్లో ఫుల్‌మీల్స్ రేటు" అంటూ కొన్ని క్షణాలు ఆగి, "అప్పట్లో ఎంతుంటుందో నీవూ హించి చెప్పమ్మా" అన్నారు సూర్యనారాయ ణగారు.

"ఫైవ్ రూపీస్ ఉండొచ్చనుకుంటా అంకుల్" అంది అనసూయ.

"రాంగ్! ఇంకా తక్కువ. రూపాయిన్నరకు ఐదారు కూరలు, పచ్చడి, పెరుగుతోసహా పెట్టేవారమ్మా. పైగా ఆ రోజుల్లో చాలామంది హెూటల్లో తిండి తింటానికి బాగా సిగ్గుపడేవా రు. ఇప్పుడంతా హెూటల్ కల్చర్ పెరిగిపో యిందికదా" అన్నారు సూర్యనారాయణగా రు.

"వ్వాట్! ఆఫ్టాల్ వన్‌హండ్రెడ్ ఫిఫ్టీ నయా పైసలకి భోజనం పెట్టేవారా? వ్వాటే వండర్ అంకుల్! నిజంగా మీవి గోల్డెన్‌డేస్. ఇప్పుడు చాక్లెట్స్ కూడా రావు ఆ రేటుకి" ఆశ్చర్యపో తూ అంది అనసూయ.

"అప్పట్లో రూపాయి సంపాదించడం కూడా చాలా కష్టమేనమ్మాయ్. ఏదో మన లాంటివాళ్లకి తాతలిచ్చిన కొద్దిపాటి ఆస్తులు న్నాయి కానీ, మిగతా లేనివాళ్లు అర్ధణా, అణా, బేడాలతో గడిపేవారంటే నువ్వింకా ఆశ్చర్యపోతావ్" అంటూ పాత విషయాలను చెబుతూ ముందుకు పోతున్నారు సూర్యనారా యణగారు.

కొన్ని నిమిషాలు మౌనంగా గడిచాక "చూ డమ్మా బావమీద నీకున్న స్పష్టమైన అభిప్రా యమేంటో మాకు తెలీదు. ఇలా అడుగుతు న్నానని మరోవిధంగా అనుకోకు. నీవు విన య్‌తో ఎప్పుడన్నా మనసువిప్పి మాట్లాడుకు న్నావా? మరేం లేదు. మేమంతా అనుకోవడ మేగాని వాడి ఉద్దేశం ఏమిటో కనుక్కోలేదుక దా. అందుకే అడుగుతున్నాను"

అనసూయ నవ్వుతున్న మూడ్‌లోంచి గంభీరంగా మారిపోయింది.

"జీవితంలో మనం అనుకున్నవన్నీ అను కున్నట్లు జరిగితే మనిషికీ యంత్రానికీ తేడా వుండదమ్మాయ్. విజయాలు, ఆ వెంటనే అపజయాలు. వీటితోనేకదా మనిషి నిరంతరం పోరాడేది. నేను ప్లీడర్ని కావాలను కొనే వాడిని. ఇదిగో ఇలా హెడ్‌మాస్టర్‌గా మిగిలిపోయాను. కారణాలు అనేకం. అందుకే విజయంకోసం వెళ్లేవాళ్లు అపజయాన్ని కూడా ముందుగానే ఊహించుకుని ప్రిపేరయితే తర్వాత బాధపడాల్సిన పనుండదని నా అభి ప్రాయం"

"వినయ్ బావతో ఎప్పుడూ ఏదో విషయ మ్మై తగువుపడేదాన్నే తప్ప ఇష్టాయిష్టాల వరకూ నేను తెలుసుకోలేదంకుల్. నాకు ఊహ

తెలిసినప్పట్నుండీ బావే నా భర్తని అందరూ అంటుంటే నేనూ బావ గురించే థింక్ చేస్తున్నానంకుల్' అంది అనసూయ.

"నిజమే. పెద్దవాళ్లు అలా అనుకుంటారు వరస కాబట్టి కానీ... అదొక్కటే మీ పెళ్లికి అర్హతకాదని నా ఉద్దేశం. అందుకే నీకు వీలుచూసుకుని బావకి నీ మనసులోమాట చెప్పేయ్. వాడేమంటాడో చూద్దాం" అన్నారు సూర్యనారాయణగారు.

"నేనా! ప్లీజ్... నాకంత ధైర్యం లేదంకుల్. ఒకవేళ బావ కాదంటే ఆ షాక్ నేను తట్టుకోలేను. బావ నాకన్యాయం చేయడంకుల్. ఐ బిలీవ్ ఇట్'' అంటూ కళ్లనీళ్లు పెట్టుకుంది అనసూయ.

ఆమె మూడ్‌ని మొదటినుండీ కంట్రోల్ చేస్తున్న సూర్యనారాయణగారికి ముందే తెలుసు ఆమె తప్పకుండా ఏడుస్తుందని.

"అరే... ఏంటమ్మా నీవు అనసూయవేనా. ఏంటది చిన్నపిల్లలా! వాడు వద్దంటే మాత్రం ఇక దేశంలో మగపిల్లలే లేరనుకుంటున్నావా? ఏముందమ్మా వాడి గొప్ప. వట్టి తిక్క శంకరయ్య వాడు. తను పట్టిన కుందేలుకి మూడే కాళ్లు. నాలుగు కళ్లు అంటాడు. అందంలో, డబ్బులో, జల్సాలో వాడిని తలదన్నే వాళ్లున్నారు. అందుకే నేను ముందే చెప్పాను. దేనికన్నా ధైర్యంగా వుండాలమ్మాయ్ అని. మీ మేనత్తలా నీవూ భావిస్తే ఎలా! తాననుకుంటుంది. ఆమె లేకపోతే నేను బ్రతకలేనని. నీవలా అనుకోకూడదు. ఈకాలపు పిల్లవి. చదువుకున్నదానివీ నీవే ఇలా సెంటిమెంట్స్‌కి కమిట్టయిపోతే ఎలామ్మా? ప్లీజ్ కంట్రోల్ యువర్‌సెల్ఫ్'' అంటూ ఓదార్చాడు సూర్యనారాయణ.

"అంకుల్! బావ నన్ను పెళ్లి చేసుకోడని మీకు ముందే తెలుసా?" సూటిగా అడిగింది అనసూయ.

"లేదమ్మా వాడిమీద కొండంత ఆశతో నీవు కట్టుకునే గాలిమేడలన్నీ పేకముక్కల్లా కూలిపోతే తట్టుకోలేక కృంగిపోతావేమోననే దృక్పథంతో హెచ్చరిస్తున్నాను. అంతే! ఒకవేళ వాడి మనసు కరిగి నిన్ను పెళ్లాడితే మా కంతకన్నా కావల్సిందేముందమ్మా? నీవు మా కోడలిగా రావాలని మనసారా ఆ భగవంతుణ్ణి కోరుకుంటున్నానమ్మా. మరోవిధంగా భావించకు. ఇక నువ్వు నవ్వు ముఖం తెచ్చుకో. స్టేషన్ వచ్చేసింది'' అంటూ అనసూయ తలని ఆప్యాయంగా నిమిరారు సూర్యనారాయణగారు.

అనసూయ ఇంకా గంభీరంగానే ఉంది.

"నీ వయసులో మీ అత్తమ్మ నాతో ఇలా ఎపుడన్నా బయటకొచ్చినప్పుడు ఏదన్నా హెూటల్‌కెళితే నీకేం కావాలి కళ్యాణీ అనే వాడిని. మీరేం తింటే నాకూ అదే అనేది. ఏం కావాలని అడిగినప్పుడల్లా అలానే అనేది. ఒకసారి నాకు ఒళ్లుమండి హెూటల్ సర్వర్‌తో మీ అత్తమ్మ ముందే "నాకు పచ్చిగడ్డి తినాలనుంది. మా ఇద్దరికీ రెండు ప్లేట్లు వేడిగా వేగించి తీసుకురావోయ్ అన్నాను. అంతే! అప్పటినుండీ తనకేం కావాలో చెబుతుంటుంది నాతో'' అన్నారు సూర్యనారాయణగారు అనసూయని నవ్వించాలని.

అప్పటివరకూ గుంభనంగా ఉన్న అనసూయ ఫక్కున నవ్వేసింది.

పిచ్చిపిల్ల అని మనసులో అనుకొని రైల్వేస్టేషన్‌లోకి ప్రవేశించారు సూర్యనారాయణగారు.

అనసూయ ప్లాట్‌ఫాం టికెట్స్ తీసుకుని సూర్యనారాయణగారి వద్దకు వచ్చి నిలబడింది. ఇద్దరూ వినయ్ కోసం ఎదురు చూడసాగారు.

★ ★ ★

ఫస్ట్‌క్లాస్ కంపార్ట్‌మెంట్‌నుండి రైలుదిగి లగేజి కూలీకిచ్చి హుందాగా నడిచి వస్తున్న వినయ్, తనకోసం ఎదురుచూస్తున్న తండ్రిని, అనసూయని చూసి కాస్త వేగంగా నడిచొచ్చి, "నాన్నగారూ బావున్నారా? అమ్మ ఆరోగ్యమేనా! హాయ్! అనూ హౌవ్వార్యూ'' అంటూ పలకరించాడు.




పలకరింపులయ్యాక

"బాబూ సామాన్లు బయట పెట్టనా?" అన్నాడు కూలీ.

"వద్దు ఇక్కడే పెట్టు'' అంటూ అతనికి డబ్బులిచ్చి పంపించేశాడు.

"అవునూ బాపిరాజు నీతో వస్తానన్నాడుకదా రాలేదేంటి'' ప్రశ్నించారు సూర్యనారాయణగారు.

"వచ్చాడండీ! ఇంతకుముందు స్టేషన్లో నీళ్లకని వాటర్‌బాటిల్ పట్టుకుని దిగాడు. వెంటనే రాకుండా ఎవరో ఫ్రెండ్ కనిపిస్తే బాతాఖానీ వేసుకున్నాడు. ఈలోగా ట్రెయిన్ కదిలిపోయింది. వాడక్కడ మిగిలిపోయాడు. ఇంకో ఐదు నిమిషాల్లో అక్కడినుండి ఒక ప్యాసింజర్ బండి వస్తుందట ఇక్కడికి. బహుశా అందులో వస్తాడు వాడు. అందుకే ఇక్కడ వెయిట్ చేద్దాం" అన్నాడు వినయ్.

"అయ్యో పాపం వాడెంత వర్రీ అవుతున్నాడో. అసలే ఈ ప్రాంతం కొత్త వాడికి'' అన్నారు సూర్యనారాయణగారు.

"వాడిక్కొత్తా పాతా ఉండదు. పాస్‌పోర్ట్ లేకుండా పాకిస్తాన్‌లో కూడా పైలాపచ్చీసుగా తిరిగిరాగలడు. ట్రెయిన్ ఆగిన ప్రతి స్టేషన్లోనూ దిగిపోతాడు. వాడికదో సరదా'' అన్నాడు వినయ్ కాస్త కోపంగా. "పోన్లేరా ఉత్సాహవంతుడు, తెలివైనవాడు కదా జీవితంలో ప్రతిక్షణాన్నీ ఆనందంగా అనుభవిస్తాడు వాడు. నీలా కొరివితో తలగోక్కోడు'' అంటూ చిన్న చురకవేశారు సూర్యనారాయణగారు.

"బలే ఫ్రెండ్‌ని తెచ్చుకున్నావు బాబూ! ఈ రోజు అతను కనుక రాకపోతే! రేపు పేపర్లో మనింటి అడ్రస్ వేద్దాంలే' అంది అనసూయ.

"అనూ! నీకిక మంచి కాలక్షేపమే! నీ టేస్ట్‌కి సరిగ్గా సూటవుతాడు చూస్తావుగా'' అన్నాడు వినయ్ అనసూయని ఆటపట్టిస్తూ.

"పోన్లే బావా అందరూ నీలా ఆదర్శవంతులూ, సంస్కారవంతులూ అయితే నాలాంటి వాళ్ళకి ఈ ప్రపంచంలో చోటే ఉండదు'' అంది కాస్త చిరుకోపంగా.

"ఏంటో నీ డైలాగ్‌లోని లాజిక్ నాకర్థమవ్వలేదు. ఒకవేళ నిన్ను హర్ట్‌చేసివుంటే సారీ'' అన్నాడు వినయ్.

"సొంత బావవి నువ్వుండగా పరాయివాళ్ళతో ఈమెకు కాలక్షేపమేమిట్రా? నువ్వామాట నేప్పుడు ఆలోచించుకోవద్దూ'' అన్నారు సూర్యనారాయణగారు.

"ఓహో మీరిద్దరూ ముందే ప్రిపేరయి వచ్చినట్టున్నారు. తర్వాత మాట్లాడుకుందాం. నేనిప్పుడు బాగా అలసిపోయున్నాను'' అన్నాడు వినయ్.

అంతలో బాపిరాజు వేగంగా నడుచుకుంటూ వచ్చేశాడు. "నమస్కారం బాబాయ్ బావున్నారా!" అంటూ సూర్యనారాయణగారికి నమస్కారం చేశాడు.

"అంతా బావున్నాం. ముందు స్టేషన్లో తప్పిపోయావట. ఇంతలో ఎలా ప్రత్యక్షమయ్యావోయ్'' నవ్వుతూ అడిగారు సూర్యనారాయణగారు.

"బాటిల్ నీళ్లుపట్టి వస్తుంటే నా చిన్ననాటి ఫ్రెండొకడు కలిశాడు. వాడూ నేనూ చిన్నప్పుడు అబ్బో... ఒకటేమిటి! గుడిలో దేవుడికి పెట్టిన నైవేద్యమూ, కొబ్బరిచిప్పలూ దొంగిలించి తినేసేవాళ్లం. అవన్నీ గుర్తుచేశాడు రాస్కెల్. ఇంతలో ట్రెయిన్ కదిలిపోతుంటే లాస్ట్‌బోగీ ఎక్కేశాను పొరపాట్న. అదేమో లేడీస్ స్పెషల్ బోగీ. ఇక చూస్కోండి నా పాట్లు. లేడీసంతా తిట్లతో తలంటు పోసేశారు. దానికితోడు లోపలొక లేడీ కానిస్టేబులుంది. "ఊc చెప్పు గత ఆరునెలలుగా ఈ బోగీలో హఠాత్తుగా చొరబడి ఆడాళ్ల మెళ్లో గోల్డ్ చెయిన్స్ తెంపుకుపోయేది నువ్వేకదూ అంటూ నన్ను తెగ ఇబ్బంది పెట్టేసిందిలే. ఆఖరికి నా రిజర్వేషన్ టికెట్. నా ఐడింటీకార్డు వగైరాలన్నీ చూపించి ఇదిగో ఇప్పుడే బయటపడ్డానుహు'' అంటూ నిట్టూర్చాడు బాపిరాజు.

బాపిరాజు చెప్పిన సంఘటనకి అందరూ



నవ్వేశారు. అనసూయ మరీ చిన్నపిల్లలా నవ్వేసింది.

"ఇంకా నయం ఏ పిక్‌పాకెటరో అని స్టేషన్లోకి తొయ్యనందుకు సంతోషించు. అన్నట్లు నీకు పరిచయం చెయ్యలేదుకదూ! ఈమె నా మేనమరదలు అనసూయ" అంటూ పరిచయం చేశాడు వినయ్.

"హాయ్! గ్లాడ్ టూమీట్ యూ'' అంటూ ...ష్ చేశాడు బాపిరాజు.

అనసూయ కూడా ప్రతి నమస్కారం చే...ది. అందరూ సామాన్లు తీసుకుని స్టేషన్ బయటకొచ్చి రెండు ఆటోల్లో ఇంటికి బయలుదేరారు. ఒక ఆటోలో వినయ్, బాపిరాజు, మరో ఆటోలో సూర్యనారాయణగారు, అనసూయ కూర్చున్నారు.

★ ★ ★

కళ్యాణమ్మ పసుపు, కుంకుమ కలిపిన నీళ్లు ఒక పళ్లెంలోపోసి వినయ్‌కి దిష్టి తీసింది. "ఎందుకమ్మా ఇవన్నీను. నీ పద్ధతులు మార్చుకోవుకదా'' అన్నాడు వినయ్.

"నీ మొహం నీకేం తెలుసు! ఎంత దూరాన్నించొస్తున్నావో! ఎంతమంది దిష్టి నీ మీద పడిందో! ఆ దోషం పోవక్కర్లేదూ'' అంటూ అందరినీ ఇంట్లోకి ఆహ్వానించింది.

"రెండేళ్ళుగా నాతో కలిసి మెలిసి ఉన్న మిత్రుడు బాపిరాజని చెప్పానే ఇతనేనమ్మా'' అంటూ బాపిరాజుని కళ్యాణమ్మగారికి చూపించాడు వినయ్. బాపిరాజు వంగి కళ్యాణమ్మగారి కాళ్లకి నమస్కారం చేశాడు.

"చాలా సంతోషం నాయనా! చక్కగా, పద్ధతిగా, వినయంగా వున్నావ్. నిండునూరేళ్లు సుఖంగా వర్ధిల్లు బాబూ'' అంటూ బాపిరాజుని ఆశీర్వదిస్తూనే మెచ్చుకుంది కళ్యాణమ్మ.

"మీరంతా చక్కగా వేడినీళ్లతో స్నానాలవీ చేసిరండి. తర్వాత భోంచేసి కాస్త కునుకు తీద్దురుగాని అమ్మాయ్ నీవెళ్లిఎక్కడేమేం ఉన్నాయో అన్నీ చూపించు వాళ్లకి." అనసూయతో చెప్పింది కళ్యాణమ్మ.

"ఏవండోయ్ మీరిటురండి! ఏంటి మీరూ వేన్నీళ్లు పోసుకుని నిద్రపోదామనే. ఆ! నిన్న మునక్కాయలు దొరకలేదన్నారుకదా! సాయంత్రం సాంబారులోకి కావాలి కానీ మీరెళ్లి బజార్లో ఎక్కడున్నాసరే పదికాడలు సంపాదించి పట్రండి. అలానే బొంతరిటి కాయ లుంటే కూడా తీసుకురండి. రేపొద్దుట బజ్జీలేసుకోడానికి పనికొస్తాయి'' అంటూ చకచకా చెప్పేసింది కళ్యాణమ్మ సూర్యనారాయణగారితో.

"బొంతరిటికాయలు ఓ.కె. కానీ మునక్కాయలు దొరక్కపోతే!" సందేహంగా అన్నారు సూర్యనారాయణగారు.

"అవి దొరికేంతవరకూ వెదుకుతూ హిమాలయాలవరకైనా వెళ్ళండికానీ ఒట్టిచేతులతోమాత్రం తిరిగి రాకండి. మరీ అంతగా దొరక్కపోతే మీ స్కూల్లో చదివే ఏ పిల్లగాడి ఇంట్లోనైనా మునగచెట్టుందేమో కనుక్కొని ప్రయత్నించండి'' అంది కళ్యాణమ్మ.

ఆ మాట వింటూ అటువచ్చిన అనసూయ నవ్వుతూ "కొడుకుని చూసిన ఆనందంలో అంకుల్‌ని హడావిడి చెయ్యడం ఏం బావోలేదత్తా. మునక్కాయలు కావాలంటే మీ అబ్బాయినే పంపండి. ఇందాక స్టేషన్‌వరకూ నడిచే వెళ్ళాం మేం" అంటూ సూర్యనారాయణగారి తరపున మాట్లాడింది.

"చాల్లే మన పనులు మనం చేసోక్కడంలో ఇబ్బందేముంది? నీవు చెప్పినట్లు వినయ్‌ని మార్కెట్‌కి పంపిస్తే వాడు ఒక్క మునక్కాడకి 20 రూపాయలిమ్మన్నా ఇచ్చేస్తాడు. మీ అంకుల్ అలా కాదు. కొనుగోలు చెయ్యడంలో ఈ దేశంలోనే ఆయన్ని మించినవారుండరు. షాపువాడు రూపాయి చెబితే ఈయన పదిపైసలకి అడుగుతారు. చాలామంది షాపువాళ్ళు మీ అంకుల్ వాళ్ళ షాపుకొస్తున్నాడని తెలిస్తే చాలు అమాంతం షట్టర్లు మూసేస్తారు. ఆయనడిగే రేట్లంటే అంత హడల్ షాపులవాళ్ళకి.




అందుకే ఏం కొనాలన్నా ఆయనే దిక్కు'' అంది కళ్యాణమ్మ.

ఆ మాట విన్న అనసూయకి నవ్వాగలేదు. కూరగాయల బుట్ట తీసుకుని సూర్యనారాయణగారు విసురుగా బయటకెళ్ళిపోయారు.

వినయ్, బాపిరాజు స్నానంచేసి హాల్లోకొచ్చారు. అంతకుముందే అన్నీ సిద్ధంచేసి వారి రాకకోసమే ఎదురు చూస్తున్న కళ్యాణమ్మ వాళ్ళని భోజనాలకి పిలిచి, ఆప్యాయంగా వడ్డిస్తోంది.

"బాబాయ్‌గారు రాకుండా మేం తినేస్తున్నాం. ఆయనేం అనుకుంటారో'' అన్నాడు బాపిరాజు.

"ఏం ఫర్వాలేదు నాయనా! ఆయన పైకి మింగ్సే వేరు. పొద్దుటే భోంచేసి మధ్యాహ్నం టిఫిన్ చేస్తారాయన. మళ్ళీ సాయంత్రం ఐదు గంటలకే భోంచేస్తారు. అందుకే ఆయనతో ఎప్పుడన్నా పండగలకే తప్ప మామూలు రోజుల్లో వీలుకాదు కలిసి భోంచేయడానికి. ఇంకో రెండు గరిటెలు నెయ్యి వేసుకో నాయనా'' అంటూ వివరణ ఇచ్చింది కళ్యాణమ్మ.

"కూరలు బ్రహ్మాండంగా ఉన్నాయి ఆంటీ'' అన్నాడు బాపిరాజు.

"మా **ఆంటీ** కాకరకాయ కూరని కూడా కమ్మగా వండగలదు బాపిరాజుగారూ'' అంది అనసూయ.

"కూరలు, పచ్చళ్ళు నేనే చేశానుకానీ పప్పుచారుమాత్రం అనసూయ చేసింది. బాగోకపోతే నన్ను తిట్టుకోకండి'' అంది కళ్యాణమ్మ.

"తింటూ అబద్ధం ఆడకూడదుకానీ నిజానికి పప్పుచారు అద్భుతంగా ఉందండీ'' అన్నాడు బాపిరాజు.

"థాంక్స్'' అంది అనసూయ.

"నాకయితే ఈ పప్పుచారు తప్ప మిగతావన్నీ బాగా నచ్చాయి'' అన్నాడు వినయ్.

"పోన్లే మీకు నచ్చినందుక్కూడా థాంక్స్ చెబుతున్నాను'' అంది అనసూయ.

"వాడు సరదాగా అంటున్నాడు నీవేం బాధపడకే! రేపొద్దుట నీ వంటలకి అలవాటు పడితే మెచ్చుకోకుండా ఉండలేడులే'' అనసూయని సమర్థించింది కళ్యాణమ్మగారు.

ఆ మాటకు వినయ్‌కి పొలమారింది. చిన్నగా దగ్గి నీళ్ళు తాగాడు.

"జీవితంలో చాలాకాలం హాస్టల్ భోజనాలకి అలవాటు పడిపోయిన నాకు మీ వంటలు నూతనోత్సాహాన్ని తెస్తున్నాయి ఆంటీ'' అన్నాడు బాపిరాజు.

"పుష్టికరమైన భోజనంవల్ల ఆరోగ్యం వస్తుంది కదాండీ! అందుకే మీకు అలా ఉత్సాహంగా అనిపిస్తుండొచ్చు'' అంది అనసూయ బాపిరాజు కామెంట్‌ని కట్‌చేస్తూ.

"అదేమిటే బాపిరాజు చక్కగా మొహమాటం లేకుండా మాట్లాడుతుంటే పుల్లవిరుపులు వేస్తున్నావ్. చూడునాయనా కాస్త లోకువగా కనిపిస్తేచాలు మా అనసూయ ఆటపట్టించేస్తుంది కనుక కాస్త జాగ్రత్తసుమా'' అంది కళ్యాణమ్మ.

"ఏం ఫర్వాలేదు ఆంటీ! నిజానికి ఎవరేమన్నాసరే బాధపడే లక్షణం నాదికాదు. అదేంటో మరి చిన్నప్పట్నుండీ నన్నెవరైనా 'చవటవెధవా' అని తిట్టినా నాక్కోపం రాదండీ. ఎందుకంటే నేను చవటనీ, వెధవనీ కాదుకనుక ఆ మాట నాకు వర్తించదనుకుంటాను'' అన్నాడు బాపిరాజు.

అందరూ నవ్వేశారు. భోజనాలు అయ్యాయి. అంతలో సూర్యనారాయణరాజుగారు మునక్కాడలూ, బొంతరిటికాయలూ, ఇంకా చిల్లర సామాన్లు తీసుకుని వచ్చారు.

"ఊరు చూట్టానికి సాయంత్రం వెళ్ళొచ్చు కానీ మీరు విశ్రాంతి తీసుకోండయ్యా'' అంటూ సూర్యనారాయణగారు పడక్కుర్చీలో వాలిపోయారు.

★ ★ ★

మధ్యాహ్నం మూడు గంటలకు వినయ్,



బాపిరాజు, అనసూయ గోదావరి తీరానికి బయలుదేరారు. బాపిరాజుకి ఊరు చూపించాలని, వినయ్ ప్రతి ఒక్క విషయాన్నీ వివరించి చెబుతున్నాడు. బాపిరాజు ఆసక్తిగా అన్నీ చూస్తున్నాడు. మధ్యమధ్య కామెంట్ చేస్తూ నవ్విస్తున్నాడు. బాపిరాజు జోకులు వినయ్‌కి సుపరిచితమే కనుక అనసూయకే కొత్తగా ఉంది.

"రాజమండ్రి దేనికి ప్రసిద్ధో చెప్పుకోండి రాజుగారూ'' అంది అనసూయ బాపిరాజును ద్దేశించి.

"పుష్కరాలకండి.. మరేమో గోదావరిని అటునిటూ కలుపుతూ రెండు రైలుబ్రిడ్జీలున్నాయండీ. ఇక్కడికి ఇరవైకిలోమీటర్ల దూరంలో పాపికొండలున్నాయండీ. అక్కడ చాలామంది సినిమా షూటింగ్‌లు పెట్టుకుంటారండి. అందుచేత ప్రసిద్ధండి'' అన్నాడు బాపిరాజు ముఖ్యంగా 'అండీ' అనే పదాన్ని ప్రత్యేకంగా పలుకుతూ.

"గోదావరి జిల్లావాళ్ళం గౌరవానికి అండి అంటాంకానీ దాన్ని చాలామంది అర్థంచేసుకోకుండా అదేదో మేం వదులుకోలేని వ్యసనమనుకుంటారు పాపం. ఎవరిపిచ్చి వాళ్ళకానందం" అంటూ వెటకారంగా అంది అనసూయ.

"అబ్బా!" అంటూ కుడిచేతి వేళ్ళను నోటితో ఊదుకున్నాడు బాపిరాజు.

"ఏమైంది?" అంటూ వినయ్, అనసూయ ఆతృతగా అడిగారు.

"అదేనండీ మీరు మాటలతో చురక వేశారుకదా! అందుకు'' అన్నాడు బాపిరాజు. మళ్ళీ తనే అంటూ "మాదీ గోదావరి జిల్లానే. కాకపోతే చిన్నతనంలోనే వైజాగ్ సైడ్ వెళ్ళిపోయాం. అందుకే నేను 'అండి'కి దూరమైపోయాను. నిజానికి మాట్లాడటంలో ఈస్ట్, వెస్ట్ జిల్లాల వాళ్ళ స్టయిలే వేరండి. సభ్యతా, సంస్కారాలు ఉట్టిపడతాయి. నేనేదో గోల్డ్‌కవరింగ్ ఇస్తున్నాననుకోకండి. మనస్ఫూర్తిగా అంటున్నాను'' అన్నాడు బాపిరాజు.

"ఏం బావా నువ్వేంటి మౌనంగా! ఏమైనా విషయాలు చెప్పొచ్చుకదా!" వినయ్‌ని ఉద్దేశించి అంది అనసూయ.

"మీరేదో గాలి పోగుచేసుకుని మాట్లాడుకుంటున్నారుకదా మధ్యలో సుడిగాలిలా నేనెందుకని'' అన్నాడు వినయ్.

"అంటే మేం మాట్లాడుకొనేవన్నీ గాలికబుర్లేనా! నువ్విలా మా గాలి తీసెయ్యడం ఏం బావోలేదు బావా. పోనీ మంచివిషయాలేవో నీవు చెప్పు మేం వింటాం" అంది అనసూయ.

"ఏ సబ్జక్టులోనయినాసరే పాయింట్ ఉంటే నే మాట్లాడతాడు వినయ్. అదొక్కటే బండగుర్తుగా పెట్టుకోండి అనసూయగారూ'' అన్నాడు బాపిరాజు.

"ఏంటోనండీ... మనసుకు తోచిందీ, నోటికొచ్చిందీ మాట్లాడేయడం నా అలవాటు. పాయింట్లూ, సబ్జక్టులూ, డెప్తూలాంటివి నాకేం తెలీవు'' అంది అనసూయ.

"సర్లెండి! వినేవాళ్ళకూ, చెప్పేవాళ్ళకూ అండర్‌స్టాండింగ్స్ ఉండాలేకానీ సుందరకాండని అరబిక్‌లో చెప్పినా మధురంగా ఉంటుంది'' అన్నాడు బాపిరాజు.

"ఇంకా నయం మైఖేల్ జాక్సన్‌తో త్యాగరాజ కీర్తనలు పాడించినా మధురంగా ఉంటుంది అన్నావు కాదు!" అన్నాడు వినయ్. అనసూయ పెద్దగా నవ్వేసింది.

"అయ్యబాబోయ్! ఆలస్యమైనా అదరగొట్టే జోకేశాడు బాబోయ్'' అంటూ బాపిరాజు రోడ్డుమీదే ఎగిరిగంతేశాడు.

"ప్లీజ్ బాపిరాజుగారూ! అందరూ మనల్నే చూస్తున్నారు. మీరు కాస్త ఓవర్ తగ్గించాలి... ప్లీజ్!" అంది అనసూయ.

"జనాలకి జడిసి మన మూడ్స్ కంట్రోల్ చేసుకోవడం అనారోగ్యం అనసూయగారూ! ఇదే ఫారెన్‌లో అయితే ఏ భావాన్నయినా, ఏ అనుభూతినయినా స్పష్టంగా అనుభవిస్తారు వాళ్ళు. ఫరెగ్జాంపుల్ నడిరోడ్డుమీద ఫారెనర్స్ డ్రెస్ ఛేంజ్ చేసుకోవడానికి భయపడరు. బాడ్




లక్ ఏంటంటే ఇండియన్స్ వాళ్ళ స్వంత విషయాలమీద కాకుండా ఎదుటివాళ్ళ విషయాలమీదే ఎక్కువ కాన్సన్‌ట్రేషన్ పెడ్తారు. అంచేత ఎంజాయ్ చెయ్యడంలో నేను ఫారెనర్స్‌తోనే ఏకీభవిస్తాను'' అన్నాడు బాపిరాజు.

"నిజమే మీరన్నట్లు సెంట్‌పర్సెంట్ నవ్వడానికి మనం సాహసించలేం. ఎదుటివాళ్ళు ఏమనుకొంటారో అనేది మన జబ్బు. కానీ మనం ఇండియన్స్‌మి. పైగా ఆంధ్రులం. పక్కా రాజమండ్రి నడివీధిలో నిలబడ్డాం. అంతా తెలుసున్నవాళ్ళే కనుక మీరు కాస్త గేర్ న్యూట్రల్‌కి మార్చాలి'' అంది అనసూయ.

"ఓ.కే. మీకోసం నేను కంట్రోల్ అవుతాను. ప్రొసీడ్'' అన్నాడు బాపిరాజు.

కాస్త దూరంలో ఒక వ్యక్తి మొక్కజొన్న పొత్తులు కాలుస్తున్నాడు.

"రాజుగారూ! మొక్కజొన్న పొత్తులు తింటారా! చాలా బావుంటాయి తెస్తానుండండి'' అంటూ అనసూయ అటు వెళ్ళింది.

"కాస్త లేతవి మీడియంగా ఉండేలా కాల్పించుకురండి'' అన్నాడు బాపిరాజు ఆనందంగా.

అనసూయ మొక్కజొన్న పొత్తులు బేరం చేయడంలో మునిగిపోయింది.

"హమ్మయ్య గాలివాన వెలిసినట్లుంది. ఒట్టి నసపిట్ట. అనసూయ పెర్ఫార్మెన్స్ ఎలా ఉందోయ్'' అన్నాడు వినయ్ బాపిరాజుతో.

"చాలా ఫ్రెండ్లీ నేచరుందిరా! స్ట్రేట్ ఫార్వర్డ్. చాలా ఎంటర్‌టైన్‌మెంట్ ఇస్తుంది ఎంకరేజ్ చేస్తే'' అన్నాడు బాపిరాజు.

"నేను చెప్పానుకదా నీలాగే సరదాగా బతికేస్తే చాలు అనుకొనే టైప్ అని. అందుకే నీకు ఆమెమీద సదభిప్రాయం కలిగుంటుంది'' అన్నాడు బాపిరాజు.

"ఆమె నీ భార్య కావడానికి ప్రాథమిక లక్షణాలన్నీ ఓ.కే. బట్ నీ అభ్యుదయ భావాలను ఎంకరేజ్ చేసే స్థాయిమాత్రం ఆమెలో లేదు. ఆమె ఓ సగటు భర్తకి అందమైన చురుకైన భార్యగా మాత్రం పూర్తిగా సక్సెస్ అవుతుంది'' అన్నాడు బాపిరాజు.

"అంటే నీలాంటి సగటు మనిషికి'' అన్నాడు వినయ్.

"నీ డైలాగ్‌లో ఏదో డబుల్ మీనింగు ఉంది మిత్రమా'' అన్నాడు బాపిరాజు.

"అవున్రా! అనసూయ నీకు తగిన కాంబినేషన్. ఒకవేళ ఆమె నిన్ను ఇష్టపడితే మీకు నేను పూర్తి కోపరేషన్ ఇస్తాను. నా ఉద్దేశంలో నీ ప్రవర్తనా, నీ మాటలు ఆమెను బాగా ఆకట్టుకున్నాయి. అందుకే చాలా ఉత్సాహంగా ఉంది'' అన్నాడు వినయ్.

బాపిరాజు కొంచెం అయోమయంలో పడ్డాడు. కొన్ని సెకన్లు అయ్యాక "నామీద నీకు కోపం ఉంటే నైన్ నెంబర్ బాటా చెప్పొకటి కొనిస్తాను. అది అరిగి చిరిగిపోయేదాకా కొట్టరా! అంతేకానీ నువ్విలా నన్ను హర్ట్‌చేయకు. ఆమె నిన్ను పెళ్ళాడాలని కొండంత ఆశతో ఉంది. మీ అమ్మగారు ఇంచుమించు అంతకు రెట్టింపు ఆశతో ఉన్నారు. నీవు ఆమెను ఇష్టపడటంలేదనే విషయం కూడా తెలీని అమాయకురాలు ఆమె. ముందా గొడవలన్నీ తేలకుండా ఆమె ట్రాక్‌లోకి నన్ను లాగుతున్నావు. ఈ విషయం మీ అమ్మగారికి తెలిస్తే ముందు నా మొహంమీద ఉమ్మేస్తుంది. ఇక నా విషయమంటావా... అనసూయని ఫ్రెండ్లీగానే ట్రీట్ చేస్తున్నాను. ఆమెకూ నామీద నీ ఫ్రెండ్‌ననే అభిప్రాయముండొచ్చు తప్ప సరదాగా మాట్లాడుతున్నానని పుసుక్కున లొలో పడే అమాయకురాలేం కాదు. ఆడవారి మాటలకు, చేష్టలకూ అర్థాలు వేరని వెనుకటికి ఎందరో మహానుభావులు చెప్పారు. నీవు మాట్లాడకుండా ముభావంగా ఉన్నావని ఆ గిల్టీనెస్ పోడానికి నాతో చనువుగా మాట్లాడి నిన్ను వెక్కిరించాలనుకుంటోంది కాబోలు. అది నీకర్థంకావడంలేదు. ముందు నీవు అనసూయని ఇష్టపడటంలేదు అనే విషయం మీ

అమ్మగారికి చెప్పాలి. అదో భూకంపం. మళ్ళీ నీవు ఆశయాలకోసం వితంతువుని పెళ్ళాడు తున్నావని చెప్పాలి. అది మహా ప్రళయం. ఇన్ని గండాలు దాటాలి కదా తోడుండి సరిదిద్దాలని వచ్చాను తప్ప నేను పెళ్ళి చేసుకోడానికి రాలేదు'' అంటూ కాస్త ఆవేశంగానే అన్నాడు బాపిరాజు.

"ఏంట్రా బ్రేకులు ఫెయిలయిన గూడ్స్ ఇంజన్లా ఆ దూకుడేంటి? ఇప్పుడు నేనేమన్నాను... ఆమె ఇష్టపడితే ఎంకరేజ్ చేస్తానన్నాను. దానికెందుకంత గింజుకుంటావ్! టేకిట్ ఈజీ! మొత్తంమీద అనసూయ విషయంలో కాస్త ఆవేశానికి లోనవుతున్నావనేది వాస్తవమేనన్న మాట" అన్నాడు వినయ్.

"సర్లే... ముందు ఆ సంగతి వదిలేసి నీ సంగతి చూడు. నేనలా దూరంగా పోతాను. నువ్వు మెల్లిగా అనసూయతో మాట్లాడి, నీ మనసులో విషయం చెప్పేసి ఆమెకు నచ్చజెప్పు'' అన్నాడు బాపిరాజు.

"వద్దు! ఇప్పుడా విషయం వద్దు! ఏ కొంచెం హర్టయినా తట్టుకోలేదు. పైగా మనం ఓదార్చలేం. అదేదో పెద్దవాళ్ళముందే జరగాలి. ఇప్పుడు నేను సడెన్‌గా కాదంటే అదిగో ఆ రైలు బ్రిడ్జిమీదకు పరిగెట్టుకుపోయిందనుకో మనమూ వెనకే పరుగెట్టాలి తెల్సిందా'' అన్నాడు వినయ్.

"కరెక్ట్! సాయంత్రం ఈ విషయం తేలిపోతుంది రెడీగా ఉండు. ఇక ఈరోజే మనకి సంతోషం. రేపటినుంచి బుద్ధభగవానుడు చెప్పినట్లు అంతా దుఃఖమే! అదిగో అనసూయ వచ్చేస్తోంది! సీన్ కటిన్యుటీకి వచ్చేయ్'' అన్నాడు బాపిరాజు.

అనసూయ పది మొక్కజొన్న కండెలు ప్లాస్టిక్ బాగ్‌లో వేసుకుని ఒకటి తింటూ అక్కడికి వచ్చింది. ఒకటి వినయ్‌కి, మరొకటి బాపిరాజుకిచ్చింది.

"బొబ్బర్లంక పొత్తులంటండీ. భలే రుచిగా ఉన్నాయి. అయిపోగానే చెప్పండి మరొకటిస్తాను'' అంది అనసూయ.

"ఈలోగా మిగతావన్నీ మీరు ఖాళీ చెయ్యరుకదా'' అన్నాడు బాపిరాజు.

అనసూయ నవ్వేస్తూ, "నామీద నమ్మకం లేకపోతే ఈ బాగ్ మీదగ్గరే ఉంచండి'' అంది.

"సరదాకన్నానులెండి. వైజాగ్ బీచ్‌లో తిరుగుతూ ఇలానే పొత్తులూ, మిరపకాయ బజ్జీలు, ముంతకింద పప్పూ తింటుండేవాళ్ళం" అన్నాడు బాపిరాజు.

"బావా! అడగడం మరిచాను. వైజాగ్ నుంచి వస్తూ నాకేం తీసుకురాలేదేం! ఊరు వచ్చేవరకూ నేను గుర్తున్నానో లేదో!" నిష్ఠూరంగా అంది అనసూయ వినయ్‌ని ఉద్దేశించి.

"రాజమండ్రిలో దొరకనివీ, వైజాగ్‌లో గొప్పవీ ఏం లేవులే. ఇక్కడ నీకేం కావాలో చెప్పు కొనిస్తాను. కంచి, ధర్మవరం, బనారస్, ఆరణి...!" అన్నాడు వినయ్.

"ఏం వద్దు... నీవు అభిమానంతో వైజాగ్ నుండి చిన్న కర్చీఫ్ తెచ్చినా ఆనందించేదాన్ని'' అంది అనసూయ.

"అభిమానం మనసులో ఉండాలికానీ దానికి గిఫ్టలతో పనేముందండీ. అవి ఇవ్వనంత మాత్రాన మీరంటే వినయ్‌కి అభిమానం లేదని భావిస్తున్నారా?" అన్నాడు బాపిరాజు.

ఆ మాట అంటున్నప్పుడు బాపిరాజు చేతిని వినయ్ గిల్లాడు అనసూయ చూడకుండా.

"మనసులో ఎన్ని వుంటే ఎవరిక్కావాలండీ. అది వ్యక్తం చెయ్యలేనప్పుడు ఆ అభిమానానికి ఏం విలువుంటుంది చెప్పండి? ఎడారిలో వెన్నెలరాత్రి ఎంతో బావుంటుందట. అది అందరూ చూడటం వీలుకాదు కదండీ. అందుకే మన డాబామీద వెన్నెలే ఎంతో ఆహ్లాదంగా ఉంటుంది మనకి'' అంది అనసూయ.

"ఎగ్జాంపుల్ అదిరిపోయిందండి. ఇంకొంచెం ఫినిషింగ్ ఉంటే మరింత బావుండేది. మొత్తంమీద మీది కూడా ఒక లైపాఫ్ కవి హృదయమేనన్నమాట. గ్రేట్...




రియల్లీ గ్రేట్" అన్నాడు బాపిరాజు చప్పట్లు కొడుతూ.

"అబ్బా చాల్లెండి మీరొకరు. ఇంతుంటేచాలు... అంత మెచ్చుకుంటారు" అంది చేతులు ఊపుతూ అనసూయ.

"ఎంకరేజ్‌మెంటండీ.. అది లేకపోతే ఎవరూ పైకి రాలేరు. అందుకే ప్రతిభ ఉన్న ప్రతి ఒక్కర్నీ పైకి రావాలని ఎంకరేజ్ చేస్తుంటాను. అది నా అలవాటు అంతే" అన్నాడు బాపిరాజు.

"ఇంతకీ నీ తాపత్రయం దేనికో నాకర్థంకావడంలేదు అనూ" అన్నాడు వినయ్.

"అర్థంకాదు బావా! ఎందుకంటే నాది లిపిలేని కన్నీటిభాష కనుక" అంది అనసూయ కాస్త గంభీరంగా.

"ఏమిటో ఇప్పుడు నీవన్న మాట కూడా నాకర్థంకాలేదు" అన్నాడు వినయ్ అనసూయని ఆటపట్టిస్తూ. వినయ్‌కీ, అనసూయకీ మధ్య జరిగిన ఈ సంభాషణ బాపిరాజు వినలేదు. బూటు లేస్ ఊడిపోయిందని వంగి ముడివేసుకుని కొన్ని నిముషాల తర్వాత అక్కడికి వచ్చాడు.

"చీకటి పడుతోంది ఇక ఇంటికి పోదామండి" అంది అనసూయ వినయ్‌ని, బాపిరాజుని ఉద్దేశించి. అందరూ ఇంటిదారి పట్టారు. మధ్యలో గోడలమీద కనిపించే సినిమా పోస్టర్ల పేర్లు పైకి చదువుతున్నాడు బాపిరాజు. "అల్లరి మొగుడు, రౌడీమొగుడు, రౌడీగారి పెళ్ళాం, అల్లరి ప్రియుడు, ఘరానామొగుడు...".

"ఛీ... ఛీ...!" అంటూ నవ్వుతూ చెవులు మూసుకుంది అనసూయ.

★ ★ ★

రాత్రి భోజనాలు కానిచ్చి అందరూ వరండాలో కూర్చున్నారు. కళ్యాణమ్మగారు పప్పు నానబెట్టి, తర్వాత బియ్యం పళ్ళెంలో పోసుకుని అందులో రాళ్ళేరుతోంది. పక్కనే అనసూయ కూడా కూర్చుని బియ్యంలో రాళ్ళు ఏరుతోంది. బాపిరాజు, సూర్యనారాయణరాజుగారు ఏదో డిస్కషన్‌లో ఉన్నారు. వినయ్ పడక్కుర్చీలో వాలి పైకి చూస్తూ ఆలోచిస్తున్నాడు.

"ఏమిట్రా ఒంట్లో బాలేదా!" అంది వినయ్‌ని ఉద్దేశించి కళ్యాణమ్మ.

"అబ్బే ఏంలేదు. వాళ్ళేదో మాట్లాడుకుంటుంటే వింటున్నాను" అన్నాడు వినయ్.

"ఏమండోయ్... మీ ఉపన్యాసం కాస్త ఆపుతారా ఒక్క ముక్క కూడా అర్థంకావడంలేదు మాకు. వాడికేమో తలపోటుగా ఉందో ఏమో" అంటూ సూర్యనారాయణగారిని కసురుకుంది కళ్యాణమ్మ.

"వాడొక్కడికే ఏమిటి? మన దేశ రాజకీయాలు చాలామందికే తలనొప్పిని తెచ్చిపెట్టాయి" అన్నాడు సూర్యనారాయణగారు ఏమీ కంగారుపడకుండా.

"బావుంది! రామాయణం వింటూ మరి సీతకోసం కర్ణుడూ, అర్జునుడూ ఎందుకు యుద్ధం చేశారు అన్నాడట వెనకటికెవరో మహానుభావుడు. అలా ఉంది మీ వరస" అంటూ మూతి తిప్పుకుంది కళ్యాణమ్మ.

అనసూయ ముసిముసిగా నవ్వుకుంది.

"సరే చెప్పు! నీ గొడవేమిటో కాస్త వివరంగా చెప్పుమరి" అన్నారు సూర్యనారాయణగారు.

"అందరం తీరుబడిగా వున్నాంకదా! ఆ విషయం ఇప్పుడు మాట్లాడుకుంటే బావుంటుందని!" అంది కళ్యాణమ్మ.

"ఏ విషయం" ప్రశ్నించారు సూర్యనారాయణగారు.

"అదే మన వినయ్ పెళ్ళి విషయం" అంది కళ్యాణమ్మ.

ఆ మాటతో అందరూ అలర్ట్ అయ్యారు.

"ఏ వయసులో జరిగే ముచ్చట్లు ఆ వయసులో జరిగితేనే అందం. పెళ్ళీడు దాటిపోయిందంటే అందరికీ ముదురు మొహాలు పడిపోతాయి" అంది కళ్యాణమ్మ.

"సరే! ఆ విషయమేదో నీ ముద్దులకొడుకుని నువ్వే అడుగు'' అన్నారు సూర్యనారాయణగారు.

"ఇందులో అడిగేదేముంది ఏమన్నా పరాయి సంబంధమా! వాడికి తెలీదూ! పైగా పెళ్ళికూతురు ఇక్కడే ఉంటేను'' అంది కళ్యాణమ్మగారు నవ్వుతూ.

వినయ్ మొహంలో ఆందోళన. తల్లి మనసుని నొప్పించే క్షణం. తానంటే ప్రాణం ఇచ్చే తల్లి హృదయాన్ని తూట్లు చేసే సమయం. భారంగా ఊపిరి పీలుస్తున్నాడు.

ఇంతలో బాపిరాజు కల్పించుకున్నాడు.

"ఆ చాల్లెండి... ఈ మేనరికాలకి రోజులెప్పుడో చెల్లిపోయాయి. అలాంటి దంపతులు అంత అన్యోన్యంగా ఉండటంలేదిప్పుడు'' అన్నాడు బాపిరాజు.

"అక్క కూతుర్ని చేసుకొంటే కాస్త దోషం ఉందేమోకాని మేనమామ కూతురికి అంతగా ఉండదులే నాయనా. పైగా మన అనసూయ అంతా వాళ్ళమ్మపోలిక. మా తమ్ముడి పోలిక ఒకటీ లేదు. కాకపోతే చిన్నప్పట్నుంచీ చూస్తుండటంతో కాస్త ఇదిగా అన్పించొచ్చుకానీ. ఇంట్లో బంగారం పెట్టుకుని ఇత్తడికోసం ఊరంతా తిరగడమెందుకనీ నా ఉద్దేశ్యం" అంది కళ్యాణమ్మగారు.

"క్షమించాలి! తనకి అనసూయ ఇష్టంలేదని వినయ్ నాతో చెప్పాడాంటీ... నోరు విప్పి మీతో చెప్పలేక'' అంటూ బాపిరాజు నీళ్ళు నమిలాడు.

ఆ మాటతో కళ్యాణమ్మగారు కొన్ని క్షణాలు స్థాణువైపోయారు. వెంటనే తేరుకుని "ఏంరా వినయ్ మాట్లాడవేం! బాపిరాజు చెప్పేది నిజమేనా'' అంది.

అనసూయ మౌనంగా తల వొంచుకుని నేలకేసి చూస్తోంది.

"అవునమ్మా! నిన్నిలా బాధపెడుతున్నందుకు క్షమించు. నేను అనసూయని భార్యగా ఏనాడూ భావించుకోలేదు. ఇన్నాళ్ళూ మీ మనసు నొప్పించకూడదని నాలో నేనే మధనపడేవాడినమ్మా'' వినయ్ భారంగా చెప్పేశాడు.

కొన్ని నిమిషాలు కళ్యాణమ్మగారు మౌనంగా ఉండిపోయారు. తర్వాత పైటకొంగు తీసుకుని నోటికడ్డుపెట్టుకుని కుమిలిపోయింది.

"నీకిష్టంలేదని ఒక్కమాటతో తప్పించుకున్నావు. పాపం అన్నెంపున్నెం తెలీని అనసూయ లేతమనసులో లేనిపోని ఆశలు పెంచి దానికన్యాయం చేసినందుకు నా కడుపు తరుక్కుపోతోందిరా'' అంది జీరబోయిన గొంతుతో, మౌనంగా రోదిస్తూ.

"నేను చెబుతూనే ఉన్నాను. సొంతబిడ్డలయినాసరే చదువు సంస్కారాలు అలవడ్డాక తల్లిదండ్రుల మాటలు వినరని. నీవేమో వాడింకా నీ చంకనెక్కి చందమామను చూస్తూ గోరుముద్దలు తీనే పిల్లాడనుకుంటున్నావు'' సూర్యనారాయణగారు భార్యను ఓదార్చే ప్రయత్నంచేశారు.

"వినయ్ అంటే మీకు కొడుకుగా అభిమానముండొచ్చుకానీ అతని ఆశయాలకు, అభిరుచులకు మాత్రం మీ మాతృత్వం వర్తించదమ్మా! బాధపడకండి! వినయ్‌కి ఇష్టంలేదు. సరైన టైంలో చెప్పాడు. ఇక జరగవలసింది చూడండి. ఊర్కే బాధపడితే ఏంలాభం" అన్నాడు బాపిరాజు.

"సరే... సందర్భం ఎలానూ వచ్చింది కనుక నీవు చేయబోయే ఘనకార్యం... అది కూడా మీ అమ్మతో ఇప్పుడే చెప్పు. మరోసారి చెప్పి ఆమె గుండెల్లో మంటలు రగిలించకు'' వినయ్‌ని ఉద్దేశించి కోపంగా అన్నారు సూర్యనారాయణగారు.

అసలే అయోమయంగా ఉన్న కళ్యాణమ్మగారు మళ్ళీ ఏ దుర్వార్త వినాల్సి వస్తుందోననే భయంతో తలెత్తి చూసింది.

"అవునమ్మా! నాకు మరో ఉద్దేశ్యముంది.





నాకు పెళ్ళంటూ జరిగితే ఒక వితంతువుతోనే జరగాలి. అందుకు నాకు చాలా కారణాలు ఉన్నాయి. అలా కుదరకపోతే నేనసలు పెళ్ళే చేసుకోను'' ధైర్యంగా చెప్పేశాడు వినయ్.

కళ్యాణమ్మగారు ఆ మాట విని గుండెలు బాదుకుంది.

"ఏంట్రా! నీకేమైనా పిచ్చెక్కిందా! లేక ఎవరైనా చేతబడి చేశారా! ఏమిటా మాటలు! నీకేం తక్కువని అలాంటి పిచ్చివేషాలేస్తున్నావ్? అసలు నువ్వేనా మాట్లాడుతున్నది? నీకేదో అయ్యిందిరా వినయ్'' అంటూ గొల్లుమని ఏడ్చేసింది కళ్యాణమ్మ. అనసూయ ఆమెను ఓదార్చుతోంది.

"నిత్యం శుభం జరిగే మా ఇంట్లో ఈ దెయ్యపు చేష్టలేమిట్రా భగవంతుడా! నీకేదో అన్యాయం చేసుంటాను. ఏ వ్రతంలోనో, పూజలోనో పొరపాట్లు చేసుంటాను. అందుకే నా కన్నకొడుకుతో అలా చేయిస్తున్నావు స్వామీ'' చేతికున్న వెంకటేశ్వరస్వామి ఉంగరాన్ని చూస్తూ అంటోంది కళ్యాణమ్మగారు.

"ప్లీజ్ ఆంటీ ఏమిటా మాటలు. ఇరుగు పొరుగువాళ్ళకి వినిపిస్తే ఇక్కడేదో జరుగుతోందనుకుంటారు. మీరు కాస్త స్థిమితపడితే మరిన్ని విషయాలు మాట్లాడుకోవచ్చు'' అంటూ బాపిరాజు ఓదార్చాడు.

"నా కారణంగా మీకెవ్వరికీ తలవంచుకొనే స్థితి రానివ్వను. నేను నా ఆశయాలను మీమధ్య అమలుజరుపుకోను కనుక మీరంత క్షోభకి గురికానక్కర్లేదు. నేను మీనుండి దూరంగా పోయాకే నా విధులు నేను నిర్వహిస్తాను'' అన్నాడు వినయ్.

"ఇది మనుషులు నివసించే ప్రపంచంరా వినయ్. ఇది అడవి కాదు. నీవాపని ఎక్కడ చేసినా మేమిక్కడ తల వొంచుకునే బతకాలి. నీవాపని చేశాక మా పరువు ఇంకా నిలబడుతుందని భావిస్తున్నావా?" అన్నారు సూర్యనారాయణగారు.

"నా దృష్టిలో నేను చేసేది పరువుపోయే పనని భావించను నాన్నా. ఒక మంచి ఆశయానికి కట్టుబడి ఆ పని చేస్తున్నానని గర్వపడతాను'' అన్నాడు వినయ్.

"ఆశయాలు తీసుకున్నంత తేలిక కాదురా వాటిని అమలుచేయడం. నా ఏభైఏళ్ళ అనుభవంలో నీ వయసు కేవలం 25 సంవత్సరాలే. ప్రపంచంలో ఎక్కడైనా సరే పరువుగా బతికేవాళ్ళకే క్షణక్షణం సవాలక్ష సమస్యలు ఎదురవుతున్నాయి.

"ఆశయాలు వేరు. అనుభవాలు వేరు. వాటికీ వీటికీ పొత్తే కుదరదు. నీ ఇష్టం... చెప్పవలసింది చెప్పాం. ఇక నీ బతుకు నీ ఇష్టం ఏంచేస్తాం కడుపుకోత మాకెలాగూ తప్పదు'' అన్నారు సూర్యనారాయణగారు ఆవేదనగా.

"ఎవరికి వారే బాధ్యత లేకుండా మీరు చెప్పినవిధంగా సమాజంలో ఎస్కేప్ అయిపోతుంటే మానవత్వపు విలువలకు స్థానం లేకుండా పోతోంది నాన్నగారూ! అప్పుడు మనిషికీ మృగానికీ తేడా తెలీని జనారణ్యమైపోతుందీ ప్రపంచం'' అన్నాడు వినయ్ సూర్యనారాయణగారికి సమాధానం చెప్పినట్లుగా.

"మన నోట్లో పిప్పిపన్ను బాధపెడితే అది మనమే అనుభవించాలి. ఆ బాధని ప్రపంచమంతా అనుభవించదురా వినయ్. దేశాన్ని పాలించేవాళ్ళే ప్రజల్ని పట్టించుకోని రోజులివి. సామాన్యుడివి నీకెందుకీ ప్రపంచం గురించి. సరే నీవిప్పుడు నీతివిషయాలు తెలుసుకొనే మూడ్‌లో లేవు. నీకు నచ్చినట్లు కానియ్'' అంటూ సూర్యనారాయణగారు తన రూంవైపు వెళ్ళిపోయారు నిద్రపోడానికి.

"నేనంటే నీకిష్టంలేకపోవచ్చు. అది నా దురదృష్టం. అంతమాత్రాన వితంతువునే ఎందుకు పెళ్ళాడాలి బావా! నీకు నచ్చిన కన్యనే పెళ్ళాడవచ్చుకదా!" అంది అనసూయ బొంగురుపోయిన గొంతుతో.

వెంటనే కళ్యాణమ్మ కల్పించుకుని "వా

# ఏరిన ముత్యాలు

☆ తన అజ్ఞానాన్ని తెలుసుకున్న మూఢుడు ఆమేరకు వివేకవంతుడే. కానీ, తానేదో జ్ఞానిని అని భ్రమించేవాడు పరమమూర్ఖుడు.

-గౌతమబుద్ధుడు

☆ ఆకలితో అలమటించేవానికి దేవుడు అన్నమై కన్పిస్తాడు. అందుకే 'అన్నం పరబ్రహ్మం' అన్నారు.

-గాంధీజీ

☆ నేనొక రాజకీయవేత్తనుగాను, సాంఘిక సంస్కర్తనుగాను, మానవుని రూ పొందించటమే నా పని.

-స్వామి వివేకానంద

☆ కళ జీవితాన్ని అనుకరించిన దానికన్నా ఎక్కువగా జీవితం కళను అనుకరిస్తుంది.

-ఆస్కార్ వైల్డ్

☆ ఈ ప్రపంచంలో ద్వేషాన్ని ద్వేషం ద్వారా నిర్మూలించలేం, ప్రేమద్వారా మాత్రమే దాన్ని పరిమార్చగలం.

-గౌతమబుద్ధ

☆ తర్కంకన్నా డబ్బుతో మనుషుల్ని త్వరగా ఒప్పించగలం.

-యూరిపిడిస్

☆ దేశంమీద ప్రేమ సత్ప్రవర్తనను పెంచుతుంది. సత్ప్రవర్తన దేశంమీద ప్రేమను కలిగిస్తుంది.

-మాంటెస్క్యూ

☆ ఓడిపోయిన వాడెప్పుడూ అనుమానిస్తాడు.

-సైరస్

☆ సాధారణ జీవితం దానంతట అదే ఒక బహుమతి.

-శాంతాయన

☆ సుఖజీవనానికి దారిద్ర్యం పెద్ద శత్రువు. ఇది స్వేచ్ఛను నాశనం చేస్తుంది.

-శ్యామ్యూల్ జాన్సన్

☆ మీకు ధనం విలువ తెలియాలంటే అప్పు తీసుకొండి.

-ఫ్రాంక్లిన్

☆ అప్పు ఆనందంతో ప్రారంభమై బాధతో అంతమవుతుంది.

-మోలియర్

☆ జీవితాన్ని స్వప్నంతో పోల్చడం కరెక్టే. మనం మేలుకొన్నప్పుడు నిద్రపోతున్నాం, నిద్రపోతున్నప్పుడు మేలుకొంటున్నాం.

-మాంటేజ్

సేకరణ: జక్కలభరత్

డితో మాట్లాడకు. ఆ అర్హత వాడు కోల్పోయాడు. పద ఇంట్లోకి పోదాం" అంటూ అనసూయను తీసుకుని లోనికెళ్ళిపోయింది కళ్యాణమ్మ.

అరగంట అక్కడి వాతావరణం మౌనంగా గడిచిపోయింది.

"నువ్వు పడుకోరా బాపి! ఏం... బాగా వర్రీ అయ్యావా!" అన్నాడు వినయ్ మంచంమీద వాలుతూ!

"నాకయితే పరిస్థితిని చూసి మనసు ద్రవించిపోయిందిరా. ఇంత సెంటిమెంట్‌తో నేనూ కమిట్ కావడంవల్లనేమో నా మనసంతా చెరువయిపోయి అందులో నా గుండె పడవలాగా ఊగుతోందిప్పుడు'' అన్నాడు బాపిరాజు.

"థాంక్స్‌రా! నా విషయంలో నీవు చాలా చొరవ తీసుకుని గట్టెక్కించావ్. నేనొక్కడినీ అయితే అది చెప్పడానికి చాలా రిస్క్ తీసుకోవాల్సి వచ్చేది'' అన్నాడు వినయ్.

"లేకపోతే నువ్వు చేసే ఘనకార్యం సామాన్యమైందా ఏంటి! మీవాళ్ళు మంచివాళ్ళు కాబట్టి సరిపోయింది. ఇదేవిషయం మా నాన్న దగ్గర నేను అనివుంటే నన్నీపాటికి కాళ్ళూ చేతులూ కట్టేసి పిచ్చాసుపత్రిలో పడేసేవాడు'' అన్నాడు బాపిరాజు.

"రేపటినుంచి మా అమ్మ, నాన్నా నాతో మాట్లాడరు. ఒకవేళ మాట్లాడినా వాటిలో లైఫ్ ఉండదు. రేప్పొద్దుటే అనసూయ వాళ్ళింటికెళ్ళిపోతుంది. ఇలాంటప్పుడు మనం ఇక్కడెందుకు. హైద్రాబాద్ వెళ్ళి ఉద్యోగాలకు ప్రయత్నిద్దాం" అన్నాడు వినయ్.

"పనిలో పని ఇక్కడే ఒక మంచి వితంతువుని చూసి పెళ్ళాడి హైద్రాబాద్ వెళ్ళిపోతే నీకు వంటబాధ, ఒంటిబాధ కూడా తప్పుతుందికదా!" అన్నాడు బాపిరాజు.

'సారీ నేనిప్పుడు నవ్వే మూడ్‌లో లేను. గుడ్‌నైట్' అంటూ వినయ్ నిద్రలోకి జారిపోయాడు.



తెల్లారింది. కాస్త ఆలస్యంగానే లేచారు వినయ్, బాపిరాజు. అప్పటికే సూర్యనారాయణగారు స్కూల్‌కి వెళ్ళడానికి రెడీ అయ్యారు. కళ్యాణమ్మ, అనసూయ కిచెన్‌లో బిజీగా ఉన్నారు.

"చూడు బాపిరాజూ! రాత్రి జరిగిందానికి మీరేం బెంబేలు పడకుండా చక్కగా భోంచేసి మధ్యాహ్నం అలా మా స్కూల్‌కేసి రండి! వస్తారుకదూ! నాకు టైమయ్యింది నేను వస్తా మరి'' అంటూ సూర్యనారాయణగారు బయట కెళ్ళిపోయారు.

"బాపిరాజుగారు! టిఫిన్ రెడీగా ఉంది మీరు స్నానం కానిచ్చి రండి'' అనసూయ గబగబా చెప్పేసి వెళ్ళిపోయింది.

"సింగిల్‌విండో పథకంలాగ నన్ను పట్టుకున్నారేంట్రా బాబూ! ఇక నీతో ఏది మాట్లాడాలన్నా 'వయా' నాద్వారాననమాట" బాపిరాజు నవ్వుతూ అన్నాడు వినయ్‌తో.

స్నానం చేసి బాపిరాజు, వినయ్ డైనింగ్ టేబుల్‌ముందు కూర్చున్నారు. టేబుల్‌మీద వేడి ఇడ్లీలు, సాంబారు రెడీగా ఉన్నాయి. "ముందు ఇడ్లీలు తింటుండండి. ఈలోగా పెసరట్లు వేసుకుని వస్తాను'' అంది అనసూయ

"ఎక్స్‌క్యూజ్‌మి... మీరెవరికి చెబుతున్నారో నాకర్థంకావడంలేదు" బాపిరాజు ప్రశ్నించాడు.

"మీకే" అంది అనసూయ.

"మీకే అంటే మా ఇద్దరికీనా... లేక నా ఒక్కడికేనా?" అడిగాడు బాపిరాజు.

"ఇద్దరికీనండీ" అంటూ కిచెన్‌లోకి వెళ్ళిపోయింది అనసూయ.

"అదిగో అలా వుంటాయి సాదా మనుషుల రియాక్షన్స్. నచ్చితే ఆకాశానికెత్తేస్తారు. నచ్చకపోతే పాతాళానికి తొక్కేస్తారు. అంతా మూసజీవితానికి అలవాటు పడిపోయిన మనుషులు. అందుకే నాకిక్కడ పరమ బోర్" అన్నాడు వినయ్.

"ఆ మాటలు చాటునుండి వింటూ పెసరట్లు తెస్తున్న అనసూయ కల్పించుకుంటూ "మేం చాలా సాదా మనుషులం బావా! మీలాగ స్పెషల్‌గా బతకడం మాకు చాతకాదు. మా ప్రవర్తన నచ్చకపోతే క్షమించండి" అంది బుంగమూతి పెడుతూ.

"అదిగో! ఆ దెప్పిపొడుపు మాటలు మాని కాస్త డిగ్నిఫైడ్‌గా మాట్లాడు అనేగా అంటోన్నది! ఎప్పుడూ మన ఇగోని అవతలివాళ్ళ






మీద బ్లెయిమ్ చేస్తూ మాట్లాడటం నాకు పరమ అసహ్యం. మీరిప్పుడు నామీద స్ట్రయిక్ చేస్తున్నంత మాత్రాన నేను పెద్దగా వర్రీకాను కూడా'' అంటూ వినయ్ కొన్ని క్షణాలు ఆగి

"మా అమ్మతో చెప్పు! నేను ఈ సాయంత్రా నికే హైద్రాబాద్ వెళ్ళిపోతాను. మా నాన్న రావడం ఆలస్యం. రాగానే ఆయనకో మాట చెప్పేసి వెళ్ళిపోతానని చెప్పు'' అన్నాడు వినయ్.

"ప్లీజ్ బావా! తొందరపడకు. ఆంటీ పొద్దు టనుండీ కనీసం టీ కూడా తాగలేదు. నువ్వి ప్పుడు ఇలా మాట్లాడితే ఆవిడింకా డల్ అయిపోతుంది'' అంటూ అనసూయ డైనింగ్ టేబుల్ముందు నిలబడింది.

"నేను మీతో పోట్లాడి ఏమీ వెళ్ళడంలేదు. చదువులు పూర్తయ్యాయి. మరి ఉద్యోగం కూడా చేసుకోవాలికదా! ఇలా తిని కూర్చుంటే మన కాళ్ళదగ్గరికి ఉద్యోగాలు రావుకదా'' అన్నాడు వినయ్.

"అందుకు ఎవరూ కాదనరు బావా! నిన్న వచ్చి ఈవాళ వెళ్ళిపోతానంటేమాత్రం పద్ధతి కాదు. అలాంటప్పుడు బాపిరాజుగారినెందు కంత శ్రమపెట్టి తీసుకొచ్చావు మరి '' అంది అనసూయ.

"ఇందులో శ్రమేముందండీ. ఒకవేళ నాకి క్కడ ఉండాలనివున్నా - వీడులేకుండా అంత చనువుగా వుండలేను కదండీ. అందుకే నేనూ హైద్రాబాద్ వెళ్ళి ఒక్క ఉద్యోగం ఇద్దరమైనా సరే- రెండు ఉద్యోగాలు ఒక్కరిమైనా సరే చేసి మా కాళ్ళమీద మేం నిలబడతాం" అన్నాడు బాపిరాజు.

అంతలో కళ్యాణమ్మగారు లోనికొచ్చారు.

"చూడు నాయనా బాపిరాజు! రాత్రంతా కంటిమీద కునుకులేకుండా ఏడ్చి ఏడ్చి నా కళ్ళిలా ఇంకిపొయ్యాయో- నేను కన్నకొడు కుని ఇంట్లోంచి పొమ్మనే మూర్ఖురాలిని కాదు. వాడి పద్ధతులు వాడికుంటే మా పద్ధతులు మాకుంటాయ్. ఇంతవరకూ వాడు కానిప నేమీ చేయలేదు కనుక ఇంట్లో ఉంటానికి మాకంత నామోషికాదు. వాడి పెళ్ళయ్యాక మాత్రం వాడిష్టం. అంతేకాని తొందరపడి మీరెక్కడికన్నా వెళ్ళారంటే మాత్రం నామీద ఒట్టే'' అంటూ చెప్పేసి కిచెన్లోకి వెళ్ళిపో యారామె!

"ఏమైనా సరే! నేనిక్కడ మాత్రం ఒకటి రెండురోజులు తప్ప ఎక్కువ ఉండేది లేదు!" కళ్యాణమ్మకు వినిపించేలా చెప్పాడు వినయ్.

టిఫిన్ పూర్తిచేసి, బట్టలు మార్చుకుని ఇంట్లోంచి బయటపడ్డారు వినయ్, బాపిరాజు.

  

'జిల్లాపరిషత్ హైస్కూల్, బోర్డ్ దూరాని

క్కూడా స్పష్టంగా కనిపిస్తోంది. వినయ్, బాపిరాజు హైస్కూల్‌లోకి వచ్చి హెడ్‌మాష్టర్ రూంవైపుగా నడుస్తున్నారు. వాచ్‌మెన్ వెంకటరమణ వినయ్‌ని గుర్తుపట్టి నమస్కారం చేశాడు.

"మీరొచ్చారని అయ్యగారు చెప్పారండయ్యా! చాన్నాళ్ళయ్యిందండీ చూసి. బాగా చిక్కిపోయారు'' అన్నాడు.

"ఇతను వెంకటరమణని ఈ స్కూల్లో వాచ్‌మెన్. నన్ను చిన్నప్పట్నుండీ స్కూల్ అయ్యాక ఇంటివరకూ సైకిల్‌పై దిగబెట్టేవాడు. ఈ స్కూల్ గార్డెన్‌లో పండిన అరటిపళ్ళ దగ్గర్నుండి జామకాయలవరకూ తెచ్చి నాకిస్తుండేవాడు, చాలా మంచి మనిషి'' అంటూ వెంకటరమణని బాపిరాజుకి పరిచయంచేశాడు.

"హెడ్‌మాష్టర్ కొడుకువి కదోయ్ ఆమాత్రం మర్యాదలు జరగడం సహజమే'' అంటూ బాపిరాజు జోక్‌చేశాడు.

"అదేంలేదండయ్యా! అల్లరిచేస్తే అయ్యగారు వినయ్‌బాబుని కూడా ఎండలో ఒంగోబెట్టేసేవారు'' అన్నాడు వెంకటరమణ.

"వీడిక్కడ ఎండలో ఒంగొంటే సాయంత్రం ఇంట్లో అయ్యగారు అమ్మగారి ముందు గోడకుర్చీ వేసుంటారులే'' అన్నాడు బాపిరాజు.

వెంకటరమణ ఫెళ్లున నవ్వేశాడు.

"రండయ్యా! నేనెళ్ళి అయ్యగారికి చెప్తాను. మీరిక్కడ కూర్చోండి'' అంటూ వెళ్ళబోతూ,

"అయ్యబాబోయ్ గంటకొట్టడం మరచిపోయానండి అప్పుడే మూడు నిమిషాలయ్యిపోయింది'' అంటూ గంట సుత్తి తీసాడు వెంకటరమణ.

బాపిరాజు వెంకటరమణ చేతిలో సుత్తిని అందుకొని, "నాకు గంటకొట్టడం సరదానోయ్, ఎన్నికొట్టాలి'' అన్నాడు బాపిరాజు.

"మూడండి, గట్టిగా కొట్టండి'' అన్నాడు వెంకటరమణ.

"ఠంగ్... ఠంగ్... ఠంగ్''మని గంట కొట్టాడు బాపిరాజు.

"ఒరేయ్ పిచ్చి పీనుగ! ఇక్కడ వేషాలెయ్యకు పిల్లలు చూసారంటే ఆటపట్టిస్తారు'' అంటూ వినయ్ బాపిరాజుని వారించాడు.

"రండయ్యా అయ్యగారు రమ్మంటున్నారు'' అంటూ వెంకటరమణ పిలిచాడు.

వినయ్, బాపిరాజు లోనికెళ్ళారు.

"రండోయ్... రండి... ప్లీజ్ సిట్‌డౌన్'' అన్నారు సూర్యనారాయణగారు.

బాపిరాజు, వినయ్ కూర్చున్నారు.

"కూర్చోమనగానే కూర్చోవడమేనా! నేను స్టాండ్... సిట్ అని మూడు సార్లంటాను ఆ తర్వాత కూర్చోండి'' అని వినయ్‌ని, బాపిరాజుని, మూడుసార్లు కూర్చోబెట్టి, నిలబెట్టి ఆ తర్వాత కూర్చోమన్నారు.

"భలేవుంది బాబాయ్... నాకు మళ్ళీ మీ స్కూల్లో చేరి ఆరో తరగతి చదూకోవాలనుంది'' అన్నాడు బాపిరాజు.

"మా స్కూల్లో క్రమశిక్షణకి జిల్లాస్థాయిలో పేరుందోయ్. నాదగ్గర చదువుకున్న పిల్లగాళ్ళే మళ్ళీ ఇదే స్కూల్లో టీచర్లుగా వచ్చారు. ఇప్పటికీ వాళ్ళకి నేనంటే గోడకుర్చీ వేసినంత హడల్'' నవ్వుతూ చెప్పారు సూర్యనారాయణగారు.

"మీరు సీట్లో కూర్చుంటే చాలా హేపీగా కనిపిస్తున్నారు బాబాయ్'' అన్నాడు బాపిరాజు.

"ఇదేనోయ్ వృత్తిపరమైన సంతృప్తి. ఇక్కడెన్ని సాధకబాధకాలున్నా ఈ తృప్తి వేరు''

"సరేలే కాఫీ తాగండి''

"నాన్నా నేను హైద్రాబాద్ వెళ్ళి ఏదన్నా ఉద్యోగం చూసుకుందామనుకుంటున్నాను. రేపో ఎల్లుండో వెళదామని'' అన్నాడు వినయ్.

"నాకయితే అభ్యంతరంలేదు. కానీ మీ




అమ్మ బాధపడుతుంది కనుక ఒక పది పది హేను రోజుల తర్వాత వెళుదువుగానిలే' అన్నారు సూర్యనారాయణగారు.

అంతలో ఇద్దరు విద్యార్థులను తీసుకుని తెలుగుమాష్టారు బ్రహ్మంగారు లోనికొచ్చారు.

"వీడి కంపోజిషన్ పుస్తకంలో 'ఒక లవ్ లెటర్' దొరికిందండి! వెధవ చాలా గొప్పగా రాశాడు దాన్ని'' అంటూ ఒక లెటర్ని సూర్యనారాయణగారికిచ్చాడు బ్రహ్మంగారు

"సరే, వీడు ఉత్తరం రాశాడు... మరి వాడెందుకు'' బ్రహ్మంగార్ని ప్రశ్నించారు సూర్యనారాయణగారు.

"వీడిక్కూడా ఇందులో భాగముందండీ... వీడు రాయమంటే ఈ పీనుగ రాశాడట!"

"ఉత్తరం బాగానే ఉంది. మరి ఇదెవ రకి రాసాడంటారూ'' అడిగారు సూర్యనారాయణ గారు.

"ఎవరికో ఇద్దామనే రాశారు వెధవలు. ఈలోగా నాకు పట్టుబడిపోయారు. చూశారా ఆ నాలుగో లైన్లో వీడి కవిత్వం"

"నీవంటే నాకు ముద్దు!
మరెందుకు నీకు హద్దు!
ప్రేమే మనకు సరిహద్దు!
ఇక నీ పిలుపే నాకు తొలిపొద్దు!"

"వీడి ధుంపతెగ! శ్రీనాథుణ్ణి మించిపోయాడు వెధవ" అంటూ బ్రహ్మంగారు కోపంతో ఊగిపోతున్నారు.

"ఏమోయ్... చదివేది పదోతరగతి! ఇంకో మూడునెలల్లో పబ్లిక్ పరీక్షలకు కూర్చోబోతున్నారు. ఏమిటీ పిచ్చిపనులు. చదువుకొని బాగుపడాలనుందా! లేక గాడిదల్ని కాసుకోవాలనుకుంటున్నారా చెప్పండి! ఎందుకు రాసారు? ఎవరికి రాశారు? ఎవరికిద్దామనుకుంటున్నారు?" అంటూ కళ్లెరజేసి విద్యార్థులవంక చూసారు సూర్యనారాయణగారు.

అప్పటికే వాళ్ళిద్దరూ వణికిపోతున్నారు. బాపిరాజు, వినయ్ ఆసక్తిగా చూస్తున్నారు.

"ఎవ్వరికీ ఇవ్వాలని రాయలేదండి! శ్రీను గాడితో పందెం కాసానండి లవ్‌లెటర్ రాస్తానని! నేను రాస్తే వీడెవరికైనా ఇస్తానని నాతో పందెం కాసాడండి. అందుకే రాసానండి. మరిచిపోయి కంపోజిషన్‌లో పెట్టేశానండి. మేష్టారుకి దొరికిపోయిందండి'' అంటూ గడగడా చెప్పాడొకపిల్లాడు.

"వీడు రాశాడు సరే! నువ్వెవరికివ్వాలనుకున్నావు! చెప్పు అబద్ధం చెప్పావో నీ డొక్క చించేస్తాను'' గద్దించారు సూర్యనారాయణగారు రెండో విద్యార్థిని.

"ఎవ్వరికీ ఇవ్వాలని కాదండీ! వీడితో రాయించాలనేనండీ! నాకెవ్వరూ ఆడ స్నేహితులు లేరండీ! సరదాకి రాయించానండి!" చెప్పాడు రెండోవిద్యార్థి.

"చదువుకునేచోట కోతిపనులకు తావివ్వడం చాలా పొరపాటు. ఇపుడు మీరు పుస్తకాలు తీసుకుని తిన్నగా ఇంటికెళ్ళిపొండి! రెప్పొద్దుట మీ తండ్రుల్ని వెంటబెట్టుకుని రండి. ఒక్కరూ వస్తే మాత్రం స్కూల్లోకి అడుగుపెట్టనివ్వను పొండి'' అంటూ వాళ్ళిద్దర్నీ పంపించేశారు సూర్యనారాయణగారు.

"థాంక్సండీ బ్రహ్మంగారూ! పిల్లలపట్ల, క్రమశిక్షణపట్ల చాలా జాగ్రత్తగా ప్రవర్తిస్తున్నారు థాంక్స్'' అన్నారు సూర్యనారాయణగారు.

"పంచెకట్టుకున్న తెలుగువాడినండీ! నా దగ్గర కుర్రాళ్లని తోకాడించనివ్వను. ఇక మీరు నన్ను మెచ్చుకున్నందుకు పరమ సంతోషమండీ. ఇకపోతే అలాంటి చచ్చువెధవలు ఆఖరికి ఏ పనీ చేతగాక తెలుగు సినిమా పాటలు రాసుకొని దిగజారిపోతారు రాస్కెల్స్'' అంటూ బయటకెళ్ళిపోయారు బ్రహ్మంగారు.

"పిల్లలు తప్పుచేసే విధానంలో కూడా మార్పులొచ్చేసినయ్ బాపిరాజూ! ఇదివరలో వాడు నన్ను కొట్టాడండి, వీడు నా పుస్తకం చించేశాడండి, వీడు నా డబ్బులు తీసేశాడండీ అంటూ కంప్లైట్స్ తెచ్చేవారు. ఇప్పుడు పరిస్థితి చూశారుగా, ఏం చేస్తాం! కాలంతోపాటే

మేమూను'' అంటూ సూర్యనారాయణగారు లేచారు స్కూల్ చూపించటానికి.

"ఏంచేస్తాంలెండి... ఇక్కడకూడా 'బేసిక్ఇన్‌స్టింక్ట్‌'లాంటి ఇంగ్లీషు సినిమాలాడించే స్థాయికి ఎదిగిపోయారు జనం. ఇక పిల్లలు పుస్తకాల్లోంచి నేర్చుకొనేది చాలా తక్కువ. సినిమాలనుండే అన్నీ నేర్చుకుంటున్నారు'' అన్నాడు బాపిరాజు.

"వినయ్‌ని, బాపిరాజుని తమ స్కూల్ స్టాఫందరికీ పరిచయం చేశారు సూర్యనారాయణగారు. చాలామంది వినయ్‌కి చదువు చెప్పిన వాళ్ళే కావడంతో వినయ్‌ని అందరూ ఆప్యాయంగా పలకరించారు. తర్వాత వినయ్, బాపిరాజు అక్కడనుండి ఇంటికి వచ్చేశారు.

★ ★ ★

వారంరోజులు గడిచిపోయాయి. వినయ్‌తో కళ్యాణమ్మగారు మాటలాడటంలో ముభావంగావున్నా తిండి విషయంలో అనసూయతో చెప్పి కొసరికొసరి వడ్డించే ఏర్పాట్లు చేసుకుంది.

సూర్యనారాయణగారు మామూలుగానే మాట్లాడుతున్నారు. అనసూయ వినయ్‌ని బావ అంటూ సంబోధించినా మునిపటిలా ఉత్సాహం చూపించడంలేదు. సాధ్యమైనంత వరకూ బాపిరాజుతో ఎక్కువగా మాట్లాడటానికి ఇష్టపడుతోంది. ఒకసారి అనసూయని తీసుకెళ్ళడానికి వాళ్ళనాన్నాగారొచ్చారు. ఇంకో వారం పోయాక పంపిస్తానని చెప్పి తమ్ముణ్ణి పంపించేసింది కళ్యాణమ్మ. అంతకుముందు నాలుగు రోజులక్రితం పనిమీద ఏదో ఊరు వెళ్ళివచ్చారు సూర్యనారాయణగారు. సాధారణంగా హైస్కూల్‌పనులమీదే ఎక్కువగా ఊరువెళుతుంటారు. ముఖ్యంగా ఆయన జిల్లాపరిషత్ బోర్డ్ ఏలూరులో వుంది కనుక తరచుగా అక్కడికే వెళ్ళి వస్తుంటారని ఆ ఇంట్లో అందరికీ తెలుసు.

ఒకరోజు ప్రొద్దుటే పడక్కుర్చీలో కూర్చుని తీరుబడిగా పేపరు చదువుకుంటున్నారు సూర్యనారాయణగారు. ఎదురుగా వినయ్, బాపిరాజు టిఫిన్ చేస్తున్నారు. అనసూయ కాఫీ గ్లాసుల్లో పోస్తోంది. కళ్యాణమ్మగారు తులసి కోటకి పూజచేసి లోనికొచ్చేశారు. సూర్యనారాయణగారు పేపరు మడిచి కళ్ళజోడుతీసి జేబులో పెట్టుకుంటూ వినయ్, బాపిరాజు కూర్చున్న టేబుల్‌దగ్గరకొచ్చి ఒక కుర్చీ లాక్కొని కూర్చున్నారు.

"ఈరోజు పేపర్లో ఒక గమ్మత్తయిన ప్రకటన చూశానోయ్. సరిగ్గా మీ మిత్రుడు వినయ్ తీసుకున్నాడే 'నిర్ణయం' దాన్ని గొప్పగా సపోర్ట్ చేస్తుందనుకో! ఛీ... ఛీ... సమాజం తగలడిపోతోంది. ప్రకటన ఇచ్చేవాళ్ళకీ సిగ్గులేదు. దాన్ని స్వీకరించే వాళ్ళకి అసలే సిగ్గుండక పోవచ్చు'' అంటూ విసుక్కుంటూ పేపర్ బాపిరాజు ముందు పెట్టారు సూర్యనారాయణగారు.

"ఏమైంది బాబాయ్. ఏంటా ప్రకటన! ఏదీ'' అన్నాడు బాపిరాజు.

"అదిగో పెన్నుతో మార్క్ చేశాను, ఛీ...ఛీ... మన తెలుగు వాళ్ళే పద్ధతులన్నీ మంటగలిపెయ్యడానికి పూనుకున్నట్టు వెధవ సంస్కరణలు, వెధవ లోపాయకారీ పనులూను'' అంటూ అక్కడినుండి వెళ్ళిపోయారు సూర్యనారాయణగారు.

బాపిరాజు పేపర్ని పరిశీలించి చూశాడు. అది 'పెళ్ళిపందిరి' శీర్షికలో పడ్డ ప్రకటన. సూర్యనారాయణగారు మార్క్ చేసినచోట ఇలా రాసి ఉంది.

"23 సంవత్సరాల భర్తపోయిన వితంతువుకి వరుడు కావలెను. కులప్రసక్తి లేదు. వధువు విద్యాధికురాలు. ఆధునిక భావాలుగల వరుణ్ణి వాంఛిస్తోంది. ఆసక్తిగలవారు ఈ క్రింది పోస్ట్ బాక్స్‌కి రాయండి''

బాపిరాజు చదివాక, ఆ ప్రకటన వినయ్ కూడా చూశాడు.

"ఇందులో తప్పేం ఉందిరా, ఆయనలా





ఎగిరిపడతాడేంటి! వితంతువు వివాహం చేసుకోకూడదా ఏంటి'' అన్నాడు బాపిరాజు.

"అది కాదురా, నేను మొన్న తీసుకున్న నిర్ణయానికి ఈ ప్రకటన సరిపోతుంది కదా! మరి నేనెక్కడ అప్లయ్ చేస్తానో అని ఆయన భయంకాబోలు." అన్నాడు వినయ్.

"కరెక్ట్! నేనూ అదే అనుకొంటున్నాను. లేకపోతే అంత సంస్కారవంతుడు బాబాయ్ గారు అలా చిల్లర కామెంట్స్ చెయ్యరు. నీవు అప్లయ్ చేస్తావేమోనని ఆయనకి చిరాకేసి ఉండొచ్చు'' అన్నాడు బాపిరాజు.

"ఇలాంటి ప్రకటనలు చాలా అరుదుగా వస్తుంటాయిరా! సాధారణంగా వితంతువులకి పెళ్ళిళ్ళు ఏ సమాజంవాళ్ళో, ట్రస్ట్‌వాళ్ళో చేస్తుంటారు. కాస్త బాగా చదువుకున్నవాళ్ళే ఇలా ప్రకటన ఇస్తారు. మనం ప్రయత్నిస్తే చాలా బెటర్'' అన్నాడు బాపిరాజు.

"ఆ... ఫర్‌గెటిట్'' అన్నాడు వినయ్.

"నోర్ముయ్. మరి నిన్ను పెళ్ళాడటానికి వితంతువు ఆకాశాన్నుండి ఊడిపడుతుందనుకుంటున్నావా! నీవు కూడా రేపు పెళ్ళాడాలంటే పేపర్లో ప్రకటన వేయాలి కదా ఆలోచించు'' అన్నాడు బాపిరాజు.

ఆరోజంతా ఆ విషయమై ఇద్దరూ బాగా చర్చించుకున్నారు.

"పనిలోపని వీళ్ళెలాగూ భీష్మించుకుని కూర్చున్నారు కదా ఇక్కడే మనం ఆ పని కూడా కానిచ్చేశామనుకో కాస్త ట్రబుల్ తప్పిపోతుంది. తర్వాత మనమెలాగూ సిటీకి పోతాం కదా'' అన్నాడుబాపిరాజు. సరే ప్రయత్నిద్దామని వినయ్ ఒప్పుకున్నాడు. మర్నాడు తెలిసినవారిద్వారా ప్రయత్నించి ఆ ప్రకటనదార్ల అడ్రస్ సంపాదించారిద్దరూ!

"అదృష్టం బావుండి నీకీ సంబంధం కుదిరితే పక్కా గోదావరిజిల్లా అమ్మాయి కనుక నీతో చాలా ఈజీగా ఇమిడిపోవచ్చు'' అన్నాడు బాపిరాజు.

"అయితే మనం పాలకొల్లు వెళ్ళడం తప్పదంటావ్'' అన్నాడు వినయ్.

"ఇంతా కష్టపడింది అందుకే కదరా! రేపే మన ప్రయాణం. గోదావరి దాటితే పాలకొల్లు. ఇది తూర్పు, అది పశ్చిమం అంతే తేడా'' అన్నాడు బాపిరాజు.

"మరి ఇంట్లో ఏం చెబుదాం" అన్నాడు వినయ్.

"అది నేను మానేజ్ చేసుకుంటాను. నాకో ఫ్రెండ్ పాలకొల్లులో ఉన్నాడని, వాడిని తప్పని సరిగా కలవాలని చెప్పి మనం వెళ్ళొచ్చు! ఆలోచనుండాలేకాని ఐడియాలకేంకొదవ"

ఆరాత్రి తాము ఫ్రెండ్స్ దగ్గరికి పాలకొల్లు వెళుతున్నట్లు సూర్యనారాయణగారికి చెప్పి బట్టలు సూటుకేసులో సర్దుకుని ఒక రాత్రికి అక్కడ ఉండి వచ్చేస్తామని చెప్పి, ప్రొద్దుటే తెల్లవారుఝామున బస్ స్టేషన్‌కొచ్చి పాలకొల్లు బస్ ఎక్కేశారు వినయ్, బాపిరాజు.



బస్సు పాలకొల్లు స్టేషన్లోకొచ్చి ఆగేసరికి టైం ఉదయం పదిగంటలు కావస్తోంది. వినయ్, బాపిరాజు బస్సుదిగి ఒక కిళ్ళీకొట్టుదగ్గర ఆగి ఆ షాపువాడితో, "ఇక్కడ కాస్త శుభ్రంగా ఉండే లాడ్జి ఏదయినా ఉందా?" అని అడిగాడు వినయ్.

"అయ్యబాబోయ్ పాలకొల్లులో లాడ్జీలెందుకుండవండీ. ఊరికి కొత్తలాగున్నారు ఏ ఊరండిమంది'' అన్నాడు కిళ్ళీ షాపువాడు.

"ఇదేనయ్యా మీ ప్రత్యేకత! అడిగిందానికి సమాధానం చెప్పకుండా అవతలివాడి పుట్టు పూర్వోత్తరాలడుగుతారు మీరు'' అన్నాడు బాపిరాజు.

"భలేవారండీ మీరు. సరదాకంటే సీరియ సైపోతున్నారు. లక్ష్మీదుర్గ లాడ్జి బావుంటాదండి. దానెదురుగా కిన్నెర లాడ్జివుందండి. దాన్లో కెళ్ళకండి దాని ఓనరు సుబ్బారావుగాడు దొంగనా...కొ... అండి. ప్రతిదాన్కీ రూపాయి ఎగ్రస్ట్రా వేసేత్తాడండి'' అన్నాడు షాపు వాడు.

అక్కడినుండి వినయ్, బాపిరాజు లాడ్జికెళ్లి రూం తీసుకుని స్నానంచేసి, టిఫిన్లు తిన్నారు. తర్వాత లాడ్జినుండి బయటపడి అడ్రస్‌కోసం వాకబుచేస్తూ పెద్దగోపురం దగ్గరకొచ్చారు. పాలకొల్లు చూడటానికి పెద్ద పట్టణం కాకపోయినా అన్నీ ఒకచోట కలబోసినట్లు బస్టాండ్ నుండి బయటకొస్తే చాలు నాలుగడుగులువేస్తే కాఫీ హొటళ్లు, దాని వెనుకే లాడ్జీలు, బట్టల దుకాణాలు, బార్బర్ షాపులు, వాటన్నిటినీ గొలుసుకట్టుగా ఆనుకొని ఉన్న సినిమాహాళ్లు అన్నీ కంటికెదురుగా కనిపిస్తూనే ఉంటాయి. ఒక్క రైల్వేస్టేషన్ మాత్రం కాస్త పట్టణానికి దూరంగా ఉంది.

గోపురం పక్క సందు తిరగ్గానే వినయ్, బాపిరాజు వెదుకుతున్న ఇంటి నెంబర్ కనిపించింది. ఇంటి ప్లాన్ ఎప్పటిదో పురాతనమైనదైనా ఇటీవల దానికి చేసిన ఆధునిక అలంకరణలతో బయటకి చాలా రిచ్‌గా కనిపిస్తోంది. ఇంటికెదురుగా విశాలమైన కాంపౌండ్‌లో, పూలచెట్లు అందంగా పెంచి ఉన్నాయి. కాలింగ్ బెల్ కనిపించక గేటు తీసాడు బాపిరాజు.

"వద్దురా కుక్క ఉంటే ప్రాబ్లమ్! అనవసరంగా పెళ్ళి చూపులకొచ్చి రేబీస్ ఇంజక్షన్లు చేయించుకోవాల్సివస్తుంది'' అన్నాడు వినయ్.

బాపిరాజు గేట్ మూసి బయటకొచ్చేశాడు.

మేడమీద బట్టలు ఆరబెడ్తున్న పనిపిల్ల వినయ్‌ని, బాపిరాజుని చూసి కిందికొచ్చి గేట్‌తీసి ఎవరు కావాలంది.

వెంకటరత్నంగారికోసం వచ్చామన్నారు వినయ్, బాపిరాజు. ఆమె వెనుకే వీళ్ళులోనికెళ్ళారు. ఆమె హాల్లో కూర్చోమని చెప్పి, వెళ్ళిపోయింది. ఆ వెంటనే ఇంటాయన వచ్చాడు.

"లావుగా ఉన్నా నవ్వుతూ కళగా ఉండే మొహం వెంకటరత్నంగారిది. ఆఫీసర్ హోదా ఆయనలో కనిపిస్తోంది. ఇంకా పరిచయాలు కాకుండానే సెగలు కక్కే కాఫీలు టీపాయ్ ముందుకి రావడంతో బాపిరాజు, వినయ్ కొంచెం ఆశ్చర్యపోయారు.

"నా పేరు వినయ్, ఎమ్మే సోషల్‌వర్క్! ఇతను నా ఫ్రెండ్ బాపిరాజు. ఎమ్మే సోషల్ వర్క్. మాది రాజమండ్రి. మీరు పేపర్లో ఇచ్చిన ప్రకటన చూసి'' అంటూ చెప్పాడు వినయ్.

"ఓ అదా... మా అమ్మాయికోసమే ఆ ప్రకటన ఇచ్చింది. ముందు మీరు కాఫీ తాగండి''

వినయ్, బాపిరాజు కాఫీకప్పులు చేతిలోకి తీసుకున్నారు.

"ఇంతకీ మీలో పెళ్ళికొడుకెవరోయ్ ఇలా చనువుగా మాట్లాడటం నా అలవాటు, మరోవిధంగా అనుకోకండబ్బాయ్'' అన్నాడు వెంకటరత్నం.

"వీడండి పెళ్ళికొడుకు. ఆ కళ మొహంలో కన్పించడంలేదాండి'' అంటూ వినయ్‌ని చూపించాడు బాపిరాజు.

"నేను చూడగానే అనుకొన్నాను ఇతనే అయ్యుంటాడని'' అన్నాడు వెంకటరత్నం.

"థాంక్స్'' అన్నాడు వినయ్.

"ప్రకటన వెలువడ్డాక ఒక అరడజన్ మంది వచ్చారోయ్! వాళ్ళ ఫేసులే నాకు నచ్చలేదు'' అన్నాడు వెంకటరత్నం.

"అయితే మేం ఫేస్ టెస్ట్‌లో ఓ.కే.నన్న మాట" వెంకటరత్నం నవ్వేశాడు.

"ఎడ్యుకేషన్ కూడా ఓ. కే. ఇకపోతే నాకు





సందేహాలు కొన్ని తీర్చాలి మీరు. ఇంతలక్ష ణంగా ఉండి ఒక వితంతువుని పెళ్ళిచేసుకోవాలని మీరెందుకు ప్రయత్నిస్తున్నారు. ఈ పెళ్ళికి మీ పెద్దల అంగీకారం ఉందా! పెళ్ళయ్యాక సంఘంలో ఎదురయ్యే సమస్యలను తట్టుకొనే ధైర్యం మీకుందా!" అన్నాడు వెంకటరత్నం.

"నేనో మంచి ఉద్దేశ్యంతో వితంతువుని పెళ్ళిచేసుకోవాలని నిర్ణయించుకున్నాను. నేనేదో గొప్ప సంఘసంస్కరణ చేస్తున్నట్లు భావించను కానీ, నా ఆత్మ సంతృప్తి మేరకు, సమాజంమీద నాకున్న స్పష్టమైన అవగాహనతోనే నేను ఆ నిర్ణయం తీసుకున్నాను. కేవలం ఆస్తికోసమే అని మీరు భావించే అవకాశానికి తావులేదు. నేను మామూలు అమ్మాయిని పెళ్ళాడతానంటే నేను కోరుకున్న కట్నాలు నాకు పుష్కలంగా లభిస్తాయి. ఇలా అమ్మాయికోసం వెదుకుతూ నేను శ్రమ పడాల్సిన అవసరం కూడా నాకు లేదు. ఇకపోతే ఇలా నేను పెళ్ళిచేసుకోవడం మా తల్లితండ్రులకు ఇష్టంలేదు కనుక ఈ పెళ్ళికి వారినుండి ఎలాంటి ఆటంకాలూ లేకుండా నేను అన్నీ సిద్ధంచేసుకున్నాను. ఇక సంఘంలో విమర్శలంటారా! నేను ఈ నిర్ణయం తీసుకున్నది మొదలు మీ ఎదురుగా కూర్చున్న ఈ టైం వరకూ ప్రతి ఒక్కరి చేతా విమర్శింపబడుతూనే ఉన్నాను. సమాజం సంస్కర్తలనెప్పుడూ అవహేళన చేస్తూనే వుంటుంది కనుక నాకు సొసైటీతో పనిలేదు. నాకోసం నా ఆత్మతృప్తి కోసం... రాజీ పడకుండా బతకాలని నా సిద్ధాంతం" అన్నాడు వినయ్.

"ఫర్వాలేదు, ఇది కూడా సంతృప్తికరం. ఇకపోతే మా అమ్మాయి గురించి కూడా మీకు కొన్ని వివరాలు ముందుగానే చెప్పాలి నేను. నా పెద్దకూతురు వసంత. తర్వాత ఒక కొడుకు. వాడింకా చదువుకుంటున్నాడు. మా వసంత చదువుకొనే టైంలోనే మంచి సంబంధమొచ్చిందని పెళ్ళి చేసేశాం. దురదృష్టం మా అమ్మాయిని వెంటాడింది. పెళ్ళయి ఏడాది తిరక్కుండానే దాని భర్త ఏక్సిడెంట్లో పోయాడు. నా వసంత గుండెలు పగిలేలా ఏడ్చింది. దాని అదృష్టం బావుండి పిల్లా పీచూ లేరు కనుక కాలగమనంలో మళ్ళీ మామూలు మనిషైంది. తర్వాత మధ్యలో ఆపేసిన చదువుకొనసాగించి ఎం.ఏ. పూర్తిచేసింది. లెక్చరర్‌గా పనిచెయ్యాలని ఆమె చిరకాలవాంఛ. పెళ్ళిచేసుకోకుండా అలానే ఉండిపోతానంది. ఇది ఇరవై ఒకటో శతాబ్దపు కంప్యూటర్ యుగం కనుక మేమంతా ఆమెకు నచ్చచెప్పి ప్రకటన వేయించాం. అదయ్యా కథ" అంటూ శాలువాతో కళ్ళు తుడుచుకున్నాడు వెంకటరత్నం.

"సారీ మిమ్మల్ని హర్ట్‌చేసి ట్రబులిచ్చాం" అన్నాడు వినయ్.

"ఫర్వాలేదు బాబు. రోజుకోసారి మా 'వసంత'ని తలుచుకొని కన్నీళ్ళు పెట్టుకోవడం నాకలవాటే! సరే! నేను లోపలకెళ్ళి విషయం మా ఇంట్లో వాళ్ళకి చెప్పి పెళ్ళిచూపుల ఏర్పాట్లు చేస్తాను' అంటూ లేచారు వెంకటరత్నం.

"పెళ్ళిచూపులా" ఆశ్చర్యపోయాడు బాపిరాజు.

"మాకు కొత్తకాకపోయినా మీకు మొదటిసారికదా! పైగా ఆడపిల్లలన్నాక కాస్త ఇదిగా కనిపించాలని భావిస్తారాయె!" అన్నాడు వెంకటరత్నం.

"అలాంటి ఆర్భాటాలేవీ వద్దండి. అమ్మాయిని పరిచయం చెయ్యండి చాలు మా అభిప్రాయాలు నచ్చితేనే మిగతా ఏర్పాట్లు చేసుకుందాం" అన్నాడు వినయ్.

ఆ మాటలు వినిపించుకోకుండానే వెంకటరత్నం లోనికికెళ్ళిపోయాడు.

కొన్ని నిమిషాలయ్యాక లోపలనుండి కోలాహలం మొదలయ్యింది. ఒకావిడ బయటకొచ్చి మేడమీదకు కిందకూ గాబరాగా తిరిగేస్తోంది. బహుశా వెంకటరత్నం భార్యకాబోలు అనుకున్నాడు బాపిరాజు.

"మీ అత్తయ్య చాలా గ్లామరస్‌గా

వుందిరోయ్! ఇక అమ్మాయి మెరుపుతీగే కావచ్చు'' అన్నాడు బాపిరాజు.

"ఛ... నోర్ముయ్. ఎవరన్నావింటే మన పరువుపోతుంది'' అంటూ వారించాడు వినయ్.

వెంకటరత్నంగారు ఫోన్‌చేసి ఎవరెవరికో ఇంటికి రమ్మని చెబుతున్నారు. పనిపిల్ల మరింత హడావిడిగా అటు ఇటూ పరుగెడుతూ హైరానా పడిపోతోంది. ఇంతలో ఒక వ్యాన్ వచ్చి ఇంటిముందు ఆగింది. అది మున్సిపల్ కమీషనర్‌గారి వ్యాన్. డ్రైవర్, మరోమనిషి వచ్చి వెంకటరత్నంగారి ముందు నిలబడ్డారు. వాళ్ళకి ఏవో పనులు పురమాయించి పంపించారు వెంకటరత్నం. ఇద్దరు పేరంటాళ్ళు ఎలా కబురెళ్ళిందో చుట్టుపక్కల ఇళ్ళనుండి లోనికొచ్చేశారు. వెంకటరత్నంగారు తన భార్య హాల్లోకి రావడం చూసి,

"అదిగో ఆ అబ్బాయి పెళ్ళి కొడుకు, పక్కతను తోడిపెళ్ళికొడుకు!" అంటూ వినయ్‌ని, బాపిరాజుని చూపించాడు. ఈమె నా భార్య 'మంగతాయారు' అంటూ ఆవిడను వాళ్ళకి పరిచయం చేశాడు.

"నమస్కారం" అంటూ మంగతాయారు







ఒక స్తంభం పక్కకు వెళ్ళి చాటుగా నిలబడింది.

"అనుకోకుండా పెళ్ళిచూపులన్నారు. మరేం అనుకోవద్దునాయనా! కాస్త ఆలస్యమైనా బాధపడకండీ'' అంటూ లోనికెళ్ళిపోయింది.

"అదేమిటండీ ఆంటీగారు స్తంభం పక్కన నిలబడి మాట్లాడుతున్నారు'' అడిగాడు బాపిరాజు.

వెంకటరత్నంగారు నవ్వేస్తూ అన్నారు,

"ఆవిడంతే! ఎవరితోనైనా మర్యాదగా మాట్లాడాల్సివస్తే అలా తలుపు చాటున, స్తంభాల చాటునా దాక్కుని మాట్లాడుతుంది. కోపం వచ్చి పోట్లాడవలసివస్తే మాత్రం ఎదురుగా చీఫ్ మినిస్టరున్నా సరే ఫేస్ టూ ఫేస్ మాట్లాడేస్తుంది''

వినయ్, బాపిరాజు నవ్వేశారు.

అంతలో కమీషనర్‌గారి వ్యాన్ వచ్చి బయట ఆగింది. అందులోనుండి రెండు బాగా ముగ్గిన అరటిగెలలు, పూలబుట్ట, ఇంకా కొబ్బరికాయలు, స్వీటు బాక్సులు దింపి లోనికి పట్టుకొచ్చారు ఇద్దరు వ్యక్తులు.

"పరిస్థితి చూస్తుంటే వీళ్ళు చాలా అట్టహాసం చేస్తున్నారు. ఒక వేళ బెడిసికొడితే బాధపడతారేమో'' అన్నాడు వినయ్.

"చాలా మర్యాదస్తుల్లా వున్నారు మనం కూడా వారి మర్యాదలకు విలువిచ్చి గౌరవిద్దాం 'అశుభం' పలకకు మిత్రమా'' అంటూ వినయ్ భుజం తట్టాడు బాపిరాజు.

చిన్నా, పెద్దా కలసి ఆరుగురు ఆడవాళ్ళు ఇంట్లోకొస్తూ హాల్లో కూర్చున్న వినయ్‌ని, బాపిరాజుని ఆసక్తిగా గమనిస్తూ, ముసిముసిగా నవ్వుతూ లోనికెళుతున్నారు. అంతలో మంగతాయారుగారు రెండు ప్లేట్లలో వేడిగా జీడిపప్పు ఉప్మా తెచ్చి టీపాయ్‌మీదపెట్టి ఆ పక్కనే ఉన్న స్థంబంచాటుకెళ్ళి నిలబడింది. పనిపిల్ల గ్లాసుల్లో నీళ్ళుపోసి వెళ్ళిపోయింది. స్తంబం చాటునుండి "మా హడావిడిలో మీ మర్యాద సంగతే మరిచిపోయాం మరేం అనుకోకండి బాబూ! వారంరోజులనుండి చేసుకున్నా తరగని పెళ్ళి చూపుల పనులు గంటలో చెయ్యాలంటే మాటలాబాబూ! కొంచెం ఆలస్యమైనా మరేం అనుకోకండీ'' అంటూ లోనికెళ్ళిపోయింది.

"థాంక్స్ చెబుదామన్నా ఛాన్స్ ఇవ్వడంలేదురా'' అన్నాడు బాపిరాజు, ఉప్మాలో జీడిపప్పులు ఏరుకుతింటూ.

పనిపిల్ల రెండు అందమైన కప్పుల్లో హార్లిక్స్ తెచ్చి టీపాయ్‌మీద పెట్టింది. కొన్ని వార పత్రికలు, ఆరోజు దినపత్రికలు కూడా తెచ్చి టీపాయ్‌మీద ఉంచింది.

# ఏరిన ముత్యాలు

☆ "ఒక్కొక్కప్పుడు చమత్కారాలకన్నా హాస్యోక్తులకన్నా కూడా అర్థంపర్థంలేని ఒక కథో లేక ఒక అభిప్రాయమో ఎక్కువగా అందరినీ నవ్వించవచ్చు"

**-హారేస్‌వాల్‌పోల్**

☆ "డబ్బు అనేది అడుగు కనబడని సముద్రం లాంటిది. అందులో పడి ఎంతటి గౌరవ ప్రతిష్టలూ, ఎలాంటి నీచాలు మునిగిపోతాయి"

**-కోల్జ్**

☆ "తక్కువవాడు మోసం చేస్తే అతి దారుణమైన నేరం. అదే ప్రభుత్వాలూ, ప్రముఖులూ చేస్తే అది రాజకీయతంత్రం"

**-దేవులపల్లి కృష్ణశాస్త్రి**

☆ "మంచి చెడులపై తీర్పు చెప్పగల స్వేచ్ఛ మనకు ఉన్నప్పుడు కొన్ని లోపాలను సహించడంలో తప్పులేదు"

**-జావర్సన్**

☆ "విశ్రాంతి కోసమే మానవులు నిరంతరం తమకై తాము పాకులాడుతూ అవి దొరక్క అలసిపోతూ వుంటారు"

**-లారెన్స్‌స్టెంన్**

☆ "అలవాటును ఆపుకోవడం మహాకష్టం. మొదట్లో ప్రారంభమైన ఆ అలవాటు రానురాను ఒక అవసరంగా తయారవుతుంది"

**-సెయింట్ ఆగస్టీన్**

☆ "దుర్జనులెప్పుడూ తమ లోపాలను సమర్థించుకుంటారు కాని సజ్జనులు మాత్రం వాటిని విసర్జిస్తారు"

**-బోనీ**

☆ "జీవితమనేది ఒక ఫిడేలులాంటిది. దానితో బహిరంగంగా ఒక పాట కచేరిచేస్తాడు మానవుడు"

**-శామ్యూల్‌బట్లర్**

☆ "ప్రేమ అనేది ఫలించినప్పుడు తామర తూడులా సూక్ష్మంగా ఉంటుంది. కానీ అది విఫలమైనప్పుడు కత్తి అంచుకన్నా పదునుగా వుంటుంది"

**-రసాకాన్**

☆ "మృత్యువులో కూడా ఒక సుగుణం వుంది. అది వ్యక్తికి కీర్తి తెస్తుంది. ఈర్ష్యను పారద్రోలుతుంది"

**-ఫ్రాన్సిస్ బేకన్**

☆ "స్నేహం ఎప్పుడూ మనకు ఉపయోగపడుతుంది. ప్రేమ మాత్రం అప్పుడప్పుడు గాయపరుస్తుంది"

**-సెనెకా**

సేకరణ: కె.వెంకట రామ అక్కయ్య

"ఆ... చూడమ్మాయ్... ఇంకా ఎంత టైం పడుతుందంటావ్' అన్నాడు బాపిరాజు.

"ఏమోనండి ఇప్పటికి మా వసంత గారికి స్నానాలయ్యినయ్యండి! నెక్లెస్ గొల్సు కంసాలి దగ్గర ఉండిపోయిందంటండి. కబురెళ్ళింది. అదొచ్చేసిందంటే చాలు పనులన్నీ తెమిలిపోతాయిలెండి'' అంది పనిపిల్ల.

"ఈ వీక్లీలు... ఆం... ఈ పుస్తకాలన్నీ మీ వసంత గారే చదువుతారా?" అడిగాడు వినయ్.

"ఆయ్... ఇంకస్తమానం పుస్తకాలతోటే కాలక్షేపమండి! తిండి తినేటప్పుడు కూడా చదివేస్తాదండి'' నవ్వుతూ చెప్పింది పనిపిల్ల.

వెంకటరత్నం తెల్లషర్టు, తెల్లప్యాంటుతో బయటకొచ్చాడు.

"ఏమయ్యా బోర్‌కొడుతోందా ఏంటి? లేడీస్‌కదా వాళ్ళకేవో ఆర్భాటాలూ, సెంటిమెంట్లూ వగైరా సహజమేకదా! ఫోన్లో శాస్త్రిగారితో మాట్లాడి ముహూర్తం అడిగాను. పన్నెండు నలభైఐదు నిమిషాలకు మంచిదట. అప్పటికి వీళ్ళ అలంకరణ కూడా పూర్తవుతుంది. అన్నట్లు మీ అవసరాలకు ఏం కావాలన్నా మొహమాటం లేకుండా అడగండి. అవిగో బాత్‌రూమ్స్... వెళ్ళి మొహం అదీ కడుక్కొని రిలాక్స్ కావచ్చు'' అన్నాడు వెంకటరత్నం.

"హమ్మయ్య! ఇందాకటినుంచీ అడగాలనుకుంటున్నానండి బాత్‌రూమ్స్ గురించి'' అంటూ బాపిరాజు అటుగా పరుగు తీశాడు.

వెంకటరత్నం నవ్వుతూ ఒకసారి గేటువరకూ వెళ్ళి ఎవరినో ఆహ్వానించి లోనికి తీసుకొచ్చాడు. బాపిరాజు వచ్చి మళ్ళీ కుర్చీలో కూలబడ్డాడు రిలాక్స్‌డ్‌గా. ఇరవై నిమిషాల తర్వాత పెళ్ళిచూపులు రెడీ అని వెంకటరత్నం వినయ్‌ని, బాపిరాజుని ముందు గది దాటించి లోనికి తీసుకెళ్ళాడు.

అందంగా అమర్చిన సోఫాలు. అక్షింతలు, పళ్ళెంలో తమలపాకులు, వక్కలు, అరటిపళ్ళు అమర్చిన ఖరీదయిన తివాచీమీద రెండు కుర్చీల్లో వినయ్‌ని, బాపిరాజుని కూర్చోబెట్టారు. ఎదురుగా సోఫాలవెనుక పేరంటాళ్ళు కొంతమంది కూర్చుని ఉన్నారు. అమ్మాయిలు నిలబడి ఉన్నారు. మంగతాయారమ్మ ఖరీదయిన చీరలలో నిండుగా ఉన్నారు.

"ఏవండోయ్ ఒకసారిటొస్తారా?" మంగతాయారు వెంకటరత్నంని పిలిచింది కర్టెన్ పక్కన నిలబడి.

వెంకటరత్నం వెళ్ళాడు.

అతని చెవిలో ఆవిడ ఏదో గుసగుసలాడింది.

మంగతాయారమ్మ పక్కనే మరో ఇద్దరు పెద్దవాళ్ళు ఉన్నారు. ఒకావిడ మంగతాయారుని పోలివుంది వాళ్ళక్క కాబోలు.

వెంకటరత్నంగారు నవ్వుతూ వినయ్ ముందుకొచ్చి "మరేంలేదు, లేడీస్‌కదా: వాళ్ళకేవో సెంటిమెంట్స్ ఉంటాయి. అలానే కొన్ని సందేహాలు. మరోవిధంగా అనుకోకండి. పెళ్ళయితే మనం చేసేదేంలేదు. ఇప్పుడే అడుగుతే బావుంటుంది అని వాళ్ళ ఉద్దేశ్యం. మీకు ఏవైనా దీర్ఘకాలిక వ్యాధులుగాని, మచ్చలుగాని ఉన్నాయేమోనని కనుక్కోమన్నారు'' చెప్పాడు వెంకటరత్నం.

వినయ్ నవ్వేసి "కావాలంటే మీ ఫామిలీ డాక్టర్ని పిలిచి చెక్ చేసుకోండి మాకభ్యంతరం లేదు'' అన్నాడు వినయ్. ఆ మాట అందరికీ వినిపించేలానే అన్నాడు.

"ఏవండోయ్ ఒకసారిటొస్తారా?" వెంకటరత్నంని పిలిచింది తాయారమ్మ.

మళ్ళీ ఏవో గుసగుసలు. వెంకటరత్నం మళ్ళీ వినయ్‌దగ్గరకొచ్చి అన్నాడు - "ఏంలేదు! లేడీస్‌కదా వాళ్ళకేవో సెంటిమెంట్స్ ఉంటాయి. గతంలో మీరు ఏవైనా సంఘువ్యతిరేక కార్యకలాపాల్లో పాల్గొనడంగాని, పోలీస్ కేసుల్లో ఇరుక్కోవడంలాంటి గొడవలేమన్నా ఉన్నాయేమో కనుక్కోమన్నారు''

"నో... అలాంటివేమీ లేవండి. కావాలంటే

మీ ఊళ్ళో పోలీస్ అధికారిచేత మా ఊరి పోలీసులకు ఫోన్ చేయించొచ్చు'' అన్నాడు వినయ్.

"ఒకేఒక్కసారి చిన్న తప్పు చేశామండి. బస్ టికెట్ తీయకుండా ఆర్.టి.సి. వాళ్లకి దొరికిపోయి పదేసి రూపాయలు ఫైన్ కట్టాం" అన్నాడు బాపిరాజు.

ఆ మాట విని అక్కడున్న అమ్మాయిలు కొంతమంది నవ్వేశారు.

"ఏవండోయ్ ఒకసారిటొస్తారా?" వెంకటరత్నంని మళ్ళీ పిలిచింది మంగతాయారు.

మళ్ళీ ఏవో గుసగుసలు.

వెంకటరత్నం వినయ్ దగ్గరకొచ్చి "మరేంలేదు, లేడీస్‌కదా సెంటిమెంట్స్ ప్రాబ్లమ్! మీకు తాగుడుగాని, సిగరెట్ తాగడంగాని, గంజాయి, హెరాయిన్‌లాంటివి వాడే అలవాటుగాని ఉందేమోనని వాళ్ళ అపోహ! మిమ్మల్ని కనుక్కోమన్నారు'' వెంకటరత్నం చేతులు నలుపుకుంటున్నాడు. 'ఎంత మున్సిపల్ కమీషనరయినా భార్యదగ్గర మామూలేనన్నమాట' అని మనసులో అనుకున్నాడు బాపిరాజు. వెంకటరత్నం అలా అడగడం బాపిరాజుకి నచ్చలేదు. కాస్త కోపంగా,

"ఏంటండీ! మేం మీకు ఎలా కనిపిస్తున్నాం. మా మొహాలు చూస్తే కనపడటంలా. మేం తాగుబోతుల్లా, జులాయిల్లా కన్పిస్తున్నామా ఏంటి'' అన్నాడు బాపిరాజు.

"అయామ్ వెరీ సారీ! లేడీస్‌కదా ఏవో సెంటిమెంట్స్ హంట్ చేస్తుంటాయి వాళ్ళని. మరోవిధంగా భావించకండి. ఇక ప్రశ్నలు వెయ్యం. వాళ్ళు అడగవలసింది అడిగేశారు'' అంటూ ఒక కుర్చీలో కూలబడిపోయారు.

"రోజులు ఎలా ఉన్నాయి బాబూ! చూస్తున్నాంకదా! అంతా దగా, మోసం, కుట్రలతో నిండిపోయాయి. అందుకే మా భయంకొద్దీ అలా అడిగాం. మరోవిధంగా భావించకండి''





అంది మంగతాయారు. తర్వాత నలుగురు ఆడవాళ్ళు లోనికెళ్ళి వసంతని తీసుకొచ్చి తివాచీమీద కూర్చోబెట్టారు.

క్రీమ్‌కలర్ పట్టుచీరలో, తెల్లగా మెరిసిపోతోంది వసంత. మెళ్ళో తళుక్కుమనే హారం. తలంటుపోసుకున్న కురులు అక్కడక్కడా జారి నుదిటిమీద పడటం ఆహ్లాదంగా ఉంది. పొడవుకి తగ్గ లావు ఆ వయసుకి చాలా హుందానిస్తోంది. పట్టాలతో సగభాగం కనిపించే ఆమె పాదాలు పసుపురాయడంతో బంగారు రంగులో ప్రతిఫలిస్తున్నాయి. తలొంచుకుని అచ్చతెలుగు ముద్దుగుమ్మలా, ముద్దబంతిలా కూర్చుని ఉంది వసంత.

ఆమె తల కొంచెం ఇటు తిప్పింది.

వినయ్ ఆమెను గమనిస్తూ ఆమె కళ్ళలోకి చూశాడు. వినయ్‌కి ఒక్కసారి ఒళ్ళు తుళ్ళిపడింది. మళ్ళీ చూశాడు. అవును... ఎక్కడో చూసినట్లుందే. ఆలోచనలు పరుగులెడుతున్నాయి. ఆమె అలంకరణలను దాటి ఆమె వదనాన్ని పరికించి చూశాడు. కరెక్ట్ ఈమె ఖచ్చితంగా ఆ అమ్మాయే! అదే! వైజాగ్‌లో తన కళ్ళని కట్టిపడేసే మెరుపుతీగ, కాంపస్‌లో దూదిపింజలా ఎగిరిపోయే వనదేవత! కరెక్ట్ ఈమే ఆమె! బాపిరాజు థింకింగ్ కూడా అలానే ఉంది. వినయ్ చెవిలో చెప్పాడు బాపిరాజు. "ఈమె మన యూనివర్సిటీలో చదివిన మన పక్క డిపార్ట్‌మెంట్ అమ్మాయిలా లేదూ!" అన్నాడు.

"కరెక్ట్' అన్నాడు వినయ్.

"ఎక్స్‌క్యూజ్‌మి'' అన్నాడు వినయ్ వెంకటరత్నంని.

"అడుగు బాబూ!" అన్నాడు వెంకటరత్నం.

"ఈమె వైజాగ్ యూనివర్శిటీలోగాని చదివిందా!" అడిగాడు వినయ్.

"అవును నెలక్రితమే ఎమ్మే ఎకనమిక్స్ పూర్తిచేసింది. ఇంటికొచ్చి ఇప్పటికి నెలకూడా కాలేదు'' అన్నాడు వెంకటరత్నం.

ఆ మాటలు వింటున్న వసంత తలెత్తి

వినయ్‌వంక చూసింది.

వినయ్‌కి ఫొటో ఫ్లాష్ కళ్ళమీద పడ్డట్ల యింది.

వసంత కళ్ళతోనే వినయ్‌ని గుర్తుపట్టింది. బాపిరాజుని కూడా. అయితే వైజాగ్‌లో చూడటమే కానీ ఎప్పుడూ మాట్లాడలేదు కనుక వెంటనే తలదించేసుకుంది.

"ఇప్పటి పెళ్ళిచూపుల్లో ప్రత్యేక ఆకర్షణ ఏమిటంటే అమ్మాయి... అబ్బాయి ఏకాంతంగా మాట్లాడుకోవడం" అంటూ వెంకటరత్నంగారు చెప్పడంతో వసంతని వేరే రూంలోకి తీసుకుపోయి కూర్చోబెట్టి అక్కడికి వినయ్‌ని పిలుచుకుపోయారు.

బాపిరాజు వినయ్‌తో విష్‌యూ బెస్టాఫ్ లక్. నీ కలల రాణీతో నీకు... ఎంతయినా అదృష్టంలే' గుసగుసగా అంటూ విష్‌చేసి పంపించాడు.

★ ★ ★

"నా పేరు వినయ్. ఎం.ఏ. సోషల్‌వర్క్ చేశాను'' అన్నాడు వినయ్.

"థాంక్యూ నాపేరు వసంత" అంటూ నవ్వింది వసంత.

"అయాం వెరీ సారీ! మీ వెనుక ఇంత ఆవేదన ఉందనుకోలేదు. అసలు మిమ్మల్ని చూస్తే ఒక భర్తపోయిన వితంతువనుకొనే ఆస్కారమే లేదు. వైజాగ్‌లో మిమ్మల్ని చూసి మేం అలానే భావించాం" అన్నాడు వినయ్!

వసంత మౌనంగా తల దించుకుంది.

"క్షమించండి... గతాన్ని గుర్తుచేసినందుకు! మీరు మన కాలేజి వార్షికోత్సవంలో ఉన్నారుకూడా. నా ఆశయాల సంగతి మీకు చెప్పక్కర్లేదనుకుంటాను. అలా నా ఆశయాలమేరకు భార్యను వెదుక్కొనే వేటలో ఇలా యాదృచ్ఛికంగా మిమ్మల్ని కలుసుకోవడం నిజంగా వండర్! ఇక మీ అభిప్రాయం చెప్పండి'' అన్నాడు వినయ్.

"మీరు చాలా గౌరవనీయులు, ఆదర్శభావాలు కలవారు! ప్రవర్తన విషయంలో మీరు చాలా మంచివారు. వైజాగ్‌లో మిమ్మల్ని నేను చాలా దూరంనుండే గమనించేదాన్ని. మీ జెంటిల్‌నెస్ అప్పట్లో నన్ను చాలాసార్లు ఆలోచింపచేసింది. కానీ అప్పట్లో నా ధ్యేయం చదువు పూర్తిచేయడం కనుక మరేమీ పట్టించుకోలేదు. ఇప్పుడిలా నా ఎదురుగా మిమ్మల్ని చూడటం నాకూ వండర్‌గానే ఉంది'' అంది వసంత.

"మరి నాతో పెళ్ళికి ఒప్పుకుంటున్నారా'' అడిగాడు వినయ్.

"ఒప్పుకోవడమేకాదు... మీలాంటి మానవతా విలువలున్న మహామనిషితో పెళ్ళిచూపులు జరిగాక మీరు కాదంటే నేను బతకలేను కూడా'' అంది వసంత.

వసంత అలా డైరెక్ట్‌గా మాట్లాడేయడం వినయ్‌కి కొంత ఆశ్చర్యమేసింది. ఎమ్మే చదువుకుందికదూ ఆమాత్రం ధైర్యం ఉండొచ్చుకదా అనుకొన్నాడు.

"మీరు మనసు విప్పి ధైర్యంగా మాట్లాడుతున్నందుకు థాంక్స్! ఇంకా నన్ను ఏమైనా అడగాలనుకొంటే అడగండి'' అన్నాడు వినయ్.

"ఏమీ అడగను మీ గురించి నాకంతా తెలుసు'' అంది వసంత.

వినయ్ గదిలోంచి బయటకొచ్చేస్తూ కొన్ని సెకన్‌లు ఆమె కళ్ళల్లోకి చూశాడు ఆరాధనగా. ఆమె కళ్ళు ఒంటరితనం భరించలేనట్లుగా బెదురుతున్నాయి. అప్రయత్నంగా ఒకరి భావాలు ఒకరికి అర్థంకాకుండా కమ్యూనికేషన్ గ్యాప్‌లాంటి ఇబ్బందికి గురయ్యారు సంస్కారం అడ్డుపడి వసంతని కళ్ళతోనే టీజ్‌చేస్తూ బయటకొచ్చేశాడు వినయ్.

★ ★ ★

"చాలా సంతోషమయ్యా అమ్మాయికి నచ్చావట" అంటూ వెంకటరత్నం వినయ్‌తో షేక్‌హాండ్ తీసుకున్నాడు.

అందరి మొహాల్లోనూ ఆనందం చోటుచేసు

కుంది. పేరంటాళ్ళు ఫలహారాలు, టిఫిన్లు, కాఫీలు తీసుకుంటూ కోలాహలంగా ఉన్నారు.

"కంగ్రాచ్యులేషన్స్ వినయ్'' బాపిరాజు విష్ చేశాడు.

"బాబూ, మీరు ఈ పూటకి ఇక్కడే భోంచెయ్యాలి! పైగా భోజనాల టైం కూడా అయ్యింది. మేము ముందుగానే వంటలవీ చేసేశాం" అంది మంగతాయారు ఒక స్తంభంచాటుగా నిలబడి.

"వద్దండీ! ఇప్పుడేగా పెళ్ళిచూపులయినవి. వెంటనే మనుగుడుపు తినేస్తే బావోదండి. చక్కగా టిఫిన్లు పెట్టారు చాలు! అయినా వియ్యాలందేచోట, అతికిన వెంటనే కతక కూడదంటారు'' అన్నాడు బాపిరాజు.

"మాకు అలాంటివేం లేవు. పైగా మీరెక్కడినుండో వచ్చారు. కనుక తినాల్సిందే'' అంది మంగతాయారు.

"సారీ! మేం లాడ్జికి వెళ్ళి భోజనం చేస్తాం. ప్లీజ్ మరోవిధంగా భావించకండి'' అన్నాడు వినయ్.

"లేడీస్‌కదా వాళ్ళకేవో సెంటిమెంట్స్ ఉంటాయి. సర్లెండి... మీకంత ఇబ్బందయితే కారియర్లో పెట్టి మీరున్న లాడ్జికే పంపిస్తాను, హోటల్ తిండి ఏం తింటారయ్యా ఈ శుభ సందర్భంలో' అంటూ వెంకటరత్నంగారు కారియర్లో పెట్టి రెడీ చేయమని మంగతాయారుకి చెప్పాడు.

"సరే... మీ ఆనందాన్ని ఎందుకు కాదనాలి అలాగే చేయండి'' అని చెప్పి వినయ్ ఇంట్లోవారందరికీ కృతజ్ఞతలు చెప్పి బయటికి నడిచాడు.

"మిగతా విషయాలు... అదే లాంఛనాలు, పెళ్ళి ఎప్పుడులాంటివి నేను వీరితో లాడ్జిలో మాట్లాడి వస్తాను. ముందు కారియర్ ఏర్పాటు చేయండి'' అని వెంకటరత్నం భార్యతో చెప్పాడు. బాపిరాజు, వినయ్ లాడ్జికొచ్చేశారు.

★ ★ ★

వినయ్, బాపిరాజు స్నానంచేసి లుంగీలు కట్టుకుని రిలాక్స్‌డ్‌గా బెడ్‌మీద వాలారు.

"నీ లక్ నిన్ను వెంటాడుతోందిరా... ఎప్పుడో సరదాకి... ముద్దబంతి పువ్వులా... చందమామలా భావించి ఆనందించే నీ ఐడియల్ ఫిగర్ ఈవిధంగా నీకు భార్యకావడం గొప్ప సంగతి. నీలాంటివాళ్ళకే ఇలాంటివి నిజజీవితంలో ఎదురవుతాయిరా! పైగా ఆ అమ్మాయి ఒక వీతంతువంటే నేనిప్పటికీ నమ్మలేకపోతున్నాను. పాపం ఆమె అందమైన జీవితం వెనుకాల అంత విషాదముందంటే మరీ ఆశ్చర్యంగా ఉంది! ఇంకో ప్లస్ పాయింటేమిటంటే చక్కటి ఫామిలీ వాళ్ళది. అందరూ ఎలా ఉన్నారో చూశావుకదా'' అన్నాడు బాపిరాజు.

"అఫ్‌కోర్స్... ఇలాంటివన్నీ నాకు యాక్సిడెంటల్. నీలాంటివాళ్ళకి అదృష్టం! నాకు లక్‌మీద నమ్మకంలేదు. అదృష్టాన్ని మనం తయారుచేసుకొంటే అది తప్పకుండా మనల్ని వరిస్తుందనేది నా సిద్ధాంతం" అన్నాడు వినయ్.

అంతలో రూంలోకి వెంకటరత్నంగారు, వెనుక మరో మనిషి పెద్ద కారియర్ పట్టుకొని లోనికొచ్చారు.

"మాకోసం చాలా శ్రమ తీసుకుంటున్నారు... సారీ. '' అన్నాడు వినయ్.

"భలేవారే ఇందులో సారీ చెప్పాల్సిన పనేముందయ్యా. కాబోయే అల్లుడికి ఈమాత్రం కూడా చేయకపోతే ఎలానోయ్. ఇలాంటి విషయాల్లో లేడీస్‌లాగ నాకూ అదోలాంటి సెంటిమెంట్" అన్నాడు వెంకటరత్నం నవ్వుతూ.

వచ్చిన వ్యక్తి రెండు ప్లేట్లలో అయిటమ్స్ అన్నీ సర్ది రెడీచేశాడు.

"ఇద్దరికి ఇంత పెద్ద కారియరా! కనీసం మాలాంటివాళ్ళు ఒక అరడజన్‌మంది తినొచ్చండి ఈ ఫుడ్‌ని'' అన్నాడు బాపిరాజు.

"లేడీస్‌కదా! వాళ్ళకేవో సెంటిమెంట్స్ హంట్ చేస్తుంటాయిమరి! నేనెప్పుడైనా ఆఫీసుకి కారియర్ తెప్పించుకున్నానంటేచాలు మా




అటెండర్లలో సగంమంది ఇంటికి భోజనానికె ళ్ళరు. నా వైఫ్ సెంటిమెంటే వేరు'' అన్నాడు వెంకటరత్నం.

వినయ్, బాపిరాజు భోజనం తినడంలో నిమగ్నమైపోయారు.

"సాంబారు, పప్పు, ఆవకాయ, గుడ్లు, పనసపొట్టు కూర, కొబ్బరికాయ పచ్చడి, పెరుగు... ఇన్ని వంటలు ఇంత తక్కువ వ్యవధిలోనా...! వాటే వండర్'' అన్నాడు బాపిరాజు.

"ఏముంది లేడీస్ కదా! వంటలు చేయడంలో సెంటిమెంట్ ఫీలవుతారుమరి'' అన్నాడు వెంకటరత్నం.

"సెంటిమెంట్ అనేది ఒక్క లేడీస్‌కే అన్నట్లు మాట్లాడతారేంటి సార్?" అన్నాడు బాపిరాజు నవ్వుతూ!

'సరేగానీ... పెళ్ళిచూపులయితే ఓకే అనుకున్నా... మీరు లాంఛనాలు వగైరాల గురించి అడగనేలేదు... అలాంటివేమైనా...!" అన్నాడు వెంకటరత్నం.

"లేదండీ! నాకలాంటి ఉద్దేశం లేదు! అసలే ఆదర్శవివాహం! పైగా అలాంటివి ఆశిస్తే నా నిజాయితీకి విలువేముంటుందండీ!" అన్నాడు వినయ్.

"అయామ్ సారీ... మరోవిధంగా అనుకోకండి అలా అన్నందుకు! మా వసంత ఎలానూ నాకు ఒక్కతే కూతురు. అది తెచ్చుకోవాల్సినవి ఆమె ఎలానూ తెచ్చుకుంటుందనుకోండి! ఇక పెళ్ళి ఎప్పుడు పెట్టుకుందామో చెప్పేస్తే మేం తయారుగా ఉంటాం. ఎల్లుండే పెట్టుకున్నా సరే మేం రెడీ!" అన్నాడు వెంకటరత్నం.

"సర్లెండి... మీరు కమిషనర్ కనుక గంటలో పెళ్ళి ఏర్పాట్లు చేయగలరు. మేం నిరుద్యోగులం. మేమొక ఐడియాకి రావాలిక దా!" అన్నాడు బాపిరాజు.

"మీకు అభ్యంతరం లేకపోతే అవన్నీ నేనే జరిపిస్తాను. మీకు వీలున్నచోట ఫంక్షన్ ఏర్పాటు చేసుకోండి. పెళ్ళి ఏదైనా గుళ్ళో జరిపించి విందుమాత్రం అందరినీ పిలిచి ఘనంగా ఇద్దాం" అన్నాడు వెంకటరత్నం. అలా అనడమే కాకుండా తన వాగ్ధాటితో వినయ్‌ని ఒప్పించాడు.

పెళ్ళి రాజమండ్రిలో ఏదో ఒక గుడిలో జరిగేటట్లు, అవకాశం ఉంటే వినయ్ తల్లి దండ్రులు పెళ్ళికి రావచ్చుననే ఉద్దేశంతో అక్కడ పెళ్ళి చేసి, ఆ మర్నాడు రాత్రికి ఇక్కడ పాలకొల్లులో ఘనంగా విందు ఏర్పాట్లు జరిగేటట్లు వినయ్‌ని, బాపిరాజుని ఒప్పించాడు.

పెళ్ళి జరిగిన వెంటనే హైద్రాబాద్‌లో కాపురం పెట్టి, తర్వాత ఉద్యోగ ప్రయత్నాలు జరిగేట్లు కూడా మాట్లాడాడు.

తనకి హైద్రాబాద్‌లో ఒక ఇల్లు ఉందనీ, అది అద్దెలకోసం కట్టేనని దాన్ని తమ్ముడు చూస్తూ, అద్దెలు తెచ్చి ఇస్తుంటాడనీ, అమ్మాయికి పర్మనెంట్‌గా ఆ ఇల్లు ఇచ్చేస్తాననీ వెంకటరత్నంగారు చెప్పారు.

"వద్దండీ... నేను నా స్వశక్తితో నిలబడాలని నా ఉద్దేశ్యం. నా సామర్థ్యానికి తగ్గ అద్దె ఇంట్లో ఉంటూ భార్యని పోషించాలని కూడా భావిస్తున్నాను. మాకు ఉద్యోగాలు దొరికేవరకూ మాత్రం మీరు హెల్ప్ చేస్తే చాలు. తర్వాత మీ సహాయాన్ని వడ్డీతోసహా తీర్చుకుంటాను'' అన్నాడు వినయ్.

"సరే! అంతవరకూ ఆ ఇంట్లోనే ఉండండి. ఆ కట్టే అద్దేదో మాకే కట్టేస్తే బావుంటుందిక దోయ్ సహాయం, వడ్డీ అని ఇంకేదో అన్నావు. అలాంటివి మనమధ్య ఉండకూడదోయ్. మా వసంతని జీవితంలో బాధ అనేదే లేకుండా పెంచాలనుకున్నాను. అలానే పెంచాను. దాని విధిరాత ఆమె బొట్టును చెరిపేసింది. అదొక్కటే ఆమె జీవితంలో బాధగా మిగిలిపోయింది. ఇంత వుండి మేమేం చేసుకోవాలి! మీరు కష్టాల్లో ఉంటే మేమెలా చూడగలం. అందుకే మీకు లోటు లేకుండా కొంతవరకూ నన్ను ప్రయత్నం చేయనీయండి. తర్వాత మీ కాళ్ళమీద మీరు నిలబడ్డాక

మీకెలా తోస్తే అలా చేయండి. ఇది నా రిక్వెస్ట్... కాదనకూడదు''

వినయ్‌కి ఒప్పుకోక తప్పలేదు. ఏదయినా సరే తన వ్యక్తిత్వానికి మాత్రం భిన్నంగా ఉండకూడదని తన ఆశయాల సాధనకు అవి ఆటంకం కాకూడదని వినయ్ కొన్ని షరతులు పెట్టి ఓ.కే. అన్నాడు.

"మేం రాజమండ్రి వెళ్ళి మీకు ఫోన్‌చేస్తాం! డేట్ గురించి దానిప్రకారం మీరు రెడీ కావచ్చు. అదీ ఈ నెలలో జరిగితే మేం త్వరగా ఉద్యోగ ప్రయత్నాలు చెసుకోడానికి బావుంటుంది'' అన్నాడు వినయ్.

"చాలా ఆనందం! ఇక ఈ విషయం లేడీస్‌కి కూడా చెప్పేశానంటే వాళ్ళసలే సెంటిమెంటల్! వండరైపోతారు. ఇక మీకు ఏమన్నా అవసరం వుంటే మొహమాటం లేకుండా నన్నడగండి'' అన్నాడు వెంకటరత్నం.

"థాంక్స్, ఇక ఈ రాత్రికే మేం వెళ్ళిపోతాం" అన్నాడు వినయ్.

వెంకటరత్నంగారు కృతజ్ఞతలు చెప్పి వెళ్ళిపోయాడు.

"వచ్చిన పని సక్సెస్! ఇక పోదాం మిత్రమా'' అంటూ బట్టలు సర్దేశాడు బాపిరాజు.



"మా అమ్మగారు కాస్త తన ధోరణి మార్చుకొంటే వసంత ఆమెకు అన్నివిధాలా నచ్చుతుందని నా అభిప్రాయం" అన్నాడు వినయ్.

"లేడీస్‌కదా... వాళ్ళకేవో సెంటిమెంట్స్ ఉంటాయ్... చ్ఛ... చ్ఛ... వెంకటరత్నంగారి భాష నాకొచ్చేసింది! నీవన్నది కరెక్ట్ వినయ్... చూద్దాం... ఏం జరుగుతుందో" అన్నాడు బాపిరాజు. సూట్‌కేస్‌లు తీసుకుని బస్టాండ్‌కొచ్చి రాజమండ్రి బస్ ఎక్కేశారు వినయ్, బాపిరాజు.

★ ★ ★

"ప్రయాణం బాగా జరిగిందా! ఏమిటి పాలకొల్లు విశేషాలు?" అడిగారు సూర్యనారాయణ బాపిరాజుని.

"ఏముంది బాబాయ్! మా ఫ్రెండ్‌ని చూద్దామని వెళితే అక్కడ మన వినయ్‌కి పెళ్ళి సంబంధం చూసేశాడు వాడు రాస్కెల్! అన్నీ బానే ఉన్నాయనుకోండి కానీ పెద్దలు మీరు ఉండగా బావోదని మేం సాహసం చేయలేకపోయాం" అన్నాడు బాపిరాజు.

"ఏడ్చినట్టే వుంది! అయినా వాడి పెళ్ళి విషయంలో మా జోక్యం ఉండదని మేమెప్పుడో చెప్పాంకదా! అదేదో మీరే సెటిల్ చేసుకుని రాకపోయారా! మధ్యలో మేమెందుకు" అన్నాడు సూర్యనారాయణ కాస్త కోపంగా.

ఆ మాటలు వింటున్న కళ్యాణమ్మ అటుగా వచ్చి, "ఆ పాపపు పని మాచేత్తో చేయలేం బాబూ! మీకేమయినా ఓపికుంటే మా పరువు గోదావరి పాలు కాకుండా అదేదో చేసుకుపోండి కానీ మమ్మల్ని ఒప్పించే ప్రయత్నం చేయకండి" అంది కళ్యాణమ్మ.

"అమ్మా... నీవు కాస్త వింటానంటే ఒక విషయం చెబుతాను. నాన్నగారు మీరూ వినండి! నేను పాలకొల్లులో ఒకమ్మాయిని చూశాను. వాళ్ళంతా చాలా మంచివారు. వసంతని నాతోనే యూనివర్సిటీలో చదువుకుంది. ఆమెను పెళ్ళాడతాను. ఆమె మొదటి భర్త చనిపోయాడు"

"ఛీ... సిగ్గులేదూ ఆ మాట చెప్పడానికి. దానికి బుద్ధి లేకపోతే పోయే... మొగుడు చచ్చినదాన్ని పెళ్ళాడ్డానికి నీకుండక్ఖర్లేదా? అయినా నీతో మాట్లాడి నా నోరు పడిపోవడం తప్ప ప్రయోజనం ఉండదు. మీ ఇష్టం వచ్చిన గంగలో దూకి చావండి! నిన్నమొన్న నా చంకదిగినవాడివి! ఎంత ఎదిగిపోయావురా!" అంటూ కళ్ళనీళ్ళు పెట్టుకుంది కళ్యాణమ్మ.

అనసూయ వచ్చి ఆవిడను లోనికి తీసుకెళ్ళిపోయింది.

తర్వాత సూర్యనారాయణ కూడా అక్కడి

నుండి వెళ్ళిపోయారు.

డాబామీదకు వెళ్ళి వినయ్, బాపిరాజు ఆలోచనల్లో మునిగిపోయారు. తన పెళ్ళి వెంటనే జరిగితే బావుంటుందని వినయ్ చెప్పాడు. ఎవరెవరికి కబురు చేయాలో కేవలం ఉత్తరాలద్వారా తెలియజేద్దామని లిస్ట్ రాసుకున్నారు. ప్రొఫెసర్ గోపాలకృష్ణయ్యగారికి కూడా ఉత్తరం రాయాలని నిర్ణయించుకున్నారు. 'అనుకోకుండా కొన్ని కారణాంతరాలవల్ల తన పెళ్ళి రాజమండ్రిలో జరుగుతోందని, తన ఆశయాలమేరకు వితంతువునే పెళ్ళాడుతున్నానని, తమకు చాలా దూరం కనుక కనీసం గ్రీటింగ్స్ అయినా తమనుండి కోరుతున్నా'నని రాద్దామన్నాడు వినయ్. మర్నాడు డేట్ నిర్ణయించుకొని ఉత్తరాలు రాసేశారు. తర్వాత వెంకటరత్నంకి ఫోన్‌చేసి డేట్ చెప్పారు. ఆయన ఫోన్‌లోనే చాలా సంబరపడిపోయారు. "ఇక వారంరోజులే టైముంది. ఈ విషయం తెలిస్తే లేడీస్ సెంటిమెంట్‌తో తబ్బిబ్బయిపోతార"ని ఫోన్‌లో చెప్పాడు.

ఊళ్ళో తనకు అత్యంత ఆప్తమిత్రులయిన వారికి తన పెళ్ళి విషయం చెప్పాడు వినయ్. వాళ్ళు మొదట్లో ఆశ్చర్యపోయినా తర్వాత సహకరిస్తామని చెప్పారు. తర్వాత వినయ్ తన రెండు ఉంగరాలను, మెళ్ళో బంగారుగొలుసుని అమ్మేసి కొత్తబట్టలు, బూట్లు కొన్నాడు. పెళ్ళివాళ్ళకి ఆ రాత్రి విందు నేనిస్తానని ఒక మిత్రుడు ముందుకొచ్చాడు. వాళ్ళందరి సహకారంతో వినయ్ పెళ్ళికి పూర్తిగా ప్రిపేరయిపోయాడు. ఒకరోజు రాత్రి ఇంట్లో తన తల్లిదండ్రులముందు ఈ విషయం కూడా బయటపెట్టేశాడు వినయ్.

"ఎల్లుండే అంటే... శుక్రవారం రాత్రి ఎనిమిదీ ముప్ఫయ్ రెండు నిమిషాలకు నా పెళ్ళి శ్రీనివాస మందిరంలో జరుగుతుంది. నామీద మీకు ఏమాత్రం జాలి ఉన్నా నాలుగక్షింతలు వేయడానికి రండి. నేను శుభవార్త చెబుతూ మీ మనసు తూట్లు చేస్తున్నందుకు క్షమించండి. తల్లిదండ్రులనే నా పెళ్ళికి పిలుచుకునే స్థాయికి మీ దృష్టిలో నేను దిగజారిపోవచ్చు. నా ఆశయాలమేరకు ఇలా చేయడం తప్పడంలేదు. అందుకు నన్ను క్షమించండి'' అని చెప్పాడు వినయ్.

సూర్యనారాయణగారు, కళ్యాణమ్మ ఏమీ కామెంట్ చేయలేదు. మౌనంగా వింటూ ఉండిపోయారు.

"అనూ! అయామ్ సారీ! నీవు కూడా నా పెళ్ళికి తప్పకుండా రావాలి. మీ నాన్నగారికి ఈరోజే తెలియజేస్తాను. నిన్ను చాలా విషయాల్లో హర్ట్ చేసినందుకు మరోవిధంగా భావించకు. టేకిట్ ఈజీ... ప్లీజ్ నన్ను అర్థంచేసుకో' అన్నాడు వినయ్.

"నీ క్షమాపణకి కూడా అర్హురాలిని కాదు బావా! నన్నెప్పుడూ ఏడిపించేవాడివి సరదాకి! ఈరోజు నీవు నాతో మనస్ఫూర్తిగా మాట్లాడుతుంటే నాకు నిజంగా ఏడుపొచ్చేస్తోంది'' అంటూ కన్నీళ్ళు పెట్టుకుంది అనసూయ.

వినయ్, బాపిరాజు ఆ మౌనపూరిత వాతావరణంనుండి మెల్లిగా బయటకు వచ్చేశారు భారమైన గుండెలతో.



**ఆ** రోజు వినయ్ పెళ్ళిరోజు. వెంకటరత్నంగారికి ఫోన్ చేశారు. రెండు బస్సుల్లో వాళ్ళ బంధువులు బయలుదేరిపోయారని తాము వసంతని తీసుకుని కారులో బయలుదేరుతున్నామని చెప్పారాయన. భోజనం ఏర్పా




ప్లేవీ చేయద్దు. అవన్నీ నేను వచ్చి చూసుకుంటానని చెప్పాడు వెంకటరత్నం. లేదు పెళ్ళి తర్వాత మా విందు స్వీకరించాల్సిందేనని బాపిరాజు చెప్పాడు. ఆయన సరేనన్నాడు. ఇక టైం అయ్యేకొలదీ వినయ్, బాపిరాజుల్లో టెన్షన్ పెరిగిపోయింది. ఒక ఫ్రెండ్ వద్దన్నా బాండ్‌మేళం పెట్టించేశాడు. మరో ఫ్రెండ్ వాళ్ళింట్లో వినయ్‌ని వాళ్ళ అమ్మగారితో పెళ్ళికొడుకుని చేయించాడు.

"తన కాళ్ళకి పసుపురాసి, బుగ్గన చుక్కలు పెడుతోంటే కొన్ని క్షణాలు తన తల్లి గుర్తొచ్చి చలించిపోయాడు. యూనివర్శిటీలో ఒంటరిగా ఉన్నప్పుడు తాననుకున్నవాటన్నిటికీ ఆ పరిసరాలు కొండంత అండనిచ్చేవి. మరిప్పుడు ఇంత సాంప్రదాయ కుటుంబాలమధ్య సెంటిమెంట్ తనని నిర్వీర్యుణ్ణి చేస్తుందా! అని ఆలోచించుకున్నాడు వినయ్. ఏమైనా సరే! తన లక్ష్యం మారకూడదు... అదే ధృఢనిశ్చయం అతనిలో మళ్ళీ వేడి ఊపిరి పోసింది.

సాయంత్రం ఐదుగంటలకే బస్‌లు వచ్చేశాయి. వాళ్ళకి అంతకుముందే ఫ్రెండ్స్ విడిది ఏర్పాటుచేశారు. కాస్త ఆలస్యంగా వచ్చిన వెంకటరత్నంగారు వసంత, మంగతాయారు మరింత దగ్గిర బంధువులతో కారులో విడిదికొచ్చి దిగారు. మిగతా బంధువులని వినయ్ కోరిక మేరకు విడిదికి తరలించారు. చాలా చిన్నగా గుట్టు చప్పుడు కాకుండా చేద్దామనుకునే పెళ్ళి కాస్తా చాలా హడావిడిగా, గొప్పగా రూపొంది ఊపందుకుంది. పురోహితుడు... వేదమంత్రాలు... పెళ్ళిపీటలు. కోలాహలంతో చాలా కళకళలాడుతూ వేదిక తయారయింది. వెంకటరత్నంగారు వీడియోగ్రాఫర్ని పాలకొల్లునుండి రప్పించారు. ఇంకేముంది... పెళ్ళి గ్రాండ్‌గా మొదలయింది.

వసంత మామూలుగానే అందం కుప్పపోసినట్లుంటుంది. ఇక పెళ్ళికూతురిగా ధగధగలాడే నగలు, పట్టుచీర... సిగ్గుతో తలవొంచుకున్న ఆమె పూలతో బరువుగా కొమ్మనుండి వేలాడే పూలగుత్తిలా, సన్నజాజి కొమ్మలా ఉంది. పెళ్ళిజనంలో మంగతాయారమ్మ ప్రత్యేకత స్పష్టంగా కనిపిస్తోంది.

★ ★ ★

సూర్యనారాయణగారు మౌనంగా పడక్కుర్చీలో కూర్చుని పై కప్పుకేసి చూస్తున్నారు. పక్కనే అనసూయ మరో చైర్లో కూర్చుని ఉంది. కళ్యాణమ్మ ఒక స్తంభంమీద చారబడి కూర్చుంది.

కొన్నిక్షణాలయ్యాక, "ఏవండీ! ఇంకో పావు గంటలో వాడికి పెళ్ళవుతుందికదూ!" గుండెలు బరువుగా అనిపిస్తుంటే భారంగా అంది కళ్యాణమ్మ.

"అవును కరెక్ట్‌గా ఎనిమిదీ ముప్పయ్ రెండు నిమిషాలకు తాళి కడతాడు వాడు'' చెప్పాడు సూర్యనారాయణ.

"నేను ఉండలేకపోతున్నానండీ! పదండీ! పాపం... అక్షింతలన్నా వేసివద్దాం. ఏం చేస్తాం! కన్నకొడుకు కసాయివాడయినా ఆ తల్లి కడుపు తీపి మాత్రం కసాయిదెలా అవుతుందండీ'' అంది కళ్యాణమ్మ ఏడుస్తూ.

"సరే! నీవు వస్తానంటే నేనెందుకు కాదంటాను... పద" అంటూ లేచారు సూర్యనారాయణ.

"లేవే! వెళ్ళి బట్టలు త్వరగా మార్చుకో. వెంటనే వెళ్ళి అక్షింతలు వేసి తక్షణం వచ్చేద్దాం" అంటూ అనసూయకి చెప్పి కళ్యాణమ్మగారు లేచి లోనికెళ్ళారు.

★ ★ ★

ఒకపక్క బ్యాండ్‌మేళం, మరోపక్క మంగళవాయిద్యాలు మారుమ్రోగుతున్నాయి. ఎన్నో పెళ్లిళ్లు చేసిన అనుభవంతో పురోహితుడు నవ్వులేకుండా మొహం బిగించుకుని వేదమంత్రాలు చదువుతున్నాడు. దూరాన్నుండి చూసేవారికి మాత్రం ఆయన కోపంగా ఎవరినో తిడుతున్నట్లే ఉంది. 'ఇక మంగళసూత్రధారణ' అంటూ వినయ్‌చేత వసంత మెడలో తాళి కట్టమన్నారు. వసంత జడని ఎత్తి సూ

త్రం కట్టడానికి అనువుగా ఒకావిడ పట్టుకుంది. వసంత మెడలో సూత్రానికి మూడుముళ్లు వేస్తూ ఆమె పాలరాతిలాంటి వీపుని గమనించాడు. ఆ తెల్లటి శరీరంపై ఒక నల్లటి పుట్టుమచ్చ స్పష్టంగా కనిపిస్తూ మరింత ఆకర్షణీయంగా వుంది.

ఈమె జడకింద ఇంత అందం దాగి వుందా! అనుకొంటూ మూడుముళ్లూ వేసేశాడు.

వర్షం పడినట్లు నలుదిక్కులనుండీ తలంబ్రాలు వధూవరులమీద, చాలావరకూ పురోహితుడిమీదా, అటు పక్కనే కూర్చున్న బాపిరాజుమీదా పడ్డాయి. పసుపు కలిపిన అంక్షితలు కళ్లల్లో పడకుండా పురోహితుడు పైకండువా అడ్డుపెట్టుకున్నాడు.

అంతలో ఆ వేదికకు కొద్దిదూరంలో ఒక ఆటో ఆగింది. సూర్యనారాయణ, కళ్యాణమ్మ, అనసూయదిగారు. బాపిరాజు ఎదురెళ్లి వాళ్లకి దారిచూపిస్తూ ఆ రష్‌లో పెళ్లిపీటల దగ్గరకు తీసుకెళ్ళి అక్షింతలు అందించాడు. ఎదురుగా నిల్చున్న కళ్యాణమ్మను, సూర్యనారాయణగారిని, ఆ వెనుక ఉన్న అనసూయని చూశాడు వినయ్. వసంత చెవిలో 'మా అమ్మ, నాన్నగారు' అంటూ చెప్పాడు. వసంత తలెత్తి చూసింది. కళ్యాణమ్మ, సూర్యనారాయణగారు అంక్షితలు వేశారు. కళ్యాణమ్మ కళ్లనుండి అంక్షితలతోపాటు వేడి కన్నీటిబొట్లు కూడా వినయ్ తలమీద పడ్డాయి. వినయ్, వసంత లేచి కళ్యాణమ్మ, సూర్యనారాయణ కాళ్లకు నమస్కారం చేశారు. కళ్యాణమ్మ, సూర్యనారాయణ, అనసూయ అక్కడినుండి వెంటనే ఆటో దగ్గరికి వచ్చి ఎక్కికూర్చున్నారు. కొద్దిసేపు ఉండమని బాపిరాజు బ్రతిమాలినా వినకుండా వెళ్లిపోయారు.

పెళ్లితంతు ముగిసింది. తర్వాత ఒకచోట వినయ్, వసంత నిలబడి అతిథులకు అభినందనలు చెబుతున్నారు. డిన్నరు ప్రారంభమయ్యింది. వినయ్ ఫ్రెండ్స్ అంతా ప్లాన్డ్‌గా ముందే నిర్ణయించుకొని అరిటాకులు బల్లలపై పరిచి అందరికీ వడ్డించి, విందులో తొక్కిడి లేకుండా పద్ధతిగా నిర్వహించారు. రెండురకాల స్వీట్లు కార, సాంబారు, చారు, మరో రెండు కూరలు, అప్పడాలు, ఊరగాయలతో సహా వడ్డించడంతో వినయ్ ఏర్పాట్లకు వెంకటరత్నం, మంగతాయారు మెచ్చుకున్నారు.

తర్వాత ఒక బస్‌లో కొంతమంది పాలకొల్లు వెళ్లిపోయారు. రెండోబస్ పొద్దుటే బయలుదేరుతుంది. ఆ రాత్రికి కొంతమంది వసంత, మంగతాయారుతోసహా విడిదిలో గడిపి, తెల్లవారుజామునే పాలకొల్లు ప్రయాణమయ్యారు.

ఆ రాత్రి వెంకటరత్నం తమ బంధువులకు, ఫ్రెండ్స్‌కు ఇంటి దగ్గర విందు ఏర్పాటుచేశారు. వినయ్ వెంట బాపిరాజుతోపాటు మరి కొంతమంది రాజమండ్రి ఫ్రెండ్స్ పాలకొల్లు వచ్చారు. ఆ ఫంక్షన్ అయిపోయాక బాపిరాజు ఒక్కడ్నీ వినయ్ దగ్గర వదిలి మిగతా ఫ్రెండ్స్ రాజమండ్రి వెళ్లిపోయారు. పెళ్లిలో అందరూ బాగా అలసిపోవడంతో ఒకరోజంతా విశ్రాంతి తీసుకున్నారు. మంగతాయారు ముహూర్తం పెట్టించి 'శోభనం' ఏర్పాట్లు చేయించింది.

★ ★ ★

"పానకంలో పుడకలాగా నేనెందుకిక్కడ? నేను వెళ్ళి మన ఫ్రెండ్స్ దగ్గరవుంటాను'' అన్నాడు బాపిరాజు. "నీకిక్కడ ఏం ఇబ్బంది లేదుగానీ ఓ రెండురోజులన్నా వుండవయ్యా. మా అల్లుడు ఇక్కడ అలవాటుపడేవరకూ'' అంటూ వెంకటరత్నం బాపిరాజుని ఆపేశాడు. రాత్రి పదకొండుగంటలకు శోభనం. ముహూర్తం ప్రకారం ఏర్పాటు చేయడంలో మంగతాయారు మరికొంతమంది హడావిడి చేస్తున్నారు. అన్నీ సిద్ధంచేసి మేడమీద బాపిరాజుతో మాట్లాడుతున్న వినయ్‌ని పిలిచారు. "ఆమెకు రెండోపెళ్లి అని తెలిసి కూడా వీళ్లెందుకు ఇంత ఆర్భాటం చేస్తున్నారో నాకర్థం కావడంలేదురా'' అన్నాడు వినయ్.

"ఒకసారి ఆమె జీవితంలో దెబ్బతిందిక




దా. అవన్నీ మరిచిపోవడానికి మళ్ళీ ఆమెకు జీవం పొయ్యడానికేనని నా ఉద్దేశం. నీవు ప్రతీదానికీ వర్రీ అవ్వక చక్కగా ప్రొసీడ్ అయిపో' అంటూ వినయ్ భుజం తట్టాడు బాపిరాజు.

అంతలో వెంకటరత్నంగారు మేడమీదికొచ్చి "లేడీస్‌కదా! ముహూర్తం టైమయిపోతుందని వాళ్లు సెంటిమెంట్ ఫీలవుతున్నారు. నీవు రావయ్యా కిందికి'' అన్నాడు

వినయ్ కిందికిదిగి హాల్లోకి రాగానే అందంగా అలంకరింపబడిన గదిలోకి తీసుకెళ్లి కూర్చోబెట్టారు. వెంకరత్నం అక్కడికొచ్చి.

"అమ్మాయి ఒక్కోసారి ఆకతాయిలా ప్రవర్తించినా మరోవిధంగా భావించకు బాబూ! మొదట్నుండీ కాస్త బాగా గారం చేశాం. ఒక్కతే కూతురు కావడంతో బాధ్యతలు పెద్దగా తెలీకుండా పెరిగింది. అర్థం చేసుకుని మసలుకో అల్లుడూ'' అంటూ చెప్పాడు.

వినయ్ నవ్వాడు.

"సర్లెండి! ఇక్కడ మీరెందుకూ మేం చూసుకుంటాం వెళ్లండి! ఇక్కడంతా ఆడవాళ్లం ఉంటే తగుదునమ్మా అంటూ వచ్చారు'' అంది మంగతాయారు చిరుకోపంతో.

"కరెక్ట్! ఇక్కడంతా లేడీస్‌కదా... అందుకే సెంటిమెంట్ సెటిలయిపోయింది. ఇక్కడ నేనుండకూడదు కరెక్టే' అంటూ వెంకటర్నతం వెళ్లిపోయాడు.

"జాగ్రత్త నాయనా! ఈ రోజుల్లో మేం చెప్పాల్సిందేముంది! మా వసంత అదోటైపు పిల్ల! ఒకళ్లనొకరు అర్థం చేసుకుని అన్యోన్యంగా వుంటూ ఓ అరడజన్‌మంది చక్కటి పిల్లలకు జన్మనివ్వండి నాయనా'' అంటూ ఒక పెద్దావిడ వసంతని గదిలోకి తోసి తలుపులు దగ్గరగా వేసేసింది. అక్కడనుండి మంగతాయారు వెంకటరత్నం దగ్గరకొచ్చి.

"ఏమండీ వీడియోకుర్రాడు కేసెట్‌లో ఇంకా ఫిల్మ్ మిగిలిపోయింది అన్నాడుకదా! ఇందాక వసంతని అలంకరించేటప్పుడు పిలవాల్సిందండీ. మరచిపోయాను. మీరైనా గుర్తు చేశారుకాదు'' అంది.

"ఇంకా నయం వాళ్లు గదిలోకెళ్లాక కూడా వీడియో తియ్యమన్నావు కాదు. పెళ్లిపనుల్లో రిటైరయిపోయి సెంటిమెంట్ బాగా తలకెక్కినట్లుంది నీకు. పిచ్చిగా మాట్లాడక వెళ్లిపనులు చూసుకో' అన్నాడు వెంకటరత్నం.

"కేసెట్ ఊర్కే ఖాళీగా ఉంచడమెందుకు రేపొద్దుట వాడిని పిలిచి మన ఇంట్లో సామాన్లన్నీ వీడియోలో తీసి పెట్టమనండి. ఆఖర్న పిచ్చి పిచ్చి సినిమా పాటలు ఎక్కించకే' అంటూ వెళ్లిపోతూ ఏదో గుర్తొచ్చి కీచుమని అరిచింది.

"అయ్యో వాళ్లగదిలో నీళ్లుపెట్టడం మరిచిపోయాను'' అంది అక్కడ ఉన్న ఒకావిడతో.

"అయ్యయ్యో అంటూ ఆవిడ శోభనాల గది దగ్గరకు వెళ్లి తలుపుమీద చప్పుడుచేసి "వసంతా! ఒక్కసారి తలుపు తియ్యమ్మా! తాగడానికి నీళ్లు పెట్టడం మరిచాం. ఇదిగో గడపదగ్గర పెడుతున్నా వచ్చి తీసుకోమ్మా! మధ్యలో వచ్చినందుకు మరేం అనుకోకే' అంటూ ఆ పెద్దావిడ వచ్చేసింది. నీళ్లచెంబు తీసుకుని గడియపెట్టి లోనికొచ్చి నిలబడింది వసంత.

"ఏమిటి! నిలబడే ఆలోచిస్తున్నావు. వచ్చి కూర్చో'' అంటూ ఆహ్వానించాడు వినయ్.

ఆమె మరింత సిగ్గుతో ఇంకొంచెం వెనక్కి వెళ్లింది. వినయ్ ఆమె దగ్గరగా వచ్చి ఆమె భుజాలమీద చేతులేసి మంచంమీద కూర్చోబెట్టాడు. చాలాసేపు మౌనంగా గడిచింది.

"సిగ్గుపడుతున్నావా? చదువుకున్న మనమే ఇక్కడేం మాట్లాడుకోవాలో తెలీక ఇబ్బంది పడుతున్నామంటే మరి ఏం చదువుకోనివాళ్ళ మాటేమిటి?" అన్నాడు వినయ్.

"చదువుకున్నాం కనుకే ఇబ్బంది'' అంది వసంత.

"అమ్మ దొంగా! ఇంతవరకూ సిగ్గుపడుతు న్నావనుకున్నాను'' అంటూ వసంత బుగ్గ గిల్లాడు వినయ్.

"నేను సిగ్గుపడుతుంటే, మీరెంత సిగ్గుపడ తారో చూద్దామని'' అంది వసంత కొంటెగా.

"అయితే ఇక్కడ నేను అమాయకుడినన్న మాట. ఇక లాభంలేదు. నా రొమాంటిక్ పవరేమిటో నిరూపించుకుంటాను చూడు! అవునూ! ఈ మల్లెల సౌరభాల మధ్య సుతిమె త్తని పట్టుపరుపులు, మత్తెక్కించే సుగంధపరి మళాలు ఇవన్నీ చూస్తుంటే నీకేమనిపిస్తుంది ప్రియతమా?" అన్నాడు వినయ్.

"ముందు మీకేమనిపిస్తోందో చెప్పండి'' అంది వసంత.

"ప్రశ్న వేసింది నేను. కనుక నువ్వు చె ప్పాలి'' అన్నాడు వినయ్.

"ఏముంది సింపుల్! ఎవరికో శోభనం జరుగుతున్న వాతావరణంలా ఉంది'' అంది వసంత.

"నిన్నూ'' అంటూ వినయ్ వసంతని తన చేతులతో బంధించి, కొన్ని సెకన్ల తర్వాత. "ఇప్పుడెలా వుంది?" అన్నాడు.

"నాకేమనిపించడంలేదు. కొత్త కనుక మీకే ఏమన్నా అన్పిస్తుండవచ్చు'' అంది వసంత.

ఆ మాట వినయ్‌కి షాక్‌లా తగిలింది. ఒక్క నిమిషం ఆలోచన ఆగిపోయింది. అప్ర యత్నంగా ఆమెను అలానే పట్టుకొని ఆలోచ నలో పడ్డాడు. ఏమిటిలా ప్రవర్తిస్తుంది. సరదా కా! లేక మాట్లాడటం ఎలాగో తెలీకా! అమ్మాయి ఆకతాయి అన్నారు సరే. పోస్ట్‌గ్రాడ్యు యెట్ కూడా గదా! ఇంత సంస్కారహీనంగా నా మాట్లాడేది? వినయ్ మెదడులో ప్రశ్నలు సుడులు తిరుగుతున్నాయి.

"వసంతా! ఇలా మాట్లాడవచ్చా! ఇది మన మొదటిరాత్రి. మొహమాటం లేకుండా ప్రవర్తించవచ్చు. కానీ సిగ్గులేకుండా మాత్రం కాదు'' అన్నాడు. వినయ్.

"నేనేం సిగ్గులేకుండా మాట్లాడటంలేదు. నాకోసారి పెళ్లయిందని మీకు తెలుసుకదా. మళ్ళీ ఎందుకలా అడుగుతారు. మీరడిగితే నేను 'చాలా బావుంది' అంటూ అబద్ధం చెప్పాలా! ముక్కుసూటిగా మాట్లాడాలని మా అమ్మమ్మ చిన్నప్పట్నుండీ మాకు నూరిపో సింది'' అంది వసంత గారాలుపోతూ!

అంత చల్లటి వాతావరణంలోనూ వినయ్‌కి చెమటలు పట్టాయి.

'స్త్రీ అక్షరాలు లేని తెల్లకాగితాల మహా గ్రంథం. చదివితే ఎంతో తెలుస్తుంది. ఇంకా తెలుస్తూనే ఉంటుంది' అనే ఒక సూక్తిగుర్తొచ్చి ఆలోచనలో పడిపోయాడు. ఈమెనెలా డీల్ చేయాలి! ఈరాత్రి నా జీవితంలో మధురంగా నిలవకపోయినా ఫరవాలేదు. మరచిపోలేని వ్యధగా మాత్రం నిలవకూడదు అనుకొని.

"సరే లైటార్పి పడుకో నిద్రపోదాం" అన్నా డు నవ్వు తెచ్చుకుని.

"అయితే నేను కిందపడుకుంటాను'' అంది వసంత మరింత మారాం చేస్తూ.

"ఎందుకు! పైనే పడుకో. ఇది మీ ఇల్లు. మీ బెడ్. ఇక్కడున్నవన్నీ మీవేకదా! కావాలంటే నేను కిందపడుకుంటాను'' అన్నాడు వినయ్.

"ఛీ... అదికాదు. నాకు ఒక్కత్తినీ పడు కొంటేనే నిద్ర వెంటనే వస్తుంది. పక్కనెవర న్నా ఉంటే మాత్రం నాకు పిట్టకథలు చెప్పాలి. మరి! లేకపోతే నిద్రరాదు. మావారు ఎన్నో కథలు చెప్పేవారు పాపం" అని చెప్పి వెంటనే నాలుక్కరుచుకుని "సారీ అండీ నోటికొచ్చే సింది మరోవిధంగా భావించకండి'' అంటూ వినయ్‌వంక గోముగా చూసింది.

ఆమె మాట బుల్లెట్‌లా తగిలినా ఆమె అలా చూడటం మాత్రం కాస్త ఆహ్లాదంగా అని పించింది వినయ్‌కి.

"బహుశా మొదటి భర్త పోయిన షాక్‌లో ఇన్నాళ్లూ అతని జ్ఞాపకాలు హంట్‌చేసి ఈమె ను ఈ స్థితికి తెచ్చుంటాయి. సరే! కాస్త సావధానంగా ఈమె మెంటాలిటీని పసిగట్టాలి




అనుకొని రాజీధోరణిలో,

"సరే పైన పడుకో కథ చెబుతాను'' అంటూ తాను పడుకున్నాడు.

"ఆమె అతని పక్కలో చేరి దగ్గిరగా వచ్చి అతని గుండెలపై వాలింది.

వినయ్‌కి పరిస్థితి చాలా చిత్రంగా వుంది. ఆనందపడాలో, ఆలోచించాలో తెలీని పరిస్థితి అది.

"ఊఁ కథ చెప్పండి. గుర్రుపెట్టేలా నిద్దరావాలి నాకు'' అంటూ వినయ్ కళ్ళలోకి చూసింది.

వినయ్‌కి ఆమె అంతరంగం అంతుచిక్కడంలేదు.వసంత పిక్యూలియర్ పర్సన్. 'ఆనాడు తనని యూనివర్సిటి క్యాంపస్‌లో నిలబెట్టి ఆలోచింపజేసింది. ఇప్పుడూ అదే పరిస్థితి. అసలేమిటీ వింత! వసంత పల్స్ అంత తొందరగా దొరకడంలేదు వినయ్‌కి.

"అనగనగా ఒకరాజు. ఆ రాజుకి ఇద్దరే కొడుకులు'' అంటూ వినయ్ చెబుతుండగా,

"ఛీ... రాజుకి ఇద్దరే కొడుకులా... కాదు. ఏడుగురు. మీరు మరచిపోయుంటారు'' అంది వసంత గేలిచేస్తూ.

"లేదు ఇద్దరే! ఆ రాజుగారు ఫామిలీప్లానింగ్ పాటించారు'' అన్నాడు వినయ్ కాస్త కోపంగా.

"అయితే వాళ్ళిద్దరూ వేటకు వెళ్ళారా?" అంది వసంత.

"లేదు! వాళ్ళిద్దరూ కోటలోనే ఉండి వాళ్ళ నాన్నగారిని వేటకు పంపించారు'' అన్నాడు వినయ్.

"బోర్... బోర్... కథ బావోలేదు. ఇంకోకథ చెప్పండి ప్లీజ్!" అంది వసంత అతనికి కితకితలు పెడుతూ.

మొత్తంమీద ఈమెకు ఎక్కడో కాస్త స్క్రూ లూజ్. అందుకే ఆమె వింతగా వుంటుంది. మొత్తం వీళ్ళ ఫామిలీనే వెరైటీ మనుషులు. వెంకటరత్నం ఒకటైపు. మంగతాయారు ఒక టైపు. వసంత అదోటైప్. అనుకొన్నాడు వినయ్, మరో కథ చెప్పడానికి ప్రయత్నిస్తూ.

"అనగనగా ఒక 'భారతదేశం'. దాన్ని పి.వి. నరసింహారావు పరిపాలిస్తున్నాడు. రాష్ట్రపతిగా శంకర్‌దయాల్‌శర్మ వ్యవహరిస్తున్నారు. ఇంతలో హర్షద్‌మెహతా అనే రాక్షసుడు'' అంటూ చెప్పబోతుండగా.

"ఛీ ... ఇది కథ కాదు. డాక్యుమెంటరీ. నాకు నిద్ర వచ్చేస్తోంది'' అంటూ ఇద్దరికీ కలిపి దుప్పటిముసుగు లాగేసింది వసంత.

★ ★ ★

తెల్లారేసరికి వసంత పక్కలో లేదు. అప్పటికే ఆమె తలంటు పోసుకుని బట్టలు మార్చేసుకుంది. వినయ్ లేవగానే నవ్వుతూ వచ్చి 'గుడ్‌మార్నింగ్' అంటూ పలకరించింది.

"రండి వేడినీళ్లు రెడీగా వున్నాయి. మీరు స్నానం చేసి వచ్చేస్తే అందరం కలసి టిఫిన్ చెయ్యాలని మా అమ్మగారు ఎదురుచూస్తున్నారు'' అంటూ వినయ్‌ని చెయ్యి పట్టుకుని బాత్‌రూమ్‌వైపు లాక్కుపోయింది.

"ఈమె ప్రవర్తన ఎప్పటికప్పుడు వింతగా కనిపిస్తుంది. ఇప్పుడు చాలా మర్యాదగా ప్రవర్తిస్తోంది. రాత్రి ఎందుకలా మాట్లాడింది! అనుకొంటూ స్నానంచేసి వచ్చి డైనింగ్ టేబుల్ ముందు కూర్చున్నాడు.

అప్పటికే బాపిరాజు, వెంకటరత్నం, మంగతాయారు, వసంత కజిన్ కూర్చునివున్నారు. వినయ్ పక్కన వసంత కూర్చుని దోసెలు, పెసరట్లు, ఇడ్లీలు, అందరికీ ప్లేట్లలో వేసింది.

"ఏంటయ్యా డల్‌గా కనిపిస్తున్నావ్. అసలు నిద్రపట్టలేదా ఏంటి?" అన్నాడు వెంకటరత్నం.

"ష్'' అంటూ కళ్లతోనే వెంకటరత్నంని హెచ్చరించింది మంగతాయారు.

"ఏంలేదండి. కొత్త ఇంట్లో పడుకోవడంకదా! నిద్ర సరిగా పట్టలేదు. మీ వసంత చాలా హేపీగా కనిపిస్తోంది కదూ'' అన్నాడు వినయ్.

"లేడీస్‌కదా వాళ్ళ సెంటిమెంట్స్ డిఫరెంట్'' అన్నాడు వెంకటరత్నం. సరదాగా కబుర్లతో టిఫిన్లు ముగించారు. వెంకటరత్నంగారు డ్యూటీకెళుతున్నానని వెళ్లిపోయారు. టిఫిన్‌చేసి వినయ్ బాపిరాజు, బయటకొచ్చి రోడ్డుమీద నడుస్తూ చాలాదూరం వచ్చేశారు.

"ఫస్ట్‌నైట్ హేపీనా?" అన్నాడు బాపిరాజు.

"ఏం హేపీలేరా... ఫస్ట్‌నైట్ కాదది. కాళరాత్రి'' అన్నాడు వినయ్.

"ఏం దోమలెక్కువగా ఉన్నాయా? మస్కిటోమ్యాట్ పెట్టుకోలేదా?" అన్నాడు బాపిరాజు.

"అది కాదురా! వసంత మన అంచనాలకి డెడ్లీ డిఫరెంట్'' ఇంకస్తమానూ తన మొదటి భర్తని గుర్తుకు తెచ్చుకుని నన్ను హర్ట్ చేసింది. ఒకోసారి చిన్నపిల్లలా, మరుక్షణం మహామేధావిలా ప్రవర్తిస్తుంది. ఆమెను అర్థం చేసుకోలేక పోతున్నాను'' అన్నాడు విచారంగా వినయ్.

బాపిరాజు పెద్దగా నవ్వేశాడు ఆ మాట విని.

"ఇందులో వర్రీ అవ్వాల్సిందేముందిరా! ఆమె మొదటి భర్త నీకన్నా మహానుభావుడై వుంటాడు. అందుకని అతని ముచ్చట్లు నీతో చెప్పివుంటుంది. నీలాంటి ఆదర్శవాది వాటిని చాలా ఈజీగా తీసుకోవాలోయ్. వర్రీ కాకూడదు'' అన్నాడు బాపిరాజు.

"నేను ఆమెను పెళ్లాడింది ఆమెకు జీవితంమీద మళ్లీ ఆశ చిగురింపజేసే ఉద్దేశంతో తప్ప ఆమె మొదటి భర్త గొప్పలు వింటానికి కాదుగదా'' అన్నాడు వినయ్.

"అవున్రా వసంత కాస్ట్‌లీ వితంతువు. దర్జాగా పెరిగింది. ఆమెకు భర్త పోయాడని ఒక్క బాధ తప్పిస్తే మిగతా వాటిల్లో ఏంలోటు ఉంది? అందుకే ఆమె అలా ప్రవర్తిస్తుంది. సరే మన చేతికి దొరికిన రాతిని శిల్పంగా చెక్కడానికి ఓర్పు కావాలిరా! ఆ రాతిబండని దాని గరుకు చూసి ఆందోళనపడితే ఎలా చెప్పు. వసంత ఇప్పుడు నీ చేతుల్లో ఉంది. ఆమెను మార్చుకోవడం నీకు పెద్ద కష్టంకాదులే' అన్నాడు బాపిరాజు.

"నీ మొహం. వసంత జగమొండి. అంత తేలిగ్గా మారేలా కనిపించడంలేదు. మా అమ్మ నన్ను శపించి ఉంటుంది'' అన్నాడు వినయ్.

"ఒరేయ్... నీలాంటి హేతువాది మాట్లాడవలసిన మాటలు కావురా ఇవి. ఈవిధంగా చూస్తుంటే నీవు తీసుకున్న ఆశయాలకు బాధపడుతున్నట్లే ఉంది'' అన్నాడు బాపిరాజు, వినయ్ మూడ్‌ని ఛేంజ్ చేయడానికి.

"కాదు. నా ఆశయాలను గౌరవించని, బాధ్యత తెలీని అమ్మాయిని పెళ్లాడానని పిస్తోంది'' అన్నాడు వినయ్.

"చూడు వినయ్. రేడియోని మనం సరిగా ట్యూన్ చేసుకుని వినాలి కానీ పక్కన సిలోన్ బాండ్ కలిసిపోతుందని మొత్తుకుంటే ఏం లాభం చెప్పు'' అన్నాడు బాపిరాజు. మళ్ళీ అతనే "ముందు వసంత ఎలా ప్రవర్తిస్తుందో గమనించు. ఆమె భావాలు స్వేచ్ఛగా వెలిబుచ్చే అవకాశం ఇవ్వు. ముందు ఆమె ఏమిటో అర్థమవుతుంది. తర్వాత చికిత్స ప్రారంభించవచ్చు. మధ్యలో మాత్రం ఆమెను హెచ్చరించావంటే అసలు అర్థం కాకుండాపోతుంది'' అని సలహా ఇచ్చాడు.

అలా మాట్లాడుకుంటూ భోజనం టైంకి ఇంటికి వచ్చేశారు. భోజనం చేశాక అలా షికారుకెళ్దామని వినయ్‌ని అడిగింది వసంత. "పాలకొల్లు అసలే ఇరుకు. ఇక్కడ షికారు చేయడానికి పెద్ద పార్కు లేమీలేవే' అన్నాడు వినయ్.

"ఇక్కడ కాదు. నర్సాపురం వెళదాం. అక్కడ గోదావరితీరం బావుంటుంది. వైజాగ్‌ని గుర్తుకుతెస్తుంది ఆ ప్రదేశం" అని చెప్పింది వసంత. ఆ విషయం విన్న మంగతాయారమ్మ వెంకటరత్నంకి చెప్పి వ్యాన్ తెప్పిస్తానంది. "వద్దు తమ్ముడి హెూండామీద




ఇద్దరమే వెళతాం" అంది వసంత.

వినయ్ సరే అన్నాడు. వసంతకి ఏవో తింటానికి పెద్ద పొట్లం ఇచ్చింది మంగతాయారు. వినయ్ వసంతని హెూండామీద కూర్చోమని బండి స్టార్ట్ చేశాడు. హీరోహెూండా ఎదురుగాలిని ఛేదిస్తూ రోడ్‌మీద రయ్‌మంటూ పోతోంది. వినయ్ భుజాలమీద చేతులువేసి తన మొహాన్ని అతని మెడ దగ్గరగా పెట్టి అదిమికూర్చుంది వసంత.

"ఏం భయమేస్తోందా...? కాస్త స్పీడ్ తగ్గించమంటావా?" అన్నాడు వినయ్.

"కాదు. మీరు బండి చాలాస్లోగా నడుపుతున్నారు. నా మొదటి భర్త వెహికిల్ తోలుతుంటే భూమి గుండ్రంగా తిరుగుతున్నట్లు భలే గమ్మత్తుగా వుండేది'' అని నాలుక్కరుచుకుని "అయ్యో సారీనండీ. ఏమిటో నొటికొచ్చేసింది అనేశాను. బాధపడకండి'' అంటూ వినయ్ వీపుమీద ముద్దుపెట్టుకుంది.

"వెహికిల్‌ని రేంజ్‌లో నడపడం నాకు చాతగాక కాదు. మనకు ప్రమాదం జరక్కూడదని. అయినా వేగంగా వెళ్లడానికి అక్కడేం కొంపలంటుకోవడం లేదుగా. నీ మొదటి భర్త గొప్ప స్టంట్‌మన్ కావచ్చు. అతనితో నన్ను పోల్చాల్సిన టైంకాదు. సందర్భం కూడా కాదు'' అన్నాడు వినయ్ కాస్త కోపంగా.

"సారీ అంటున్నాకదా! ప్లీజ్" అంటూ అతని నడుం దగ్గర గిల్లింది వసంత.

"నోరా వీపుకు తేకే అనే సూక్తి నీలాంటివాళ్ళ గురించే పుట్టివుంటుంది. మాట్లాడేటప్పుడు కాస్త ముందూ వెనుకా చూసుకుని మాట్లాడాలి'' అన్నాడు వినయ్.

"నేను ముందూ, వెనకా చూసే మాట్లాడాను'' అంది వసంత.

"ఏంచూసి మాట్లాడావ్?" ప్రశ్నించాడు వినయ్.

"నేను ఆమాట చెప్పేటప్పుడు మన ముందు లారీ పోతోంది. వెనుక బస్సు వస్తోంది'' చెప్పింది వసంత.

ఏడ్పులో కూడా అదోలాంటి నవ్వు వినయ్‌లో కన్పించింది. నవ్వాలో ఏడ్వాలో తెలీని పరిస్థితి వినయ్‌ది. గోదావరి తీరాన్ని ఆనుకొని ఉన్న ఏటిగట్టుమీద హెూండా ఆపి కొద్ది దూరం జివ్వున వీస్తున్న గోదావరి గాలిని అనుభవిస్తూ నడిచివెళ్లి, ఒక మైలురాయి బోర్లా పడి వుంటే దానిమీద కూర్చుని గోదావరి అవతలి తీరాన్ని చూస్తున్నాడు వినయ్.

వసంత పొట్లం పట్టుకుని నడచివస్తోంది. గాలికి రేగే కురులను మోచేత్తో సరిచేసుకుంటున్న ఆమె భంగిమ అద్భుతంగా వుంది. గాలికి ఆమె కట్టిన చీర మొత్తం వెనక్కిపోతూ స్పష్టంగా ఆమె శరీరమంతా ముందుకు వచ్చి కనిపిస్తోంది.

శిల్పంలాంటి సొగసుల సుందరేకానీ... మహాతిక్కసుందరి అనుకొన్నాడు వినయ్.

వసంత పొట్లం తెచ్చి వినయ్ చేతికిచ్చి తినమంది. "వద్దు నాకు ఆకలిగా లేదు'' అన్నాడు వినయ్. "అబ్బా ఇవి ఆకలికోసం కాదండీ కాలక్షేపం కోసం. మేం మా ఇంట్లో భోజనం చేసిన వెంటనే... బత్తాయిలూ, జామపళ్లూ గంటలతరబడి తింటాం. మీరేంటి ఎప్పుడో పొద్దుట తిన్నభోజనం. ఆకలిగా లేదంటారేంటి?" అంది వసంత.

"నువ్వు రోజంతా తింటూ కూర్చున్నా అరిగేలా అలవాటు చేసుకున్నావు. నాకెలా వీలవుతుంది. టైంలీ మీల్స్ నాకలవాటు'' అన్నాడు వినయ్.

వినయ్ నోట్లోకి బలవంతంగా ఒక స్వీట్ తోసింది వసంత. వినయ్‌కి కొంత ఉత్సాహం వచ్చింది. ఇలా ప్రవర్తిస్తే పర్వాలేదు బంగారంలా ఉంటుంది. కానీ మొదటి భర్తని గుర్తుచేసే నా మూడ్ పాడుచేస్తుంది. అని మనసులో అనుకొని.

"ఇక్కడ చాలా ప్రశాంతంగా వుంది. మంచి లొకేషన్. ఎవరన్నా కవి ఇలాంటిచోట సింగిల్‌గా కూర్చుంటే గొప్ప కవిత వ్రాయగలడు'' అన్నాడు వినయ్ భావగర్భితంగా.



"అన్నట్లు మీకు చెప్పలేదుకదూ. నా మొదటి భర్త భలే కవితలు రాసే..." అంటూనే గుటకలు మింగింది వసంత. వినయ్ తీక్షణంగా చూడటంతో.

"నోటికొచ్చేసింది అంటావ్! ఇక నేనేమీ మాట్లాడను. అవి తినేయ్. ఇంటికి పోదాం" అన్నాడు వినయ్ కోపంగా.

"ప్లీజండీ. ప్లీజ్! సరదాగా వచ్చాం. మీరలా మూడ్ మార్చుకొంటే ఎలాగండీ! ఏదో అలవాట్లో పొరపాటు. ఈ చల్లని గాలి. చిలిపిగా అలలు రేపే గోదారి. ఆ కదలిపోయే మేఘాలు. రివ్వున సాగిపోయే ఆ గువ్వల జంట. పక్కన అందమైన భార్య ఇవన్నీ ఆస్వాదించక ఇంటికి అప్పుడే పోదామంటారేంటండీ'' అంది వసంత.

"ఆఁ అవన్నీ ఆస్వాదించాలనే వచ్చాను. కానీ పరిస్థితులు ఈ చల్లని గాలిని పెనుతుఫానుగాను, ఆ గోదావరి అలలు వరదలాగా, ఆ మేఘాలు కుంభవృష్టి కురిసేలాను, ఆ గువ్వల జంట రాబందుల జంటగాను కన్పిస్తున్నాయి. ఇక పక్కన అందమైన భార్యే కానీ... లోకువిస్తే చాలు మొదటి భర్త వ్రాసిన కవితల్ని కూడా హావభావాలతో మరీ విని నించేలా వుంది'' అంటూ నిట్టూర్చాడు వినయ్.

"ప్లీజ్... ప్లీజ్... ప్లీజండీ'' అంటూ వినయ్ గడ్డం పట్టుకొని గోముగా చూసింది వసంత.

"వినయ్ పంచేంద్రియాలనీ కట్టిపడేసే ఆ చూపు. అతని కోపంమీద పన్నీటిజల్లులు కురిపించి మౌనంగా ఉండిపోయాడు. పళ్ల బిగువున కోపాన్ని దిగమింగాడు. వసంత గోదావరి గురించి, ఆ తీరం వెనుక ఉన్న ఊళ్ల గురించి చెబుతూ కంకరరాళ్లు తీసి కాలవలోకి విసురుతోంది. రెండు రాళ్లు ఇచ్చి వినయ్‌ని కూడా విసరమంది. ఎందుకు అన్నాడు. సరదాగా వుంటుంది అంది. నాకందులో సరదా ఉండదన్నాడు. అయితే నీ పేర్న నేనే విసురుతానంటూ "ఇది మా వారిది ఒకటీ. ఇదీ మా శ్రీవారిదే రెండు'' అంటూ ఆ రాళ్లు కాలవలోకి విసిరేసింది. వినయ్‌కి నవ్వాగిందికాదు.

"ఇదిగో ఏదో జోక్‌లో సెన్స్‌వుంది కనుక నవ్వాను. ఇది లోకువగా తీసుకుని రెచ్చిపోయావో నీ తిక్క వదలగొడతాను'' అంటూ ఆమె చెవులు మెలితిప్పాడు.

"మీరు కోప్పడినా కొన్ని క్షణాల్లో మళ్లీ మామూలుగా కాగలరండీ. వైజాగ్‌లో యోగాసనాలేసేవారా?" అంది వసంత కొంటెగా.

"లేదు. మెంటల్ హాస్పిటల్లో రోగులమధ్య కూర్చుని సహనం నేర్చుకున్నాను'' అన్నాడు వినయ్. వసంత నవ్వేసింది. "ఇంకొంచెం దూరం వెళ్లికూర్చుందాం''అంది.

"ఇక్కడ బావోలేదా?" అన్నాడు వినయ్.

ప్లేస్ పాతబడిపోయింది. కొత్తచోట కూర్చుందామని వినయ్‌ని ముందుకు లాక్కెళ్లిపోయింది. అవీ ఇవీ చెబుతూ ఏదో ముఖ్య విషయం గుర్తొచ్చినదానిలా.

"మీకు ఈతవచ్చా?" అంది వినయ్‌తో

"వచ్చు! ఏ ఎందుకు?" అన్నాడు వినయ్.

"నాకూ వచ్చులెండి. మీ పద్ధతి చూస్తుంటే రాదేమో అనుకున్నాను'' అంది వసంత.

"నువ్వు ఈత నేర్చుకున్నావా? ఎక్కడ?" అన్నాడు వినయ్.

"మా ఊళ్లో కాలవుంది కదాండి. అందులో ఒకావిడపడి ఈతరాక చనిపోయిందట. అప్పుడు నాకు పదేళ్లవయసుంటుంది. మా నాన్నగారు భయపడి ఆడపిల్లలకు కూడా ఈత తెలుసుండాలని నన్ను స్కూటర్‌మీద రోజూ స్విమ్మింగ్‌పుల్‌కి తీసుకెళ్లి నేర్పించారు చిన్నప్పుడు. ఎక్కడికన్నా పిక్నిక్‌కి వెళితే వీలుంటే ఈత కొట్టేదాన్ని. తర్వాత ఇంకెప్పుడూ ఈదలేదు. ఒకసారి నా మొదటి భర్తతో కలిసి అనుకుంటా'' అని చెప్పి గుడ్లు తేలేసి గుటకలు మింగసాగింది వసంత.

వినయ్ నవ్వాలనుకున్నాడు. అది బాధగా మారి అతని గుండెల్లోకి ఆరిపోయింది. అక్కడనుండి విసురుగా వచ్చి హోండా ఎక్కికూర్చున్నాడు.




వసంత పరుగున వచ్చి తానూ వెనుక ఎక్కి కూర్చుంది.

"ప్లీజ్... ప్లీజ్... ప్లీజండీ! ఆ మాయదారిరోగం నాకు వదిలి చావడంలేదు. ఇంకెప్పుడూ అనను. అలవాటులో పొరపాటు'' అంటూ దారిపొడవునా వినయ్‌ని బ్రతిమాలుతూనే ఉంది. అక్కడ గిల్లి, ఇక్కడ గిల్లి కితకితలు పెట్టి ఇంటికొచ్చేలోగా వినయ్‌ని మూడ్‌లోకి తేగలిగింది.

నవ్వుతూ హోండా దిగుతున్న అల్లుణ్ణీ, కూతుర్నీ చూసి వెంకటరత్నం, మంగతాయారు తృప్తిగా ఊపిరి పీల్చుకున్నారు.



"ఇక్కడ నాకు బోర్ అని కాదు కానీ, మీరు కొత్తదంపతులుకదా మీకు చాలా ఏకాంతం కావాలి. నేను సినిమాలు చూస్తూ, పుస్తకాలతోటే కాలక్షేపం చేస్తున్నానులే. అయినా ఖాళీయేకదా ఒకసారి రాజమండ్రి వెళ్లి మీ అమ్మ, నాన్నగారిని చూసొస్తాను'' అన్నాడు బాపిరాజు వినయ్‌తో.

"సరే! వెళ్లి వెంటనే వచ్చెయ్. ఇంకో వారంపోయాక హైదరాబాద్‌కి షిఫ్ట్ అయిపోవచ్చు. వెంకటరత్నంగారితో మాట్లాడి మా కొత్త కాపురానికి కూడా ఏర్పాట్లు చేసుకుంటాను. మా అమ్మ మానసికంగా కోలుకొనేలా ప్రయత్నించు'' అంటూ బాపిరాజుని రాజమండ్రి పంపించాడు వినయ్.

బాపిరాజుని సాదరంగా ఆహ్వానించి పలకరించారు కళ్యాణమ్మగారు. అనసూయ కూడా అక్కడే వుంది. బాపిరాజు రావడంతో ఆ ఇంట్లో కాస్త ఉత్సాహం పుంజుకుంది. సూర్యనారాయణ కూడా ఎంతో ఆనందించాడు.

"వినయ్ వెళ్లిపోయాక మా ఇంట్లో ముసురుపట్టినట్లుండేదయ్యా... నువ్వొచ్చాక ఇదిగో ఇలా నవ్వగలుగుతున్నాం" అన్నారు సూర్యనారాయణ బాపిరాజుతో.

బాధపడాల్సిన పనేముంది బాబాయ్! ఈ రోజుల్లో ఏదీ సిస్టమేటిగ్గా జరగడంలేదు. అన్నిరంగాలలో విపరీతమైన స్పీడ్ వచ్చేసినట్లే మన సంప్రదాయాల్లో కూడా మార్పులు రావడం సహజమేకదా!" అన్నాడు బాపిరాజు

ఆ మాటలు ఆలకిస్తున్న కళ్యాణమ్మ కల్పించుకుంటూ...

"ఇప్పటికే మా చుట్టుపక్కల వాళ్లు మమ్మల్ని చూసి చెవులు కొరుక్కుంటున్నారు బాబూ! ఈ వీధిలో ధైర్యంగా తలెత్తుకు తిరగలేకపోతున్నాం. వాడి ఆశయాలకోసం ఇక్కడ మాకు పరువుపోగొట్టాడు. నేనేం పాపం చేసుకున్నానో నాకిలా శిక్ష మిగిల్చాడు!" అంటూ బాధపడింది కళ్యాణమ్మ.

"ఊర్కోండి ఆంటీ! మగాడు ఇలా చేస్తేనే బెంబేలెత్తిపోతున్నారు. ఈ రోజుల్లో ఆడపిల్లలు కట్టుబట్టలతో నచ్చినవాడితో పరారయిపోతున్నారు. మరి వాళ్ల తల్లితండ్రులు తలెత్తుకు తిరగడంలేదా! సమాజమంటారా! అది మనం భయపడితే ఇంకా భయపెడుతుంది! అసలు మనం బతికేది మనకోసం అయినప్పుడు వేరేవాళ్లు మనల్ని ఏమనుకొంటే ఏంటి? పైగా వినయ్ కానిపనేమీ చేయలేదు వాళ్లు తప్పుపట్టడానికి. వితంతువునైనా ధైర్యంగా, అగ్నిసాక్షిగా పెళ్లాడాడు. ఇందులో తప్పేం ఉంది. మన ఇంట్లో ఒక వితంతువుంటే మన ఆలోచనలూ అలానే ఉంటాయికదా! జరిగిందేదో జరిగిపోయింది. ఇక ఆ విషయం వదిలెయ్యండి'' అన్నాడు బాపిరాజు.

కళ్యాణమ్మ మాట్లాడలేదు. మౌనంగా కిచె న్‌కేసి వెళ్లిపోయింది.

"బావవాళ్ల కాపురం ఎలా ఉంది?" అంది అనసూయ బాపిరాజుతో.

"బ్రహ్మాండంగా వుంది. వాళ్లిప్పుడు చంద్ర మండలంలో స్లోమోషన్‌లో డ్యూయెట్ పాడు కుంటూ ఉంటారు'' అన్నాడు బాపిరాజు.

"అబ్బ నేనడిగేది వాళ్ల సరదాల గురించికా దు. వాళ్ల అత్తారింట్లో ఇమడగలుగుతున్నాడా! భార్య అర్థం చేసుకొని ప్రవర్తిస్తోందా అని'' అంది అనసూయ.

"అత్తమామలు అల్లుణ్ణి బంగారంకన్నా మిన్నగా చూసుకుంటున్నారు. ఇక భార్యాభ ర్తల అంతరంగం గురించి నేనేం చెప్పగల నండీ! నేను వాళ్ల దగ్గరగా ఉండి చూసేటట్లు వాళ్లు ప్రేమని పంచుకోరుకదా!" అన్నాడు బాపిరాజు.

"ఛీ మిమ్మల్నేం అడగకూడదు'' అంది అనసూయ బుంగమూతి పెడుతూ!

"ఇంకా ఏమిటి విశేషాలు'' అడిగాడు బా పిరాజు.

"మీరే చెప్పాలి! బావకి పెళ్లయిపోయాక ఇక్కడ అంతా చాలా డల్ అయిపోయింది. అంకుల్ సరే! ఆయన బాధలు పైకి కనబడనీ యరుకదా! నేనే టైంకి భోజనం చెయ్యమని ఇద్దరినీ బతిమాలుతుంటే కొంచెం తినగలుగు తున్నారు. రోజులు డల్‌గా గడిచాయి. ఇప్పుడు మీరొచ్చాక మాకు కాస్త రిలీఫ్‌గా వుంది'' అంది అనసూయ కృతజ్ఞత నిండిన కళ్లతో

"నేనెంతకాలం ఉంటాను చెప్పండి... నేనె ళ్లిపోతే?" ప్రశ్నించాడు బాపిరాజు.

ఆ మాటకు అనసూయ మొహంలో ఆందో ళన చోటుచేసుకుంది. మాటలు రాక తలదించు కుంది.

"చెప్పండి! చెప్పలేరుకదూ! ఇదే ఆప్యా యత అంటే. మనసుకు నచ్చింది దగ్గరైతే సంతోషం, దూరమైతే సంతాపం. వీటి రెంటికీ మధ్యతేడాని గుర్తించడం అందరికీ సాధ్యంకా దు. వినయ్ దూరమయ్యాడనే బాధ నేను రావడంతో కాస్త ఊరట చెంది ఉంటుంది. అంతే!" అన్నాడు బాపిరాజు.

"నాకర్థం కాలేదు మీరు చెప్పింది'' అంది అనసూయ.

"ఏదో మనసు గురించి సెంటిమెంట్‌గా వివరించానులెండి. అది తేలిగ్గా అర్థంకాదు. టూకీగా చెప్పాలంటే ఏం జరిగినా బెంగపెట్టు కోకూడదు. ఏమైనా సరే అని అర్థం" అన్నాడు బాపిరాజు.

"ఇలాంటి విషయాలు నాకు టూకీగా చె ప్పండి బాబూ! హైలెవెల్లో చెబితే నాకర్థం కాదు'' అంది అనసూయ నవ్వుతూ. మళ్లీ తానే అంటూ...

"మీకు ఏవిష్టమో చెప్పండి చేసి పెడతా ను'' అంది.

"ఎందుకంత ప్రత్యేక శ్రద్ధ'' అన్నాడు బా పిరాజు.

"ఇందులో శ్రద్ధ అనేముంది. మొహమాట పడి చెప్పలేరుకదాని'' అంది అనసూయ.

"భలేవారండి! ఈ బాపిరాజు డిక్షనరీలో మొహమాటం అనే పదమేలేదు. అది లేకపో వడం వల్లే ఇలా ఎవరోకళ్లమీద పడి బతికేస్తు న్నాను. నేనిప్పుడు అరటికాయ బజ్జీలు తినాల నుకుంటున్నాను. ఇలా అడగడానికి నేనేమ న్నా సిగ్గుపడుతున్నానేమో చూడండి'' అంటూ ఒక ఎక్స్‌ప్రెషన్ ఇచ్చాడు బాపిరాజు.

"అరటికాయ బజ్జీలు కావాలని డైరెక్ట్‌గా అడగొచ్చుకదాండి! దానికెందుకంత బ్యా గ్రౌండ్ మ్యూజిక్' అంది నవ్వుతూ వసంత.

"బ్యాగ్రౌండ్ మ్యూజిక్కా?" ఆశ్చర్యంగా అడిగాడు బాపిరాజు.

"అవునండీ! ఎవరన్నా గతాన్ని తవ్వుకొని బాధపడుతున్నా, ఇంకేదన్నా అనుకొంటున్నా దాన్ని నేను బ్యాగ్రౌండ్ మ్యూజిక్కంటాను'' అంది అనసూయ.

"మంచి పేరు పెట్టారు చాలా బావుంది.




ఒక్కోసారి మీ తెలివితేటలు రీరికార్డింగ్‌లా భలే క్లారిటీగా వుంటాయిలెండి'' అన్నాడు బాపిరాజు.

అనసూయ నవ్వుతూ కిచెన్‌కేసి వెళ్లిపోయింది.

బాపిరాజు కుర్చీలో కూలబడి పేపరు చదవడంలో నిమగ్నమైపోయాడు. అరగంట తర్వాత రెండు ప్లేట్లలో వేడి బజ్జీలు, మరో చేత్తో ఫ్లాస్కు, గ్లాసులు తెచ్చి బాపిరాజు ముందుపెట్టింది. అక్కడ ఎత్తుగా ఉన్న ఒక స్టూల్‌ని ముందుకు లాగి దానిమీద ప్లేట్లు సర్దిపెట్టి నిలబడింది అనసూయ.

"కూర్చోండి.. ఆ ఛైర్ లాక్కోండి ఇలా... ప్లీజ్!" అన్నాడు బాపిరాజు.

అనసూయ ఛైర్‌లాక్కుని ఎదురుగా కూర్చుంది. బాపిరాజు నవ్విస్తుంటే అనసూయ చిన్న పిల్లలా కేరింతలు కొడుతూ నవ్వేస్తోంది. అంతలో సూర్యనారాయణ బయటనుండి లోనికి వచ్చాడు. ఆయన్ని చూసి అనసూయ లేచి నిలబడింది కంగారుగా.

"ఫర్వాలేదమ్మా! కూర్చో. నేను కాళ్లు కడుక్కొని వస్తాను'' అంటూ ముందు గదిలో నుండి కిచెన్‌లోకెళ్లాడు సూర్యనారాయణ.

"కళ్యాణీ! మన అనసూయని, బాపిరాజుని చూస్తుంటే నీకేమనిపిస్తోంది'' అన్నాడు.

"ముందు మీకేమనిపిస్తోందో చెప్పండి. ఏదో బాగా చదువుకున్నపిల్లాడు, సంస్కారవంతుడు కాస్త చనువుగా వుంటే అలా ఆలోచించడమేనా'' అంది కళ్యాణమ్మ మూతితిప్పుతూ.

"అబ్బ! అదికాదే నా ఉద్దేశ్యం. అనసూయకి ఎలానూ పెళ్లికావాల్సి ఉందికదా. బాపిరాజు కూడా పెళ్లి కావాల్సినవాడు. చూస్తుంటే ఇద్దరికీ జోడీ బావుంటుందని'' అంటూ నసిగాడు సూర్యనారాయణ.

"ఈ ఆలోచన నాకెప్పుడో వచ్చింది'' అంది నవ్వుతూ కళ్యాణమ్మ.

"చంపావుకదే! ఈ మాటన్నందుకు నన్నెక్కడ తిట్టిపోస్తావోనని భయపడి చచ్చాను. నీ థింకింగ్ కూడా ఈమధ్య రీజనబుల్ అయిపోతోంది. ఇప్పుడు నేనన్న రీజనబుల్ తిట్టు మాత్రం కాదు సమంజసమని అర్థం" అన్నాడు సూర్యనారాయణ.

"చాల్లెండి అర్థాలు తీరుబడిగా నేర్చుకుంటాను. ముందు మా తమ్ముణ్ణీ, వాడి భార్యను ఇక్కడకు పిలవండి. వాళ్లని కూడా పిలిచి ఈ విషయం అడిగితే బావుంటుంది. అనసూయ బాపిరాజుని చూస్తే చాలు చాలా ఉత్సాహపడుతోంది. అనసూయ గురించి కూడా బాపిరాజుకి అంతా తెలుసు. భగవంతుడి దయవల్ల వాళ్లిద్దరికీ పెళ్లి రాసుంటే అంతకన్నా ఆనందమేముందండి'' అంది కళ్యాణమ్మ.

"బావుంది. మరి నేను టీ తాగి ఇప్పుడే వెళ్లి వాళ్లని సాయంత్రానికి తీసుకొస్తాను'' అంటూ టీ తాగేసి హాల్లోకొచ్చాడు సూర్యనారాయణ.

"ఏంటి బాబాయ్ ఇప్పుడే వస్తానని వెళ్లి పావుగంట లేటుగా వచ్చారు. మా ఇద్దరికీ ఒక సబ్జక్ట్ మీద సమస్య వచ్చింది. మీకోసం వెయిట్ చేస్తున్నాం" అన్నాడు బాపిరాజు.

"ఆ సమస్యేదో త్వరగా చెప్పండి. నేను అర్జంటుగా ఒక పనిమీద వెళ్తున్నాను. రాత్రికి తిరిగొస్తాను'' అన్నాడు సూర్యనారాయణ.

"కృష్ణుడికి మీసాలెందుకుండవు! అంటోంది అనసూయ. ఆయనకి రెగ్యులర్‌గా షేవ్ చేసుకొనే అలవాటుందని నేనంటున్నాను'' నవ్వుతూ చెప్పాడు బాపిరాజు.

"ఇంకా నయం దేవుళ్లు ఏ బ్లేడ్ వాడతారన్నారుకాదు. ఇదిగో ఇలా దేవుళ్ల మీద జోకులేసుకోవడం ఆవిడ విందంటే దుంపతెంచేస్తుంది కనుక మరోటాపిక్ మాట్లాడుకోండి'' అంటూ సూర్యనారాయణ బయటికి వెళ్లిపోయాడు.

"ఏదో సరదాకంటే అంకుల్‌కి ఎందుకు చెప్పారు'' అంది అనసూయ చిరుకోపంతో.

"ఆయనేమీ కోప్పడలేదులే! ఇలాంటివంటే ఆయనకి మహాసరదా! ఆంటీ వుందని

ఆయన భయపడుతున్నారు'' అన్నాడు బాపిరాజు.

"మీ బర్త్‌డే ఎప్పుడు'' అడిగింది అనసూయ.

"ఫిబ్రవరి ముప్ఫయ్ ఒకటి'' చెప్పాడు బాపిరాజు.

"అయ్యో ఆ డేట్ వెళ్లిపోయింది లేకపోతే మీకు మంచి గిఫ్ట్ ఇద్దామనుకున్నాను'' అనుకొంటూ కొన్ని క్షణాలు ఆలోచించి "ఫిబ్రవరి నెలకి ఇరవై తొమ్మిది రోజులేగా! నన్ను బోల్తాకొట్టిద్దామనుకున్నారుకదూ'' అంటూ అక్కడ ఉన్న పేపర్ని మడిచి బాపిరాజు మీదకు విసిరింది.

"ఇంతలేటుగానా ట్యూబ్‌లైట్ వెలగడం... సరే! నువ్వేంటి ఇలా పేపర్లు విసురుతున్నావు. ఆంటీ చూస్తే ఏమనుకుంటుంది'' అన్నాడు బాపిరాజు.

"ఏం అనుకోదు పేపరాట ఆడుకుంటున్నారనుకుంటుంది'' అంటూ అక్కడ నుండి ప్లేట్లు పట్టుకుని వెళ్లిపోయింది.

వినయ్ పెళ్లికి రాజమండ్రిలో తమ ఫ్రెండ్స్ తీయించిన ఫొటోలు పట్టుకొస్తానని చెప్పి బాపిరాజు బయటకి వెళ్లిపోయాడు. సాయంత్రానికి సూర్యనారాయణ అనసూయ తల్లితండ్రుల్ని వెంటబెట్టుకుని తీసుకువచ్చాడు.

"నిలబడ్డ వాళ్లని ఉన్నపళంగా తీసుకొచ్చేయమన్నావట! ఏమిటి విశేషం అక్కాయ్!'' అంటూ అనసూయ తండ్రి కిచెన్‌లోకి పరుగెట్టాడు. ఆయన ఎప్పుడొచ్చినా మొదట కిచెన్‌లోకెళ్లి అక్కడ తయారుగా వున్నదేదో నోట్లో వేసుకుని మరీ బయటకొస్తాడు. తింటానికి ఏవీ తయారుగా లేకపోతే నువ్వుగింజలో, శనగపప్పో నోట్లో వేసుకునికాని తృప్తిపడడు. తమ్ముణ్ణి చూడగానే కళ్యాణమ్మ ఆనందంతో...

"ఏవుందీ... కళ్యాణం వచ్చినా కక్కొచ్చినా ఆగదంటారుకదా! ఆ విషయమ్మీదే పిలిచాను. నువ్వు ముందు కాళ్లూచేతులూ కడుక్కోనిరా!'' అంటూ మిగిలిపోయిన అరటి బజ్జీ ఒకటి ఇచ్చింది. కళ్యాణమ్మ బయటకు వచ్చి అనసూయ తల్లిని పలకరించింది.

"ఇంతకీ విషయం చెప్పారుకాదు. ఏదో సంబంధం విషయం మాట్లాడదామని పిలిపించారట! ఎక్కడ చూశారు! పిల్లాడెలా ఉంటాడు'' అంటూ ప్రశ్నలు వర్షం కురిపించింది అనసూయ తల్లి.

"ఎక్కడికో వెళ్లక్కర్లేదు మన ఇంటికే వస్తాడు పెళ్లికొడుకు'' అంది కళ్యాణమ్మ.

అనసూయకి కొంతవరకూ అర్థమయినా నమ్మలేకపోతోంది. అసలు ఇంత సడెన్‌గా తన తల్లితండ్రులు రావడం! పైగా తన పెళ్లి గురించే మాట్లాడుకోవడం. పెళ్లికొడుకు ఇక్కడికే వస్తాడని కళ్యాణమ్మ అనడం, బహుశా బాపిరాజుకీ, తనకీ పెళ్లి విషయం మాట్లాడతారేమో! ఒక్కసారి అనసూయ ఒళ్లు పులకరించింది. మెల్లిగా ఆనందం చుట్టుముట్టింది. నాతో ఒక్కముక్క చెప్పకుండా ఏమిటి వీళ్లంతా పకడ్బందీగా ప్లాన్ చేసుకున్నారు! అయినా బాపిరాజుని తాను ఇష్టపడేది వాస్తవమే కానీ బాపిరాజు తనని ఇష్టపడుతున్నాడా! ఆయనది స్వతహాగా అందర్నీ నవ్వించే తత్వం. అందరితో కలివిడిగా వుంటాడు. అంత మాత్రాన తనని పెళ్లాడటానికి ఇష్టపడతాడా! నేను బావని ఇష్టపడ్డానని కూడా బాపిరాజుకి తెలుసుండీ నన్ను స్వీకరిస్తాడా! లాంటి ప్రశ్నలు అనసూయని చుట్టుముట్టాయి. ఒక పక్క ఆనందం, మరోపక్క ఆందోళనతో అనసూయ సందిగ్ధంలో పడివుంది.

అంతలో బాపిరాజు ఫొటో ఆల్బమ్ తీసుకుని వచ్చాడు. అక్కడ కొత్తగా కనిపించిన ఇద్దరు వ్యక్తులవంకా ఆసక్తిగా చూస్తూ బాపిరాజు లోనికొచ్చాడు.

"రావయ్యా! నీ కోసమే చూస్తున్నాం'' అంటూ సూర్యనారాయణగారు బాపిరాజుని అనసూయ తల్లితండ్రులకి పరిచయం చేశాడు. అందరూ కబుర్లలో పడిపోయారు. కొన్ని నిమిషాలు బాపిరాజు వారితో మాట్లాడి




స్నానం చెయ్యడానికి వెళ్లిపోయాడు. తర్వాత అందరూ భోజనాలు చేసి హాల్లోకొచ్చి కూర్చున్నారు. బాపిరాజు దగ్గర ఫొటో ఆల్బమ్ తీసుకుని అనసూయ అందరికీ చూపించింది. వినయ్ పెళ్లిఫొటోలు అందరూ చూశారుకానీ కళ్యాణమ్మ చూడటానికి ఇష్టపడలేదు. "అమ్మాయి చాలా సంస్కారవంతంగానే కనపడుతోంది" అంది అనసూయ తల్లి వినయ్ భార్య గురించి.

"నగలు పెట్టుకుని లావుగా వుంది చూడండి. ఈవిడ వినయ్ అత్తగారు పక్కాయన మావగారు" అంటూ చూపించాడు బాపిరాజు అంతలో కళ్యాణమ్మగారు కూడా భోజనం చేసి రావడంతో అదొక చిన్న సభలా మారిపోయింది.

"బాపిరాజూ! నీతో ఒక ముఖ్య విషయం మాట్లాడటానికే మా బంధువులని పిలిపించానోయ్" అన్నాడు సూర్యనారాయణ.

బాపిరాజు విస్మయంతో చూశాడు.

"నువ్వు మా వినయ్‌తో ఉంటూ గత రెండేళ్ళుగా నాకు బాగా తెలిసున్న వాడివే! పైగా మా ఇంట్లో ఒకడిగా కలిసిపోయావు. పైగా మా జాతిపక్షి వే!" అంటూ కొన్ని నిమిషాలాగి,

"అనసూయని నీకిచ్చి పెళ్లి చెయ్యాలని నా ఉద్దేశ్యం! అమ్మాయి నీకు బాగా పరిచయమే కనుక వేరేం చెప్పక్కర్లేదు. మీ ఇద్దరికీ చక్కగా ఈడూజోడూ బావుంటుందని మాకనిపించి ఇదిగో ఇలా సమావేశమయ్యాం" అన్నాడు సూర్యనారాయణ.

బాపిరాజుకి కంగారుతో చెమటలు పట్టాయి. అసలు తాను ఊహించని పరిస్థితి అది. అనసూయంటే తనకి ఎక్కడో అభిమానముందికానీ ఇంత జరుగుతుందని మాత్రం గతంలో ఊహించలేదు తాను. వినయ్ సరదాకి ఒకసారి అన్నాడు. ఇపుడదే నిజమయ్యింది. నిజంగా వాడిది చాలా దూరదృష్టి అనుకొన్నాడు బాపిరాజు. ఏం చెప్పాలో పాలుపోవడంలేదు. అనసూయ కూడా ఒప్పుకుని ఉంటుంది. ఇంతకుముందే తాను లేనప్పుడు ఇవన్నీ మాట్లాడుకొని ఉంటారు అని మనసులో పరిపరివిధాల ఆలోచించసాగాడు.

"చెప్పవయ్యా! సిగ్గుపడతావేంటి! ఏమీ కట్నాలు ఇవ్వమనా! లేక మీ వాళ్లతో మాట్లాడాలనా!" అన్నాడు సూర్యనారాయణ.

"దేవతలాంటి పిల్ల బాబూ! ఎక్కడ ఉన్నా మహాలక్ష్మి ఆమె చుట్టూ కొలువుదీరి ఉంటుంది. అనసూయతో జీవితం సుఖంగా గడిచిపోతుంది. ఆ భగవంతుడే మానోటితో అనిపించాడో ఏమో అనసూయ నీకు బావుంటుందని నాకూ అనిపించింది" అంది కళ్యాణమ్మ.

"మీరింతగా అడుగుతుంటే మాటలు రాక ఏం చెప్పలేకపోయాను. అనసూయని నేను పెళ్లి చేసుకొంటాను" అన్నాడు బాపిరాజు.

ఆ మాటతో అందరి మొహాల్లోనూ ఆనందం వెల్లివిరిసింది. అనసూయ సిగ్గుతో వాళ్లమ్మ చాటుగా వెళ్లి దాక్కుంది.

"శుభం! సరైన చోట సరైన నిర్ణయం తీసుకోవడమే పురుషలక్షణం. చాలా అదృష్టవంతుడివయ్యా బాపిరాజు. జీవితంలో సుఖపడతావు. చదువుంది సంస్కారముంది. విచారమెరుగని మంచి మనసుంది నీకు. అనసూయ వాళ్లకి ఒక్కతే పిల్ల. వాళ్లివ్వాల్సినవి వాళ్లిస్తారు. నీవు మీ బంధువులతో ఒకసారి సంప్రదించావంటే త్వరలో పెళ్లి ముహూర్తం కూడా పెట్టుకోవచ్చు" అన్నాడు సూర్యనారాయణ.

"నాకు ఒక్క అక్కవుంది. ఆమె వద్దే మానాన్న తాతబ్బాయ్ ఉంటున్నాడు. అమ్మలేదు. నేనేం చేసినా వాళ్లకు సమ్మతమే! అయినా వాళ్లకి చెప్పడం నా ధర్మంకనుక చెబుతాను. నాకు ఊహ తెలిసింది మొదలు ఇలా జనం మీద బతకడం అలవాటయిపోయింది బాబాయ్" అన్నాడు బాపిరాజు.

"సర్లేవయ్యా! అవసరానికి ఆప్తులు కూడా

అక్కరకు రాకపోతే దారేపోయే పరాయివాడే నిజమైన తృప్తినిస్తాడు. ఆపదలో ఆదుకొనేవాడు, మంచిగా పలకరించేవాడు ఎవరైతే ఏమి! మనసున్న మనిషైతే చాలు'' అన్నాడు సూర్యనారాయణ.

ఆ రాత్రి పన్నెండు గంటలవరకూ సరదాగా ముచ్చట్లు చెప్పుకుంటూ ఆనందంగా గడిపారు అందరూ. మర్నాడు అనసూయని తనతో తీసుకుపోతానంది ఆమె తల్లి. అందుకు కళ్యాణమ్మ ఒప్పుకోలేదు. "తర్వాత పంపిస్తాను. వీలయితే దీని పెళ్లి ఇక్కడే పెట్టుకుందాం" అంది కళ్యాణమ్మ.

"అది కాదు, పెళ్లికుదిరింది కదా! ఇద్దరూ ఒకచోట ఉంటే బావుండదు చూసేవాళ్లకు'' అంది అనసూయ తల్లి.

"నువ్వా భయం పెట్టుకోవద్దు. అనసూయ అంత అమాయకురాలేం కాదు. పైగా ఆ అబ్బాయి చాలా సంస్కారవంతుడు'' అని చెప్పి వారిని పంపించి వేసింది.

పెళ్లి కుదిరిన తర్వాత అనసూయ, బాపిరాజు ఒకరినొకరు పలకరించుకోడానికి, చూసుకోడానికి కూడా జంకుతున్నారు. వాళ్ల అవస్థ గమనించిన కళ్యాణమ్మ ఇద్దరినీ ఒకసారి






అనసూయ, బాపిరాజు అలా గోదావరి తీరం వరకూ వెళ్లొస్తామని బయటకు వచ్చేశారు.

తర్వాత సూర్యనారాయణ వచ్చి "ఏరి వీళ్లిద్దరూ కనిపించడంలేదు'' అన్నాడు.

"నేనే బయటకి పంపించాను'' అంది కళ్యాణమ్మ.

"ఏమిటో అనుకొన్నాను. కాలంతోపాటు నువ్వూ మారిపోయావు. ఓ పాతికేళ్లక్రితం నువ్వు మారివుంటే నేనెంతో సంతోషించేవాడిని. ఈ పంచెకట్టు మాని ఎంచక్కా ప్యాంట్ వేసుకొని తిరిగేవాడిని'' అంటూ జోక్ వేశారు సూర్యనారాయణ.

"సర్లెండి అప్పుడప్పుడు ప్యాంట్లు వేసుకుంటున్నారుగా రోజూ వేసుకుందామనా! మీ ఇష్టం... వట్టి ప్యాంట్లేకాదు జీన్స్‌పాంట్లు కూడా వేసుకుని తిరగండి! నాదేం పోయింది. పోయేది మీ పరువేగా! నేనిప్పుడన్న జీన్స్ అనేది ఒక బట్టపేరు. మిమ్మల్ని తిట్టాలని వాడినపదం కాదని గమనించండి'' అంటూ లోనికెళ్లిపోయింది కళ్యాణమ్మ.

సూర్యనారాయణ పడక్కుర్చీలో కూలబడి పేపర్ అందుకున్నాడు.

★ ★ ★

బాపిరాజు, అనసూయ గుడి అరుగులమీద కూర్చున్నారు. అక్కడకి గోదావరి తెల్లగా మెరుస్తూ కనిపిస్తోంది. చల్లటిగాలి జివ్వున వీస్తోంది. అనసూయ మౌనంగా తలదించుకుని తన కాలిపట్టాలవంక చూస్తోంది. పూజారిని అడిగి ఒక కొబ్బరి చిప్ప తెచ్చాడు బాపిరాజు. దాన్ని చితగ్గొట్టి అనసూయ ముందు పెట్టాడు. అనసూయ తీసుకోకుండా ఆలోచిస్తోంది.

అంతలో ఒక కోతి ఎలా వచ్చిందో ఆ కొబ్బరి చిప్పను మొత్తం ఎత్తుకుపోయి చెట్టెక్కి కూర్చుని తినసాగింది. బాపిరాజు దాని వంక కోపంతో చూశాడు. అనసూయ కిసుక్కున నవ్వేసింది. బాపిరాజు మళ్లీ పూజారి దగ్గరకెళ్లి ప్రసాదం అడిగాడు.

"ఇప్పుడే కదయ్యా! కొబ్బరి చిప్ప ఇచ్చాను. మళ్లీ చిన్నపిల్లాడిలా'' అంటూ ఆయన అదోలా మొహం పెట్టాడు.

"మీరిచ్చిన ప్రసాదం కోతి ఎత్తుకుపోయిందండి'' అన్నాడు బాపిరాజు.

అయ్యోపాపం అన్నట్లు మొహంపెట్టి పూజారి మరో కొబ్బరి చిప్ప నాలుగు అరటి పళ్లు ఇచ్చి, "దాని దుంపదెగ! ఆ మర్కటం ఈ గుడి దగ్గర నానా భీభత్సం చేస్తుంది నాయనా! ఒకసారి ఈ శఠగోపురం ఎత్తుకెళ్లి ఆ చెట్టుమీద దాచేసింది'' అంటూ విసుక్కున్నాడు.

బాపిరాజు ప్రసాదం తెచ్చి అనసూయ చేతిని గట్టిగా పట్టుకుని చేతిలో పెడుతూ, "జాగ్రత్తగా పట్టుకో ఆ కోతిగానీ మళ్లీ వచ్చిందంటే తినేస్తుంది'' అని చెప్పాడు.

"పోన్లెండి పాపం నోరులేని ప్రాణి'' అంటూ ఒక పండు కోతికి విసిరి మరొకటి తాను తింది అనసూయ.

"బాపిరాజుగారూ! ముందు మీరో పచ్చిని జాన్ని చెప్పాలి'' అంది అనసూయ.

"బావని గాఢంగా ప్రేమించిన సంగతి మీకు తెలుసు! మరి నన్నెందుకు పెళ్లికి ఇష్టపడుతున్నారు! అని అడగాలనుకుంటు న్నావు అంతేనా'' అన్నాడు బాపిరాజు.

తాను అడిగే ప్రశ్న అతను అలా ఊహించడం అనసూయకి ఆశ్చర్యమనిపించి ఔనని తలాడించింది.

"నువ్వు మీ బావని ఇష్టపడ్డావు! ఇందులో తప్పేం ఉంది. అతనికి పెళ్లయిపోయింది. ఒకసారి ఎవరినో ఇష్టపడినంత మాత్రాన వా ళ్లు చెడిపోయారని భావిస్తే ఎలా అనసూయా! మనం తినే ప్రతి బియ్యపుగింజ మీదా మన పేరు రాసి ఉండదు. మనం కాదంటే మరొకరి నోట్లోకి అది వెళ్లిపోతుంది. నేను ఇంటర్ చదివే రోజుల్లో శ్రీదేవి అనే అమ్మాయిని ఇష్టపడేవా డిని. అపుడు అదో క్రేజ్. ఇపుడనిపిస్తుంది అదో పిచ్చి ఆలోచన అని. అంత మాత్రానికే నేను చెడిపోలేదు కదా. వెయ్యిమంది శ్రీదేవిలు కలిసినా నిలువెత్తు నీ మంచితనానికి సాటిరా రు'' అని బాపిరాజు మనస్ఫూర్తిగా చెప్పాడు.

"మీలా అర్థం చేసుకొనే మంచి మనిషి నాకు లభించడం నిజంగా నా అదృష్టం'' అంది అనసూయ.

"లేదు! నిన్ను భార్యగా పొందటం నా అదృష్టం'' అన్నాడు బాపిరాజు.

నా అదృష్టం అంటే నా అదృష్టమని ఇద్దరూ వాదులాడుకొంటుండగా అక్కడికి కొంచెం దూరంలో మెట్ల దగ్గర కూర్చున్న భిక్షగాడికి ఆ మాటలు వినబడి వాడు పళ్లికిలి స్తూ బాపిరాజు, అనసూయ ముందుకి వచ్చి,

"ప్రేమించుకొనేటపుడు అదృష్టానికీ, దుర దృష్టానికీ అట్టే తేడా తెలీదండీ'' అన్నాడు. వాడి మాటకీ చొరవకీ బాపిరాజుకి చిర్రెత్తుకొ చ్చింది.

"నీకెందుకోయ్! నిన్నెవడడిగాడు?" అంటూ లేవబోయాడు. వాడు అప్పటికే మెట్లు దిగి పారిపోయాడు.

అనసూయ ఆశ్చర్యంగా అలానే ఉండిపో యింది.

"ప్రేమికులంటే అందరికీ లోకువే! వెధవ సమాజం ఇలా తగలడిపోతోంది'' అంటూ అనసూయని అక్కడినుండి లేపి ఇంకో చోట కూర్చొబెట్టాడు బాపిరాజు.

"మనసులో మీరంటే నాకెంతో గౌరవం ఉండేది! నిద్రపోయేటపుడు కూడా మీ మాట లు గుర్తొచ్చి నవ్వుకునేదాన్ని! మా బావ నన్ను ఇష్టపడటం లేదని తెలిశాక మీలాంటి భర్త నాకు లభించినా చాలనుకునేదాన్ని ఎన్నో సార్లు. ఇపుడవన్నీ నిజమయ్యాయి'' అంది అనసూయ పరవశిస్తూ.

అనసూయని కాస్త ఆనందపెట్టాలని బా పిరాజు ఆకాశంకేసి చూస్తూ

"ఆ కదలిపోయే మేఘాలు, ఈ చల్లనిగాలి, ఆ ఎగిరే పక్షీ, ఈ ఆహ్లాదకరమైన వాతావర ణంలో నీకెలా అనిపిస్తోంది అనసూయా!" అన్నాడు బాపిరాజు తన్మయత్వంతో.

"గొడుగు తెచ్చుకోవడం మరచిపోయాం. ఒకవేళ వర్షం వస్తే ఎలా అని భయమేస్తోంది రాజూ!" అంది తానూ ఆకాశంకేసి చూస్తూ.

"అబ్బా! నా ఉద్దేశ్యం అదికాదు! నేను రొమాంటిజాన్ని సింబాలిక్‌గా చెప్పాలను కొంటే నీవు అర్థం చేసుకోలేకపోతున్నావు. సరే! నీకు అర్థమయ్యేలా చాలా తేలిక పద్ధ తిలో చెబుతాను'' అంటూ ఆమె దగ్గరగా జరిగి,

"ఇలా నీకళ్లల్లోకి చూస్తూ నీ దగ్గరగా హత్తుకుంటూ భుజాలు రాసుకుంటుంటే నీకె




లా ఉంది అనూ'' అన్నాడు బాపిరాజు.

"ఛీ.. అదోలా ఉంది'' సిగ్గుపడుతూ అంది అనసూయ.

"హమ్మయ్య నేననుకున్న రిజల్ట్ వచ్చింది! ఇందాక తెలీక క్లాసికల్‌గా చెప్పాను సారీ. ఇవన్నమాట నీ పల్స్'' అంటూ అన సూయ బుగ్గని గిల్లాడు బాపిరాజు.

"ఏమిటిది! మనమీద ఎంతో నమ్మకంతో ఆంటీ మనల్ని బయటకి పంపించింది. మీరి లా అల్లరిచేస్తూ ఆంటీ నమ్మకాన్ని దెబ్బతీయ కండి ప్లీజ్' అంది అనసూయ.

"నేనిప్పుడేమీ నిన్ను కొరుక్కు తినడంలే దులే! కంగారుపడకు'' అన్నాడు బాపిరాజు చాల దూరంగా జరిగిపోయి.

అనసూయ అతని దగ్గరగావచ్చి,

"కోపం వచ్చిందా! మీ ఇష్టం! నేను మీదాన్ని కనుక నన్నేమైనా చేసుకోండి'' అంది కళ్లు అరమోడ్పులు చేస్తూ.

"ఆ మాట అన్నందుకు థాంక్స్! పెళ్లయ్యే వరకూ నిన్ను ఇబ్బందిపెట్టనులే! పద చాలా టైమయ్యింది ఆంటీ మనకోసం ఎదురు చూ స్తుండవచ్చు'' అంటూ బాపిరాజు లేచాడు.

"ఇద్దరం కలిసి దేవుణ్ణి దర్శించి వెళ్లిపో దాం" అంటూ అనసూయ లేచింది.

ఇద్దరూ గుడి ఆవరణలోకి వచ్చారు. అక్క డే తచ్చాడుతున్న అయ్యప్పమాల ధరించిన ఓ కుర్రాడు అనసూయ వంక గుచ్చిగుచ్చి చూడటం బాపిరాజు గమనించాడు. బాపిరాజు కి ఒళ్లుమండింది.

"కాస్త చూపు మరల్చుస్వామీ! దీక్షలో ఉన్నట్టున్నావ్. యాత్రలో యాక్సిడెంటయ్ పోతావు జాగ్రత్త!" అంటూ అతన్ని హెచ్చ రించాడు.

"శరణమయ్యప్పా!" అంటూ లెంపలేసు కుని ఆ కుర్రాడు కంగారుగా వెళ్లిపోయాడు.

"ఏమిటో జనం! ఏ దేవుడు లాభసాటి అనిపిస్తే ఆ దేవుణ్ణి వేలమైళ్లు వెళ్లి దర్శిస్తారు. భక్తి కూడా ఫాషనయిపోయింది'' అంటూ అనసూయ వెనకాలే నడిచి దేవుణ్ణి దర్శించి కిందికి దిగివచ్చేశారు.

"దేవుణ్ణి ఏమి కోరుకున్నావు?" అడిగాడు బాపిరాజు.

"త్వరలో మన పెళ్లి కావాలని! మరి మీరు'' అడిగింది అనసూయ.

"పెళ్లి సంగతి నువ్వడిగేశావుకదా! ఆ తర్వాతి సంగతి కూడా వెంటనే జరగాలని కోరుకున్నాను'' అన్నాడు బాపిరాజు.

"ఛీ ... ఛీ ... ఛీ పాపం అలా మాట్లాడ కండి కళ్లుపోతాయి'' అంది అనసూయ.

★ ★ ★

"ఈరోజు ఒక స్పెషల్ ఐటమ్ తెచ్చాను. అది చాలా రేర్‌గా దొరికేది. ఏమిటో చెప్పు కోండి చూద్దాం" అంటూ వసంత ఒక స్టీల్ కప్పులో ఏదో పెట్టుకుని వెనుక దాచుకుని వచ్చి వినయ్ ముందు నిలబడింది.

"ఏదో కొత్త వంట బుక్స్‌లో చూసి తిప్పలు పడి చేసి వుంటావులే' అన్నాడు వినయ్.

"ఏం కాదు. నూనెతో వండనిది, తింటుంటే ఇంకా ఇంకా తినాలనిపించేది. దానిరుచే అద్భుతం! ఇది స్వీట్ లిస్ట్‌లోకే వస్తుంది. ఇప్పుడు చెప్పుకోండి చూద్దాం" అంది వసంత గారాలుపోతూ.

"ఏమయ్యుంటుందబ్బా! మిరపకాయల్లో పంచదారకూరి బజ్జీలు వేసి ఉంటావ్' అన్నా డు వినయ్ వసంతని ఆటపట్టిస్తూ.

"ఛీ .. కాదు! ఓడిపోయానని ఒప్పుకోండి చెప్పేస్తాను'' అంది వసంత నేలమీద చిందు లువేస్తూ.

"సర్లే... ఇదో గొప్ప ఇంటర్నేషనల్ క్విజ్! దీనిలో నేను ఓడిపోయానుసరే! అదేమిటో చూపించు'' అన్నాడు వినయ్.

"జున్ను" అంటూ వెండి స్పూన్‌తో ఒక ముక్క కట్‌చేసి వినయ్ నోట్లో పెట్టింది.

"బావుంది... చాలా బావుంది. జున్నంటే నాకెంతో ఇష్టం.. ఎందుకంటే నీ బుగ్గల్లా

నున్నగా, సుతిమెత్తగా నీ పెదవుల్లా చాలా రుచిగా వుంటుంది'' అంటూ తింటూనే వసంతని ముద్దుపెట్టుకున్నాడు వినయ్.

"మీకోసమే మానాన్నగారు చుట్టుపక్కల గ్రామాలన్నీ వెదికి జున్నుపాలు తెప్పించారు'' అంది వసంత వినయ్ పక్కనే కూర్చుంటూ.

"ఏంకాదులే! ఇవన్నీ తినిపించి జున్ను లాంటి మనవణ్ణి ప్రెజెంటేషన్‌గా కొట్టేయాల నివాళ్ల ఆశ" అంటూ వసంత నడుం దగ్గర కితకితలు పెట్టాడు వినయ్.

ఆమె కిలకిలా నవ్వుతూ వినయ్ చేతుల్ని అక్కడే అదిమిపట్టుకుంది.

"సారీ అండీ! రాత్రి నా మొదటి భర్తని గుర్తు చేసి మీ మూడ్ పాడు చేశాను. తర్వాత నేను చాలా బాధపడ్డాను. నిద్రపోలేదు కూడా'' అంటూ వినయ్ ముఖాన్ని తనవైపు తిప్పుకుంది వసంత.

"సారీ చెబుతూ మళ్లీ గుర్తు చెయ్యాలా! అసలు నీకిదేం జబ్బు! చదువుంది, సంస్కారముంది. ఎందుకలా ప్రవర్తిస్తావ్! నీక్కొంచెం మెంటల్ ఉందని నా డౌట్'' అన్నాడు వినయ్.

"పెళ్లయితే పిచ్చి కుదురుతుందంటారుకదా! ఆ పిచ్చికాస్తా కొన్నాళ్లకి తగ్గిపోతుందిలెండి'' అంటూ వినయ్ మొహాన్ని మళ్లీ తనవైపు తిప్పుకుంది.

"కాదు నీలాంటి వాళ్లకి పెళ్లయ్యాకే పిచ్చెక్కుతుంది'' అంటూ వసంతని మీదకు లాక్కున్నాడు.

"అమ్మాయ్! బీరువా తాళాలు ఎక్కడపెట్టావ్!" అంటూ తల్లి పిలుపు వినపడటంతో వసంత కంగారుగా వినయ్‌నుండి విడివడి బట్టలు సరిచేసుకుంటూ,

"ఆc ఇదిగో వస్తున్నా...కీస్ నా దగ్గరే ఉన్నాయ్'' అంటూ పరుగెత్తింది వసంత.

"అయ్యయ్యో ఆ కీస్ కిటికీ రెక్క తీసి విసిరితే సరిపోయేది కదటే... ఇలా సర్రున వచ్చేయడమేనా! ఆయన బాధపడరూ!'' అంటూ చెదరిపోయిన వసంత కురులను చేత్తో సరిచేసింది మంగతాయారు.

"అక్కడ మేమేం బిజీగా లేంలే! ఆయన జున్ను తింటున్నారు'' అంది వసంతగారాలు పోతూ.

"వీడియో వాడు మీ పెళ్లి కాసెట్ తెచ్చాడు. స్పెషల్ ఎఫెక్ట్‌లేవో కంప్యూటర్‌తో చేయించాడట. ఇంకో రెండొందలిమ్మంటున్నాడు. డబ్బులు బీరువాలో ఉన్నాయి. అందుకే పిలుస్తా'' అంటూ వసంత చేతిలో ఉన్న తాళాలు అందుకుంది మంగతాయారు.

వీడియో కాసెట్ వచ్చిందనే ఆనందంలో వసంత పరుగున హాల్లోకొచ్చి కాసెట్‌ని తీసుకుంది వీడియో కుర్రాడినుండి. మంగతాయారు వచ్చి అతనికి రెండొందలిచ్చి పంపించేసింది. వీడియో కేసెట్‌ని వెనుక దాచుకుని బెడ్‌రూంలోకొచ్చింది వసంత.

వసంత హంసలా అడుగులు వేసుకుంటూ రావడం వినయ్ ఆసక్తిగా గమనిస్తున్నాడు.

"పంచేంద్రియాణం.. డాష్... ప్రధానం! అన్నారు పెద్దలు. ఆ డాష్ ఏమిటో చెప్పుకోండి చూద్దాం" అంది వసంత.

"ఏమిటి! మళ్ళీ క్విజ్ కాంపిటీషనా!!" అన్నాడు వినయ్ కంగారుపడుతూ.

"అబ్బ! చెప్పండీ'' అంది వసంత కవ్వింపుగా.

"ఐదు ఇంద్రియాలలోనూ 'కళ్ళు' చాలా ప్రధానమైనవన్నారు పెద్దలు. సరే మిగతా సస్పెన్స్ ఏదో కాస్త తొందరగా లాగించు'' అన్నాడు వినయ్ నొసటిని రుద్దుకుంటూ.

"అలాంటి కళ్ళకు ఆనందాన్ని కలిగించే గొప్ప వస్తువు నా దగ్గరుందిప్పుడు... ఏమిటో చెప్పుకోండి చూద్దాం" అంది వసంత తన శరీరాన్ని అటూ ఇటూ కదుపుతూ.

"నేనెప్పుడూ చూడని ఓ వెర్రిగుమ్మడి పువ్వుని మీ నాన్న తెప్పించి ఉంటారు. అది నీవు నాకు చూపించాలని ఆరాటపడుతున్నావ్




ఏమ్మై కరెక్ట్' అన్నాడు వినయ్.

"నో... యూ ఆర్ టోటల్లీ రాంగ్. ఓడిపోయా నని ఒప్పేసుకోండి చూపిస్తా'' అంది వసంత తన నాలికని రెండు పెదాలమధ్యా వింతగా కదుపుతూ.

"సరే! నేను నీ ప్రశ్నకు కట్టుబట్టలతోసహా ఓడిపోయాను. ఆ రహస్యవస్తువేదో చూపించు భామా'' అంటూ తన బట్టలు విప్పేసుకోబో యాడు వినయ్.

"ప్లీజ్... అంత పని చేయకండి, డోర్ సరిగా లాక్ చేయలేదు. మెంటల్‌గా ఓడి పోండి చాలు, ఫిజికల్‌గా కాదు. ఇదిగో! మన పెళ్ళికి తీసిన 'వీడియోక్యాసెట్'' అంటూ చూపించింది వసంత.

"హమ్మయ్య క్విజ్ ముగిసింది. ఇదుగో వసంతా! నీవిలా ప్రతి విషయాన్నీ సస్పె న్స్‌తో జీడిపాకంలా సాగదీసావంటే నేనిక ఊరుకోను. నీ బుగ్గల్ని కూడా సాగదీసి వదు లుతాను'' అంటూ వసంత బుగ్గని చేతితో పట్టి లాగి తన ఒళ్ళో కూర్చోబెట్టుకున్నాడు వినయ్.

వసంత వినయ్ ఒడిలో గువ్వలా ఒదిగిపో తూ...,

"ఏమండీ వి.సి.ఆర్. తెచ్చి మన బెడ్ రూంలో పెట్టుకుని ఫస్ట్ మనిద్దరమే కాసెట్ చూద్దామండీ'' అంది వసంత వినయ్ గడ్డాన్ని పంటితో కొరుకుతూ.

"వద్దు... సాయంత్రం మీ నాన్నగారు వచ్చాక అందరం కలసి చూస్తేనే బా వుంటుంది. మనిద్దరం ముందు చూసేస్తే వాళ్లు ఫీలవుతారు. పైగా హాల్లో ఉన్న వి.సి.ఆర్. సెట్‌ని ఇక్కడ బిగించడానికి త్రీపిన్ ప్లగ్ బోర్డ్ మన బెడ్‌రూంలో లేదు'' అన్నాడు వినయ్.

"అదెంతపనండీ మా అమ్మతో చెప్పా నంటే పది నిమిషాల్లో ఎలక్ట్రీషియన్ని రప్పించి చేయించేస్తుంది. ప్లీజ్! మన పెళ్ళి కాసె టండీ... తొందరగా చూడాలని నా ఆరాటం'' అంది వసంత మరింత గారాలుపోతూ.

"ఎందుకంత కంగారు! పెళ్ళిలో మనం డాన్సులు చేస్తూ పాటలు పాడుకోలేదు కదా?'' అన్నాడు వినయ్ నవ్వుతూ.

"ఇలా నిదానమే ప్రధానం అనుకొంటే ఎలాగండీ... అవసరమైనచోట పరుగెత్తాలి కూడా. ఏమో నా మొదటి భర్తయితే అర్ధరాత్రి లేచి 'టీ' తాగుదామండీ అంటే చాలు ఓ.కే. అనేవారు'' అంటూ నాలుక్కరుచుకుని గుడ్లు తేలేసింది వసంత.

వినయ్ తన ఒళ్ళోనుండి వసంతని కిందికి తోసేశాడు... వసంత నేలమీద దబ్బున పడింది.

లేచి వినయ్ దగ్గరకొస్తూ... "ప్లీజ్... ప్లీజ్... ప్లీజండీ! ఏదో అలవాట్లో పొరపాటు! అయినా మిమ్మల్నెందుకనాలి. మీరు దేవుడిలాంటివా రు నాది... నాది... బుద్ధితక్కువతనం'' అను కొంటూ తన నెత్తిమీద తానే కొట్టుకుంది.

వినయ్ కోపంగా అటు తిరిగి కూర్చున్నా డు. వసంత అటువైపు వెళ్ళి ఎదురుగా నిల్చుంది.

"ఇంకెప్పుడూ అననండీ! మీరు నన్ను క్షమించే వరకూ గోడకుర్చీ వేస్తాను'' అంటూ వెళ్లి గోడకు ఆనుకుని మోకాళ్ళమీద కూర్చుంది వసంత.

రెండు నిమిషాలయ్యాక జారి కిందపడిపో యింది.

"సారీ! స్లిప్పయిపోయింది. ఎప్పుడో స్కూ ల్లో వేశాను గోడకుర్చీ. చాన్నాళ్ళయ్యింది కదా అలవాటు తప్పిపోయింది'' అని చెప్పి మళ్ళీ గోడకుర్చీ వేసింది.

వినయ్ ఆమె అవస్థను క్రీగంట గమనిస్తు న్నాడు.

"అబ్బా! తొందరగా క్షమించండీ... కాళ్ళు మంటలు పుట్టేస్తున్నాయి'' అంటూ మొఖం వికారంగా పెట్టింది వసంత.

వినయ్ కోపం ఆమె చేష్టలకు వెన్నలా

కరిగిపోయింది. ఒక తలదిండు తీసి ఆమెకేసి విసిరాడు వినయ్.

"మీరు చాలామంచివారండీ... మీ మనసు ఐస్‌క్రీంలాంటిది'' అంటూ దగ్గరగా రాబోయింది వసంత.

వినయ్ మరోపక్కగా వెళ్ళి కూర్చుని "లేదు! నా మనసు ఐస్‌క్రీం కాదు... నీలాంటి పెద్ద పిల్లలు ఆడుకొనే జారుడుబండ" అన్నాడు వినయ్ భారంగా.

"అబ్బ! భలే కొటేషనండీ... డైరీలో రాసుకుంటాను. మనసు గురించి ఆత్రేయగారి తర్వాత ఆ లెవెల్లో మీరొక్కరే టచ్ చేశారు కంగ్రాట్స్'' అంది వసంత వినయ్‌ని కవ్విస్తూ.

"నిన్నేమనాలో నాకర్థం కావడంలేదు వసంతా! నీవు తెలివైన పిచ్చిదానివో... పిచ్చెక్కిన మేధావివో... నాకర్థంకావడంలేదు'' అంటూ వినయ్ తన నొసలు నొక్కుకున్నాడు.

"అమ్మాయ్! బాపిరాజుగారొచ్చారు! వచ్చి అరగంటయ్యింది'' అని మంగతాయారు పిలుపు వినబడటంతో వినయ్ నవ్వుమొహం పెట్టుకుని బయటకు నడిచాడు. వెనుక వసంత కూడా బయటకు వచ్చింది.

"సారీరా! వచ్చి చాలా సేపయినట్టుంది, అంతా కులాసేనా!" అంటూ బాపిరాజు భుజం తట్టాడు వినయ్.

"సారీ నేను చెప్పాలిరా! మీకు ట్రబులిస్తున్నందుకు'' అన్నాడు బాపిరాజు.

"నమస్కారమండీ బావున్నారా'' అంటూ బాపిరాజుని వసంత పలకరించింది.

"నమస్కారం. వీడూ, నేనూ చంద్రమండలంమీదకు వెళ్ళామనుకోండి. వీడు నన్నొక్కడినీ అక్కడ వదిలేసి వచ్చినా నేను క్షేమంగానే వుంటానుకానీ... వీడు భూమ్మీదకు సురక్షితంగా చేరుకొన్నాడో లేదోనని ఆందోళన పడుతుంటాను'' అన్నాడు బాపిరాజు.

వసంత పకపకా నవ్వేసింది.

"మీ స్నేహం ఫెవికాల్‌తో అతికించినంత దృఢమైనదండీ'' అంది వసంత.

"మా స్నేహం సంగతి సరే! మీ భార్యాభర్తల బంధం మాత్రం కాంక్రీటండీ... ఒకసారి అతుక్కుపోయాక ఇక అంతే!" అన్నాడు బాపిరాజు వసంతకి సమాధానమిస్తూ.

"నీ మొహం! భార్యభర్తల బంధం ఇండియన్ పోస్టల్ స్టాంప్ వెనుక ఉన్న గమ్ లాంటిది. ఒక పక్కన అతికిస్తే మరోపక్కన లేచి వచ్చేస్తుంటుంది'' అన్నాడు వినయ్.

ఆ మాటకు మంగతాయారుతోసహా అందరూ పెద్దగా నవ్వేశారు.

"పవిత్రమైన భార్యాభర్తల బంధం మీలాంటి ఆధునికుల దృష్టిలో మరీ చులకనైపోవడం నేను సహించను. ఆ విషయాన్ని తీవ్రంగా ఖండిస్తున్నాను. అంతే కాదు! చదువు సంస్కారం ఉన్న మహిళగా ఆ కామెంట్‌ని ఉపసంహరించుకోమని హెచ్చరిస్తున్నాను'' అంది వసంత వినయ్‌ని ఉద్దేశించి. అలా అంటూ కోపాన్ని కూడా అభినయించింది.

"నువ్వు ఖండించుకో, ఖైమా చేసుకో. నేను ఆ కామెంట్‌ని ఉపసంహరించుకోనుగాకకోను'' అంటూ వినయ్ కూడా కోపాన్ని అభినయించాడు.

"ఏమిటండీ ఆయన మొండివైఖరి. మేం దీక్షపట్టామంటే కృష్ణుడిలాంటివాణ్ణే కాళ్ళబేరానికి రప్పించుకోగలమని చెప్పండి'' అంటూ బాపిరాజు వంక చూసింది వసంత.

"అమ్మో! కాశ్మీర్ సమస్యలోనైనా తలదూర్చవచ్చేమోకానీ భార్యాభర్తల గొడవల్లో మాత్రం వేలుకూడా పెట్టకూడదని ఆర్యోక్తి. అదేదో మీరే తేల్చుకోండి!" అంటూ బాపిరాజు చేతులెత్తేశాడు.

"అయ్యయ్యో! మీరు కాస్త పంతాలు తగ్గించుకొంటే భార్యాభర్తల అనుబంధం గురించి నేనో మంచి విషయాన్ని చెబుతాను'' అంది మంగతాయారు.




ఆవిడ ఏం చెబుతుందా అని అందరూ ఆసక్తిగా మంగతాయారుకేసి చూశారు. ఆవిడ నవ్వుతూ...,

"భార్యాభర్తల బంధం నిజానికి 'ఎలాస్టిక్ లాంటిది. సంసారంలో చొరబడే కోపతాపాలు ఆలుమగల్ని ఎంతదూరం సాగదీసుకుంటూ పోయినా అనురాగంతో చటుక్కున స్లిప్పయ్యి యధాస్థితికి వచ్చేస్తుంది'' అంటూ ఆవిడ చెప్పగానే బాపిరాజు, వినయ్ పెద్దగా అరచి నవ్వేశారు. వసంత మాత్రం మొహం నీర సంగా పెట్టేసింది.

"ఏమిటమ్మా నువ్వుకూడా! అంతేలే, అత్త గారెప్పుడూ కొత్తల్లుడిపక్షానే ఉంటుందట" అంటూ మూతిని వంకరగా తిప్పుకుంది వసంత.

"అత్తయ్య చెప్పిన కొటేషన్‌లో గొప్ప జీవి తసత్యం దాగిఉంది'' అంటూ వినయ్ అనగా నే మంగతాయారు సిగ్గుపడి ఒక స్థంబంచాటు కెళ్ళిపోయింది.

"అయితే నేను ఒంటరిగానే మీ అందరితో పోరాడతాను..., అదిగో నాన్నగారు వచ్చేస్తు న్నారు. ఆయన నా పక్షమే'' అంటూ చిందులు వేసింది వసంత.

"ఏమిటి! వీధిలైట్లు వెలగడంలేదని కంప్లైంట్ ఇవ్వడానికొచ్చిన కాలనీ ప్రజల్లాగా అంతా ఒకచోట సమావేశమయ్యారు'' అంటూ వెంకటరత్నం అక్కడికి వచ్చాడు.

"చూడు డాడీ! వీళ్ళంతా భార్యాభర్తల అను బంధం గురించి ఇష్టమొచ్చినట్లు కామెంట్ చేస్తున్నారు'' అంటూ అంతకుముందు జరి గిన విషయమంతా వెంకటరత్నంకి చెప్పింది వసంత.

"చూడమ్మా! ఆ అనుబంధం గురించి చిన్నవాళ్ళు మీకేం తెలుసు! అనుభవంతో నేను చెబుతాను చూడు... "భార్యాభర్తల బంధం నిత్యావసర వస్తువుల ధరలాంటిద మ్మా. వాటి ధరలాగ రోజురోజుకీ వాళ్ల ప్రేమ కూడా పెరుగుతుందేకానీ తరగదు'' అన్నాడు వెంకటరత్నం.

ఆయన అలా అనగానే వసంతతోసహా అందరూ నవ్వేశారు.

"ఇంకా నయం మున్సిపాల్టీ వీధిలైట్ లాంటిదన్నారు కాదు'' అంటూ మంగతాయా రు పకపకా నవ్వేసింది.

తర్వాత బాపిరాజు రాజమండ్రినుండి తె చ్చిన ఫొటోలు చూపించాడు. అందరూ ఫొటో లు చూస్తూ మురిసిపోయారు. ఆ తర్వాత వేయించిన జీడిపప్పులు తింటూ వీడియోలో పెళ్ళి క్యాసెట్ పెట్టుకుని చూస్తూ ఎంజాయ్ చేశారు.



"ఎలా ఉన్నారు మా పేరెంట్స్'' అడిగాడు వినయ్.

"అంతా బాగానే ఉన్నారు నేనొక్కడ్నే రిస్కులో పడ్డాను'' అన్నాడు బాపిరాజు.

"రిస్కా!" అడిగాడు వినయ్.

"రిస్కుకాకపోతే ఏంటి మరి! అపుడెప్పుడో నీ నోటితో అన్నావు అదే నిజమయ్యిందిప్పు డు. అనసూయకి నాకూ పెళ్ళి సెటిల్ చేసేశా రు'' అంటూ బాపిరాజు చెప్పి తల దించుకు న్నాడు.

వినయ్ ఆ మాటకు చాలా ఉత్సాహంగా స్పందించాడు, బాపిరాజు భుజాలమీద చేతు లువేసి.

"కంగ్రాట్స్! ఇంత శుభవార్తని చెబుతూ ఆ ఎక్స్‌ప్రెషన్ ఏమిట్రా మూర్ఖా!" అంటూ బాపిరా

జుని ఆనందంతో కుదిపేశాడు వినయ్.

"నేను తెగిన గాలి పటంలాంటి వాణ్ణి. నాకో ఆశయమూ..., ఆదర్శమూ అంటూ ఏమీ లేదు... ఏదో గాలికి బతికేసేవాణ్ణి. నన్నో ఇంటివాణ్ణి చేస్తున్నందుకు భయంగా వుందిరా'' అన్నాడు బాపిరాజు.

"అనసూయ నీకోసం పుట్టిందిరా! మంచి పిల్ల. మాయామర్మం తెలీని అమాయకురాలు జీవితంలో నీవు చాలా సుఖపడతావురా ప్రొసీడ్!" అన్నాడు వినయ్.

"అనసూయతో నేను సుఖపడతాను అంటున్నావు. అంటే..., నీవు వసంతతో బాధ పడుతున్నావనా అర్థం" అన్నాడు బాపిరాజు.

"అవున్రా నేను ఆమె అంతరంగాన్ని అర్థం చేసుకోలేకపోతున్నాను. చాలా తెలివైన పిచ్చి దానిలా ప్రవర్తిస్తుంది. ఒక్కోసారి ఆమె ప్రవర్తన ముందు సతీసావిత్రిలాంటివాళ్ళే సాటిరా లేరనిపిస్తుంది. మరుక్షణంలో పిచ్చిగా వాగుతోంది'' అంటూ తలని ఆకాశంవైపు తిప్పుకున్నాడు వినయ్.

"అంటే! ఆమె మొదటి భర్తని ఇంకా గుర్తుచేస్తోందా'' అడిగాడు బాపిరాజు.

"అవును... రోజులో కనీసం పదిసార్లయినా అతని ప్రస్తావన తెస్తుంది. ప్రతి పనిలోనూ నన్ను అతనితో పోల్చుకుంటుంది. మళ్ళీ 'సారీ' అంటూ కాళ్ళబేరానికొస్తుంది. నేను వసంతని పూర్తిగా స్టడీ చేయకుండా తొందరపడ్డానేమో అనిపిస్తోంది'' అన్నాడు వినయ్.

"డోంట్‌వర్రీ! నిండా మునిగాక చలికోసం భయపడకూడదు చిట్టినాన్నా! ఆ నది లోతుల్లో ఈతకొడుతూ ఎంజాయ్ చేయాలి'' నవ్వుతూ వినయ్‌వంక చూశాడు.

"అంటే నేను ఆశయాలకోసం మునిగిపోయాననా నీ ఉద్దేశ్యం! నా ఆశయాలు ఎప్పటికీ ఓడిపోవు! వాటిని అర్థంచేసుకోవడంలో మాత్రం వసంత ఓడిపోతుంది'' అన్నాడు వినయ్.

"నా ఉద్దేశ్యం అదికాదురా! వసంత ప్రవర్తనలో మార్పు తేకుండా తెచ్చే ప్రయత్నం చేయకుండా నీవు బాధపడుతున్నందుకు'' అంటూ సంజాయిషీ ఇచ్చాడు బాపిరాజు.

"ఆమె ఇనుపచువ్వ కాదు ఒక షేపులో వంచడానికి, స్ప్రింగ్‌లాంటిది. ఎంత వత్తిడి తెస్తే అంత రియాక్షన్ ఇస్తుంది. నా పల్స్‌ని నా వీక్‌నెస్‌ని మాత్రం ఇట్టే పసిగట్టేసి తన కంట్రోల్లో ఉంచుకుంటోంది. ఆమె మాత్రం నాకు పజిల్‌గా మిగిలిపోతోంది'' నిట్టూర్చాడు వినయ్.

"శిల శిల్పం కావడానికి టైం పడుతుందోయ్. మీకు పెళ్ళయి రెండు వారాలేకదా అయ్యింది. ఇక నువ్వు ఆమె గ్రిప్‌లోకి వెళ్ళడమంటావా? భర్తమీద ఆ మాత్రం డామినేషన్ లేకుండా లేడీస్ తృప్తిపడరు. అంతెందుకు అనసూయ విషయమే తీసుకో, మాకింకా పెళ్ళికాకుండానే బయట ఎక్కడబడితే అక్కడ టీ, కాఫీలు తాగకండి. ఎవరైనా ఫ్రెండ్స్ సిగరెట్ కాని, మందుకాని ఆఫర్‌చేస్తే తీసుకోకండి అలా చేస్తే నాకు ద్రోహం చేసినట్లే నని ఆంక్షలు పెట్టేసింది''

"అందుకేరా నువ్వు అదృష్టవంతుడివి. నా వసంత అలా కాదు. నా మొదటిభర్త జర్దాకిళ్ళీ వేసుకొనేవారు. మీరు వక్కపొడి కూడా తినరేంటి అంటోంది'' అంటూ వెనక్కి వాలాడు వినయ్ నిరాశగా.

"నేను నవ్వితే ఏడుస్తావుకానీ ఈ విషయాలు లైట్‌గా తీసుకోవాలోయ్. జస్ట్‌ఫర్ ఫన్' అన్నాడు బాపిరాజు.

"అది నీలాంటి వాడికి చెల్లుతుంది. నాకు మాత్రం మండుతుంది'' అన్నాడు వినయ్ కోపాన్ని తెచ్చుకుంటూ.

"ఇంకొన్నాళ్ళు ఓపికపట్టరా... కాలప్రవాహంతోపాటు నీ ప్రేమ ప్రవాహంలో ఆమె అన్నీ మరచిపోయి నిద్దట్లో కూడా 'వినయ్... వినయ్' అంటుంది చూడు'' అన్నాడు బాపిరాజు.

అలా మాట్లాడుకుంటూ అక్కడినుండి లేచి




సెంటర్‌కొచ్చారు.

"మల్లెపూలు బావున్నాయి. ఒక దండకొని వసంతకివ్వరా ఆనందిస్తుంది'' అన్నాడు బాపిరాజు వినయ్‌ని ఉద్దేశించి.

"వాళ్ళు అన్నీ ఇంటికే రప్పించుకుంటారు లే" అన్నాడు వినయ్ ఉదాసీనంగా.

"ఎంత గొప్పింటి ఆడపిల్లయినా సరే భర్త తనకోసం అలా తేవడంలో థ్రిల్ ఫీలవుతుందిరా. మీ మామగారి లెవెల్లో చెప్పాలంటే అదో గొప్ప సెంటిమెంట్ వాళ్ళకి'' అని చెప్పి వినయ్‌చేత బలవంతంగా మల్లెపూలు కొనిపించాడు బాపిరాజు.

ఇంటికిరాగానే వసంత ఎదురుకావడంతో వినయ్ ఆమె చేతికి మల్లెపూలపొట్లం అందించాడు. వసంత మొహం పౌర్ణమి చందమామలా తళుక్కుమంది. "మీదే ఆలశ్యం స్నానాలు చేసిరండి భోజనాలు చేద్దాం" అని వసంత తొందరచేసింది. ఒక పావుగంటలో ఇంటిల్లిపాదీ డైనింగ్‌టేబిల్‌ముందు కూర్చున్నారు. వెంకటరత్నం, బాపిరాజు, జోకులు విసురుతూ అందర్నీ నవ్విస్తున్నారు. అంతలో వినయ్ వెంకటరత్నంగార్ని ఉద్దేశించి.

"అంకుల్! మేం హైద్రాబాద్ వెళ్ళే విషయం త్వరగా పూర్తిచేయాలి. ఎందుకంటే నాకు అక్కడ జాబ్ వెదుక్కోనే పనొకటుంది కదా...!" అన్నాడు వినయ్.

"అదెంత పనల్లుడూ... ఇక్కడ మీరు ట్రైయినెక్కి అక్కడ దిగగానే మీ కొత్త సంసారానికి కావల్సిన సామాన్లతో లారీ రెడీగా వుంటుంది. కాకపోతే మాకింకా బెంగ తీరలేదు. ఇక లేడీస్ సెంటిమెంట్ గురించి మీ అత్త చెబుతుంది'' అన్నాడు వెంకటరత్నం.

"అవునుబాబూ... మీరింత త్వరగా వెళ్ళడం నాకు మాత్రం ఇష్టమనుకుంటున్నారా! వసంత పెళ్ళయ్యాక ఇలా ఆనందంగా వుంటుంటే నాకు రోజులే తెలీడంలేదు. ఇంకో నెలాగి తర్వాత కొత్త కాపురం పెడుదురు గానీ'' అంది మంగతాయారు.

"క్షమించండి అత్తయ్యగారు. మేమిలా సంవత్సరాలున్నా మీకు తృప్తితీరదు కానీ. మా కర్తవ్యం కూడా ముఖ్యమైందే కదాండీ, అందుకు'' అన్నాడు వినయ్.

అలా ఆ వాదనని బాపిరాజుతోసహా అందరూ కొనసాగించాక, వినయ్ ఇంకో వారం అత్తారింట్లో ఉండి తర్వాత హైద్రాబాద్ వెళ్ళేలా నిశ్చయించుకున్నారు. ఈలోగా హైద్రాబాద్‌కి సామాన్లు తరలించే ఏర్పాటు చేస్తానని చెప్పాడు వెంకటరత్నం.

★ ★ ★

వసంత మల్లెపూలు పెట్టుకున్న జడను ముందుకేసుకుని ఒయ్యారంగా నడుస్తూ వచ్చి వినయ్ పక్కన కూర్చుంది మంచంమీద. తల్లో మల్లెచెండు వినయ్ ముక్కుని తాకేలా తలతిప్పింది వసంత. వినయ్ "హాచ్" అంటూ తుమ్మేశాడు. వసంత కిలకిలా నవ్వేస్తూ,

"నేను మల్లెపూలు పెట్టుకొంటే కాళిదాసు శకుంతలలా ఉంటాను కదాండీ'' అంది వసంత.

"ఆ మాటనేను అనాలి. నీ అందం గురించి నువ్వే డబ్బాకొట్టుకోవడం నీ అమాయకత్వాన్ని నిరూపిస్తుంది'' అన్నాడు వినయ్ ఆమె వంక చూస్తూ.

"నా అందంమీద నాకు ఫుల్ కాన్ఫిడెన్స్ లెండి. అందుకే నాకు గర్వం. నేను చదివేప్పుడు నా రూమ్మేట్స్ నా అందాన్ని చూసి 'మిస్ ఇండియాకి' అప్లయ్ చేయవే అనేవారు'' మరింత గర్వంగా అంది వసంత.

"ఒట్టి అందాన్ని చూసి మిస్ ఇండియాగా ఎన్నుకోరు. తెలివితేటలు, వినయం, విధేయత అన్నీ వుంటేనే మరి'' అన్నాడు వినయ్ ఆమెను ఏడిపించాలని.

"అంటే అవి నాకు లేవనా మీ ఉద్దేశ్యం! తెలివితేటల్లో నన్నుమించిన వాళ్ళుండొచ్చేమో కానీ వినయ విధేయతల గురించి ఈ స్టేట్‌లోనే నాతోపోటీ పడగలవాళ్ళు లేరు''

అంది వసంత.

"నీ విధేయత, వినయం నేను చూస్తున్నాను కదా" అన్నాడు వినయ్ ఆమె చేతులను తన వీపుమీదనుంచి తీసేస్తూ.

"ఏదో భర్తకదాని బెడ్‌రూంలో కాస్త చొరవగా వుంటాం అంతమాత్రాన అవి లేవనుకొంటే ఎలానండీ... నేను పెళ్ళి పీటలమీద అసలు తలెత్తానా. వీడియోవాడు కెమేరా మన మొహంమీద పెట్టినప్పుడన్నా నేను తలెత్తి చూశానా! అదీ 'వినయం' అంటే" అంది వసంత అతన్ని పట్టిలాగుతూ.

"ఇంకా నయం భర్తకు మంగళ హారతిచ్చి నెత్తిమీద కొబ్బరికాయకొట్టడం కూడా వినయమే అన్నావు కాదు" వినయ్ ఆమెను విదిలించుకుంటూ అన్నాడు.

ఆ మాటకు వసంత నవ్వేసింది.

"మీరు చాలా చిలిపిగా మాట్లాడతారు. ఐలవ్‌యూ" అంటూ వినయ్ ఒళ్ళో తలవాల్చింది వసంత.

"నువ్వు నన్నేమీ పొగడక్కర్లేదు. నేను మామూలుగానే ఉన్నాను" అంటూ వసంతని పొదివిపట్టుకున్నాడు వినయ్.

వసంత వినయ్‌చుట్టూ లతలా అల్లుకుపోయింది. నాలుగైదు మల్లెమొగ్గలు రాలి వినయ్ మొహంమీదపడ్డాయి. వాటిని వసంత తన పెదాలతో పక్కకు నెట్టింది. వినయ్ జుట్టులోకి తన చేతులు పోనిచ్చి సుతారంగా నిమిరింది. వసంత సున్నిత భాగాలను మరింత సున్నితంగా తాకుతున్నాడు వినయ్.

"నేను చాలా బరువు కదాండి" అంది వసంత చిలిపిగా.

"చూట్టానికి సన్నగా వున్నా కాటాబస్తాలాగ చాలా బరువు నువ్వు" అంటూ ఆమె బుగ్గను గిల్లాడు వినయ్.

"మీరు మాత్రం తక్కువ బరువా ఏంటి! అయినా ప్రేమతో ఎంత బరువయినా మోయ్యెచ్చండీ. ఇష్టంలేకుండా మాత్రం మంచినీళ్లగ్లాసును కూడా కదల్చలేం" అంది వసంత అతని గడ్డాన్ని నిమురుతూ.

"అన్నీ వంటింటి పోలికలేనా కాస్త రొమాంటిక్‌వి చెప్పరాదూ" అన్నాడు వినయ్.

"ఇలా మీతోకలసి ఆరుబయట పండు వెన్నెల్లో... తెల్లచీర మల్లెపూలు పెట్టుకొని ఎవరూ లేని ఏకాంతరాత్రి పూర్తిగా గడపాలని వుందండి. నేను వైజాగ్‌లో ఉండగా అనుకొనేదాన్ని. పెళ్ళయితే భర్తతో కలసి ఆ బీచ్‌లో ఒక రాత్రంతా ఒంటరిగా గడపాలని" అంది వసంత.

"ఐడియా బానేవుంది కానీ ఆచరణ కష్టం వసంతా! పగలు భార్యాభర్తలు కలసి వెళ్తుంటేనే అనుమానంగా చూస్తారు జనం. ఇక అలాటివి జరుగుతాయంటే కష్టమే" అన్నాడు వినయ్.

"నిజమేనండి ఒక్క జనంతోటే ప్రోబ్లంకాదు. అలా అర్ధరాత్రి వరకూ గడిపామంటే దెయ్యాలు రావచ్చు. నక్కలు, పాములూ రావచ్చు" అంది వసంత వినయ్‌ని సమర్ధిస్తూ.

"ఇంకొకటి మరచిపోయావ్ సడెన్‌గా వర్షం వచ్చిందనుకో మహాచిరాగ్గా వుంటుంది" అన్నాడు వినయ్ ఆమెను మీదకులాక్కుంటూ.

"కరెక్ట్! భార్యాభర్తలకు బెడ్‌రూంలో ఉన్న సేఫ్టీ మరెక్కడా వుండదండీ!" అంది వసంత వినయ్ చేతిలో నలిగిపోతూ.

"సడెన్‌గా నిర్ణయాలు మార్చుకోవడంలో నీ నేర్పు అద్భుతం వసంతా!" అన్నాడు.

"నాదేముందండీ. అంతా వారిదయ" అంది వసంత తన్మయత్వంలో.

"ఎవరిదయ" వినయ్ ఉలిక్కిపడి అడిగాడు.

"దేవుడండీ! మీలాంటి మంచి భర్తని నాకు గిఫ్ట్‌గా ఇచ్చిన ఆ దేవునిదయ" అంది వసంత.

'హమ్మయ్య! పొరపాట్న నీ మొదటి





భర్తని గుర్తుచేస్తున్నావేమోనని హడలిపోయా ను' అని మనసులో సమాధానపడ్డాడు వినయ్. ఇక వసంతని మాట్లాడనివ్వకూడదు. అసలే తిక్క సుందరి. ఈ మధురక్షణాలలో తన మొదటిభర్తని గుర్తుచేసినా చెయ్యొచ్చు అనుకొంటూ వసంత పెదవులను తన పెదవు లతో బంధించాడు వినయ్. ఫ్యాన్ తిరుగుతు న్నా ఆ గదిలో వాతావరణం వేడిగా మారిపో యింది. కొన్ని నిమిషాల తర్వాత అక్కడి వాతావరణం మామూలు స్థితికొచ్చింది. వసంత తన తల్లోనుండి జారిపోయిన మల్లె చెండును మళ్లీ తల్లో పెట్టుకుంది. వినయ్ బాగా అలసిపోయి మగతగా కళ్ళు మూసుకు న్నాడు. వసంత లేచి వెళ్ళి హార్లిక్స్ కలుపుకొ చ్చింది. వినయ్ హార్లిక్స్ తాగి రిలాక్సయ్యి అక్కడ ఉన్న మ్యాగజైన్ తిరగేస్తున్నాడు. అతని భుజంమ్మీదే తలవాల్చి ఆ బుక్‌లోకి తొంగిచూస్తోంది వసంత. వినయ్ ఎక్కువ సేపు బుక్‌లోకి చూడటం వసంతకి ఇష్టంలేదు. వినయ్ దృష్టి మళ్ళించాలని,

"మల్లెపూలు కొనివ్వాలని మీకెందుకని పించింది'' వినయ్‌ని అడిగింది.

"దానిక్కూడా కారణం తెలుసుకోవాలా! మల్లెపూలకు, ఆడవారికి, ఫ్లస్ బెడ్‌రూంకి ఒక విధమైన కంబైన్డ్ సెంటిమెంట్ కదా అందుకే' అన్నాడు వినయ్.

"అయితే మాత్రం మరీ ఇంత చిన్నదండా తేవడం" అంటూ తన జడను ముందుకు వేసుకుంది వసంత.

"సింపుల్‌గా తల్లో పెట్టుకోడానికి ఆ మాత్రం చాలదూ!" అడిగాడు వినయ్.

"ఇంట్లోనే కదాండి! మీటరు పొడవు దండ తెచ్చినా జడ పొడవునా పెట్టుకొందును. పోన్లెండి! ఒక్కొక్కరికి ఒకో అభిరుచిమరి. నా మొదటి భర్తమాత్రం మల్లెపూలు తల్లో పెట్టుకో డానికే కాదు బెడ్‌మీద చల్లడానిక్కూడా తెచ్చే వా...!" అంటూ నాలుక్కొరుచుకొంది వసంత తన కళ్లని మరింత పెద్దవి చేస్తూ.

వినయ్ ఉసూరుమంటూ బెడ్‌మీద వెనక్కి వాలిపోయి, చేతితో కణతలు రుద్దుకుంటున్నా డు. అంతకుముందు అతనికున్న ఉత్సాహం కాస్తా విచారంగా మారిపోయింది.

"ప్లీజ్... ప్లీజ్... ప్లీజండీ! నన్ను క్షమించండి. నేను పాపిష్టిదాన్ని! దేవుడిలాంటి మీ హృదయాన్ని నా దరిద్రపు అలవాటుతో తూట్లు చేస్తున్న కిరాతకురాలిని, నా పాపానికి నిష్కృతిలేదు! నేను చచ్చిపోతాను... ప్రా ణంపోయే ఏదన్నా తేలికైన మార్గం చెప్పండి ప్లీజ్!" అంటూ చేతులు రెండూ మెడ చుట్టూ బిగించుకుంది వసంత.

ఆమె చేష్టలను వినయ్ గమనించడంలేదు. పైన తిరుగుతున్న ఫ్యాన్‌వైపు తీక్షణంగా చూ స్తున్నాడు. తనని పట్టించుకోవడం లేదని వసంత అతనికి దగ్గరగా జరిగి కళ్ళల్లో కళ్ళుపెట్టి చూడాలని ప్రయత్నించింది. వినయ్ తల పక్కకు తిప్పుకున్నాడు.

వెంటనే టీపాయ్ మీదున్న ఆపిల్స్‌కి గుచ్చి ఉన్న చాకు అందుకొంది వసంత.

"రసగుల్లాలా సున్నితమైన మీ మనసులో శాంతిలేకుండా చేసిన నా పాపానికి ఇదే తగిన శిక్ష. ఈ చాకుతో నా రాతిగుండెల్ని చీల్చుకొని నా రక్తంతో మీ కాళ్లు కడుగుతాను. ముక్కోటి దేవతలు అడ్డుపడినా సరే నేను బతకను. ఒక్కసారి ఇటు చూడండి'' అంటూ చాకు పైకి ఎత్తిపట్టుకుంది.

వినయ్ ఆమెను ఎంతసేపటికీ గమనించక పోవడంతో చాకు టీపాయ్‌మీద పారేసి వచ్చి బెడ్‌మీద కూర్చుంది వసంత.

"చచ్చిపోవడం పెద్ద కష్టం కాదనుకోండి! కానీ... నేను పోతే ఇక్కడ మీరు బతకలేరు. బతికినా నా కోసం కృంగి కృశించిపోతారని మీమీద జాలితో నా నిర్ణయం ఆఖరి నిము షంలో మార్చుకున్నానండీ'' అంటూ వినయ్ గడ్డం పట్టుకొంది వసంత.

వినయ్ లేచి కూర్చున్నాడు.

"వసంతా! నేను నీకెలా కనిపిస్తున్నాను?"



సీరియస్‌గా అడిగాడు వినయ్.

"లాల్చీ, పైజామాతో, ఉట్టిపడే మగతనంలో అచ్చు హిందీ సినిమా హీరోలా ఉన్నారండీ'' అంది వసంత.

"పిచ్చిగా మాట్లాడకు! నీకు జీవితమంటే చింతకాయ పచ్చడి కావచ్చు! కానీ నాకు జీవితం ఒక వరం. ఐలవ్‌మై లైఫ్! బతకాలి! జీవితాంతం ఆనందంగా, ఆదర్శంగా బతకాలి అని భావించే వాడిని నేను. నీలాంటి ఆర్డినరీ ఆడదానికి భర్తగా ఉంటూ నీవు తిక్కగా వాగేదల్లా భరించడానికి నేను పిచ్చివాణ్ణికాదు. బీకేర్‌ఫుల్!" అంటూ కోపంగా పలికాడు వినయ్.

"సారీ అండీ... ఇంకెప్పుడూ అలా అనను. మనం కొన్నాళ్ళు తీర్థయాత్రలు చేద్దామండీ, మనల్ని పట్టి పీడించే దుష్టశక్తులు వదిలిపోతాయి'' అంటూ వసంత వినయ్ చేతులు పట్టుకుంది.

"నిన్ను పట్టి పీడించేది దుష్టశక్తి కాదు! నీ అహంకారం. కనీస జీవన స్పృహ కలిగించలేని నీ పెంపకం. భర్తంటే ఆఫ్టాల్ అనుకొనే మూర్ఖత్వం" అన్నాడు వినయ్ ఆవేశంగా.

"ప్లీజ్! అంత మాటనకండీ... నాకూ బాధ్యతలమీద గౌరవం ఉంది. భర్తని గౌరవించలేని నీచురాలిని కాదు... కాకపోతే ఇడ్లీలో చెట్నీలాగ నాకో చిన్న దురలవాటది అంతే!" అంటూ తలదించుకుంది వసంత.

వినయ్ మాట్లాడకుండా మౌనంగా బెడ్ మీద వాలి ఒక పక్కకి ఒదిగిపడుకొన్నాడు.

"ఏమండీ... మన పెళ్లి క్యాసెట్ చాలా బావుందికదూ. పెళ్లిపీటలమీద నేను తల దించుకుని గమనించలేదుకానీ ప్రతి మూడు నిమిషాలకోసారి మీరు నావంక చూస్తూనే ఉన్నారు. దొంగ" అంటూ వినయ్‌మీద పడింది వసంత.

ఆమెను వెనక్కి తోసేసి ఒక తలదిండు, దుప్పటి తీసుకుని కింద నేలమీద పడుకున్నాడు వినయ్.

"అదేమిటండీ ఆడపిల్లలా అలా కోపగిస్తున్నారు! సమస్యలకి అలా దూరంగా పారిపోకూడదు. ధైర్యంగా ఎదుర్కోవడమే మగతనం" అంటూ ముసిముసిగా నవ్వుకొంది వసంత.

ఆ మాటకు వినయ్ రెండు సెకన్లు ఆలోచించి దుప్పటీ, దిండూ తీసుకుని మళ్లీ మంచంమీదకొచ్చి పడుకొని "నాకు నిద్రొస్తోంది. పిచ్చివేషాలేయకుండా పడుకో" అంటూ దుప్పటిని మీదకు లాక్కున్నాడు.

"ప్లీజ్! మీరు నా భర్త కనుక సిగ్గువిడిచి చెప్పేస్తున్నాను. మన పెళ్లయ్యాక మిమ్మల్ని హత్తుకుని పడుకొంటేనే కాని నాకు నిద్రావడంలేదండీ! పోన్లే మీకు మీ నిద్రేముఖ్యమనుకొంటే అలాగే పడుకోండి. నేనిలా తెల్లారేవరకూ కంటిమీద కునుకులేకుండా మేల్కొనే ఉంటాను'' అంది వసంత బాధను మిళితంచేసిన గొంతుతో.

కొన్ని నిమిషాల తర్వాత వినయ్‌కి వసంత వైపుగా తిరగక తప్పలేదు.

"హమ్మయ్య! ఏడుకొండలవాడా, వెంకటరమణా ఇలా మావారికి నామీద దయాదాక్షిణ్యాలు, కరుణాకటాక్షాలు ఉండేలా దయచేయి స్వామీ! మాకు ఖాళీ దొరికినప్పుడల్లా నీ కొండకి వచ్చిపోతుంటాం" అంటూ ఆనందంతో చేతులు రెండూ పైకెత్తి దణ్ణం పెట్టుకుంది వసంత.

★ ★ ★

"మావయ్యగారూ, మేం హైద్రాబాద్ వెళ్లే ముందు వసంత, నేనూ ఒకసారి రాజమండ్రి వెళ్ళి మా తల్లితండ్రులతో కూడా చెప్పివెళ్తే బావుంటుందని నా అభిప్రాయం" వెంకటరత్నంతో చెప్పాడు వినయ్.

"అలాగే బాబూ. టాక్సీ మాట్లాడతాను వెళ్లిరండి'' అన్నాడు వెంకటరత్నం.

"పెళ్లయ్యాక అత్తారింటికెళ్లేముందు అమ్మాయిని సారీ చీరెలతో పంపడం ఆనవాయితీ





బాబూ. ఒక్కరోజు ఆగారంటే అన్నీ సిద్ధం చేయిస్తాను'' అంది మంగతాయారు అక్కడికి వస్తూ.

"మా అమ్మా నాన్న విషయాలు మీకు చెప్పానుకదా అత్తయ్యా! నా పెళ్లికే వాళ్లు ఇష్టపడలేదు. ఇక సారె పట్టుకెళ్తే తీసుకుంటారా? అవన్నీ ఎందుకు? ఇద్దరమూ వెళ్లి కనిపించివస్తాం. మాకూడా బాపిరాజు వస్తాడు. మళ్లీ ఎల్లుండికి తిరిగొచ్చేసి, ఇక్కడ ఒకరోజుండి హైద్రాబాద్‌కి ప్రయాణమవ్వాలని నా ఉద్దేశం" అన్నాడు వినయ్.

మంగతాయారు ఏమీ మాట్లాడలేదు.

"మరి హైద్రాబాద్‌కి మీ అత్తయ్యను తీసుకెళ్లరా! అసలే మీది కొత్త సంసారం. పప్పుడబ్బా ఎక్కడ పెట్టుకోవాలి, ఉప్పుడబ్బా ఎక్కడ పెట్టాలిలాంటి ఎరేంజ్‌మెంట్సన్నీ ఆవిడే దగ్గరుండి చూస్తారు. లేకపోతే మీరు బెడ్‌రూంలో చింతపండు. కిచెన్‌లో చెప్పులు పెట్టేసుకొనే ప్రమాదముంది'' అన్నాడు బాపిరాజు.

"కొత్త దంపతుల మధ్య నేనెందుకయ్యా! వసంతకన్నీ తెలుసు. ఇంటిని ఎలా ఉంచాలి అని పోటీ పెడితే ఆంధ్రాలోనే దానికి ఫస్టొస్తుంది'' అంది మంగతాయారు.

"అవునత్తయ్యా. సుగర్‌డబ్బా పెట్టుకోడానికి కిచెన్‌లో చోటు చాలకపోతే నా నెత్తిమీద కూడా చాలా అందంగా అమర్చగలదు మీ అమ్మాయి'' అన్నాడు వినయ్.

ఆ మాటకు వెంకటరత్నంతో సహా అందరూ నవ్వేశారు.

"బాగానే చెప్పారు కానీ చిన్నమార్పు.నేను మీ నెత్తిమీద పెట్టేది సుగర్‌డబ్బాని కాదు. కారం డబ్బాని'' అంది వసంత వినయ్‌వంక చూస్తూ.

"కరెక్ట్. సుగరయితే తినేస్తాడు. నీవు చెప్పిందే కరెక్ట్'' అన్నాడు బాపిరాజు.

"ష్... తప్పమ్మా! భరించువాడు భర్తయినంతమాత్రాన లెఫ్ట్ అండ్ రైట్ మాట్లాడేయడమేనా! స్త్రీ జీవితాన్ని ఎయిటీపర్సెంట్ ప్రభావితం చేసేది భర్తేనమ్మా. భర్తని పూజించి గౌరవించగలిగేదే ఉత్తమ ఇల్లాలు. ఇది మన సంప్రదాయం కూడా'' అన్నాడు వెంకటరత్నం కూతుర్ని మందలించే ధోరణిలో.

"మరేం అనుకోకు బాబూ! వసంతకి ఇంకా చిన్నతనం పోలేదు. చెబితే నమ్మరుగానీ క్యాడ్‌బరీస్ చాక్లెట్లంటే ఇప్పటికీ పడిచస్తుందది'' అంది మంగతాయారు వినయ్‌ని సముదాయిస్తూ.

"ఇందులో బాధపడేదేముంది. నాచేత బెడ్‌రూంలో ఎలానూ సారీ చెప్పిస్తారు మీ అల్లుడుగారు. మరీ ఎలిమెంటరీ స్కూల్‌బాయ్ కాదులే మమ్మీ'' అంది వసంత నవ్వుతూ.

వసంత మాటకు మళ్లీ అందరూ నవ్వుకున్నారు.

"వసంతా! నువ్వు తయారవ్వు వెళ్దాం" అన్నాడు వినయ్.

"నేనెప్పుడూ తయారయ్యేవుంటాను. ఒక్క డ్రెస్ ఛేంజ్ చేసుకోవడం తప్ప'' అంది వసంత.

"నేను ఫోన్‌చేసి టాక్సీ పిలుస్తానమ్మా. మరీ వట్టి చేతులతో వెళితే బావుండదు. వాళ్లు తీసుకోనీ, తీసుకోకపోనీ నీ అత్తమామలకు బట్టలు పట్టుకెళ్లాలమ్మా! అవి కూడా తెప్పిస్తాను'' అంటూ వెంకటరత్నం హాలువైపుగా వెళ్లిపోయాడు.

అరగంటలో టాక్సీ వచ్చి ఇంటిముందు ఆగింది. వెంకటరత్నం ఒకచీర, పంచె, కండువా కొని ప్యాక్ చేయించుకొచ్చాడు. వసంత పెళ్లిచీర కట్టుకొని ఒక బ్రీఫ్‌కేస్‌నిండా కావల్సిన బట్టలు సర్దుకొని వచ్చింది. వినయ్, వసంత టాక్సీలో వెనుకసీట్లో కూర్చున్నారు. బాపిరాజు డ్రైవర్ పక్కన కూర్చున్నాడు.

"జాగ్రత్తమ్మా! వెళ్లిన వెంటనే మీ అత్తగారి కాళ్లకు నమస్కారం పెట్టడం మరచిపోకు. ఒకవేళ నీవక్కడ వంట చేయాల్సివస్తే అన్నీ నీవే స్వయంగా చూసుకో! చాలా వినయంగా

వుండాలి సుమా! బాబూ వసంత కాస్త పెంకిగా ప్రవర్తించినా మరోవిధంగా భావించకుండా జాగ్రత్తగా చూసుకో నాయనా'' అంటూ మంగతాయారు వసంతకి, వినయ్‌కి చెప్పి, అంతలోనే కళ్లనీళ్లు పెట్టుకుంది. వసంత కారులో నుండి కంగారు పడిపోయింది.

"వాళ్లు రేపు సాయంత్రానికల్లా ఇంటికొచ్చేస్తారు. ఏకంగా కాపురానికి పంపించేస్తున్నంత సెంటిమెంట్‌తో వర్రీ అయిపోవడం ఎందుకే తాయారు ఊర్కో'' అంటూ వెంకటరత్నం మంగతాయారుని ఓదార్చారు.

"అసలు మమ్మల్ని మా ఇంటిదగ్గర ఎవరూ ఆదరించకపోతే ఈ సాయంత్రానికే ఇక్కడకొచ్చేస్తాం. బాధపడకండత్తయ్యగారూ'' అన్నాడు వినయ్.

అందరి దగ్గరా వీడ్కోలు తీసుకొని కారులో ముందుకి కదలిపోయారు వసంత, వినయ్, బాపిరాజు.



"ఆంటీ! వినయ్ బావా, వాళ్లావిడా వచ్చారు'' అంటూ అనసూయ పరుగున కిచెన్‌లోకొచ్చి కళ్యాణమ్మతో చెప్పింది.

కళ్యాణమ్మ కంగారుతో తబ్బిబ్బయిపోయింది. ఏంచేయాలో తోచలేదామెకు. అంతకుముందే స్కూల్‌నుండి వచ్చిన సూర్యనారాయణ తన ఇంటిముందు కారు ఆగడం అందులో వినయ్, అతని భార్య ఉండటం చూసి ఆయన కిచెన్‌లోకి కంగారుగా వచ్చి,

"ఏం చెయ్యాలనుకొంటున్నావ్?" అంటూ కళ్యాణమ్మని అడిగాడు. కళ్యాణమ్మ ఏమీ మాట్లాడలేదు.

"ముందు వాళ్ళకి పసుపునీళ్లతో దిష్టితీసి లోనికి తీసుకురామ్మా'' అంటూ సూర్యనారాయణ అనసూయకి చెప్పాడు. అంతలో బాపిరాజు కిచెన్‌లోకొచ్చి అందర్నీ పలకరించి-

"వినయ్ భార్యతో వచ్చాడు. లోనికి రావడానికి మీ అనుమతికోసం'' అంటూ కళ్యాణమ్మతో అన్నాడు.

"సొంత ఇంట్లోకి రావడానికి అనుమతి అడగాల్సిన దౌర్భాగ్యానికి దిగజారేదన్న మాట. మా ఇంటి గుమ్మంముందు కొడుకే కాదు మరెవ్వరు నిలబడినా అవమానించే స్థాయికింకా మేం దిగజారలేదు. రావాలో పోవాలో వాడినే నిర్ణయించుకోమను'' అంటూ చాలా బాధగా చెప్పింది కళ్యాణమ్మ.

"సర్లే ఇపుడవన్నీ ఎందుకు? వాడి భార్య దృష్టిలో మనం ఆక్షేపణకి గురికావడానికా! నీకిష్టం లేకపోతే వాళ్లతో మాట్లాడకు. అంతే కానీ మరోవిధంగా నోరు పారేసుకోకు'' అంటూ సూర్యనారాయణ కళ్యాణమ్మని మందలించాడు.

"బయటవాళ్లలా నిలబడటం మిగతావాళ్లు చూస్తే బావోదు. వాళ్లని లోనికి తీసుకురా. నీవు కూడా వెళ్లు అనసూయా'' అంటూ సూర్యనారాయణ చెప్పాడు. అనసూయ ఒక పళ్లెంలో నీళ్లుపోసి అందులో కుంకుమపసుపు కలిపి చేతితో పట్టుకొని బయటికొస్తూ.

"బావున్నారా బావా! బావున్నావా అక్కా! రండి... లోపలికి రండి'' అంటూ పళ్లెంలో నీళ్లతో దిష్టితీసి ఆ నీళ్లు పక్కనున్న చెట్టుకింద పోసింది.

వినయ్ నవ్వుతూ వసంత చేయిపట్టుకొని లోపలికి వచ్చాడు. వెనుక బాపిరాజు సూట్‌కేస్ పట్టుకుని టాక్సీవాణ్ణి పంపించేసి అనసూయ వెనకాలే లోనికి వస్తూ.

"మరి నాకు దిష్టితీయవా?" అన్నాడు అనసూయనుద్దేశించి.

"నీకు పసుపు నీళ్లతోకాదు... ఉప్పు, ఎండిన మిరపకాయలతో తీసి పొయ్యిలో పడెయ్యాలి మరి'' నవ్వుతూ అంది వసంత.

హాలు మధ్యలో సూర్యనారాయణగారు గంభీరంగా నిలబడి వున్నారు.

"నమస్కారం నాన్నగారూ'' అంటూ వినయ్ వంగాడు. అతనితోపాటే వసంత కూడా ఒంగోని సూర్యనారాయణ కాళ్లకు నమ




స్కారం చేసింది.

"ఫర్వాలేదు లేవండి'' అంటూ ఇద్దర్నీ లేపారు సూర్యనారాయణ.

"అమ్మకి మేమిలా రావడం చాలా కోపంగా వుండొచ్చు. కానీ మేం ఇక్కడ వుండటానికి రాలేదు నాన్నా... మేం హైద్రాబాద్‌కి కాపురానికి వెళ్ళబోతున్నాం. ముందుగా మీతో చెప్పి వెళదామని వచ్చాం" అన్నాడు వినయ్.

"సరే! వెళ్లి ఒకసారి పలకరించి రండి కిచెన్‌లో వుంది'' అన్నాడు సూర్యనారాయణ. వినయ్ వసంతని తీసుకొని కిచెన్‌లో కొచ్చాడు. కళ్యాణమ్మ పప్పుచారుని తాళింపు పెడుతోంది. ఆ ఘాటుకి వసంత చిన్నగా దగ్గి,

"పప్పుచారు భలే కమ్మటి వాసనేస్తోందండీ'' అంది మెల్లిగా.

"ష్ నోర్మూయ్!" అంటూ వసంతని మందలించాడు వినయ్.

ఆ గుసగుసలు విని కళ్యాణమ్మ అటు తిరిగింది.

"అమ్మా బాగున్నావా? మీ కోడలు వసంత!" అంటూ వినయ్, వసంత వంగి ఆమె కాళ్లకు నమస్కారం చేశారు.

కళ్యాణమ్మ మాట్లాడకుండా మౌనంగా ఉండిపోయింది.

"అమ్మా! మేమిలా రావడం నీకు బాధ కలిగిస్తే నన్ను క్షమించు. మేం ఇంకో రెండురోజుల్లో హైద్రాబాద్‌లో కాపురం పెట్టడానికి వెళ్లిపోతున్నాం. మీతో చెప్పివెళదామని వచ్చాం. మేమిక్కడ ఉండటం మీకిష్టం లేకపోతే బయటకెళ్లిపోతాం" అన్నాడు వినయ్.

ఆ మాటకు కళ్యాణమ్మకు కళ్లల్లో నీళ్లు తిరిగాయి. మౌనంగా తలదించుకుంది. మరేం మాట్లాడలేదు.

"మీరలా బయట హాల్లో కూర్చోండి. నేను అత్తయ్యకు హెల్ప్ చేస్తాను'' అంది వసంత.

వినయ్ మెల్లిగా బయటకొచ్చేశాడు. వసంత చొరవకి కళ్యాణమ్మ ఆశ్చర్యపోయింది.

"అత్తయ్యా! టమోటాలు తరగమంటారా?" అంది అక్కడ వున్న కత్తిపీటను అందుకొంటూ.

"వద్దులేమ్మా. ఇలా పట్టుచీరలతో నీవు అవస్థ పడక్కర్లేదు. నీవెళ్లి గదిలో కూర్చో'' అంటూ పొడిగా మాట్లాడింది కళ్యాణమ్మ.

"ఫర్వాలేదత్తయ్యా! ఏం కూర చెయ్యాలో చెప్పి మీరెళ్లి అలా హాల్లో కూర్చోండి. ఇవన్నీ నేను చూసుకుంటాను'' అంది వసంత.

"అన్నీ చేసేశాను. ఇంకేం అక్కర్లేదు'' అంది కళ్యాణమ్మ.

"వాటర్‌ఫిల్టర్ బావుందత్తయ్యా! మా ఇంట్లోనూ ఇలాంటిదే వుంది. అరె! వెండిగిన్నె! దీన్తో మీ అబ్బాయికి చిన్నప్పుడు గోరుముద్దలు తినిపించారా అత్తయ్యా!" అంటూ వెళ్లి కప్‌బోర్డ్‌లో ఉన్న ఒక చిన్న వెండిగిన్నెను చేతిలోకి తీసుకుంది వసంత.

"లేదు! మా ఆయనకి అన్నప్రాసన చేశాను దాన్తో' అంది కళ్యాణమ్మ కొంచెం విసుక్కొంటూ.

ఆ మాటకు వసంత పకపకా నవ్వేసింది. 'బాధపడకుండా ఇలా నవ్వుతుందేంటీ పిచ్చిపిల్ల' అనుకొంటూ కళ్యాణమ్మ ఆశ్చర్యపోయింది.

"భలే కామెడీగా మాట్లాడతారత్తయ్యా మీరు! ఈమాత్రం కామెడీ మీ అబ్బాయికి లేదు అత్తయ్యగారూ'' అంది వసంత అక్కడ వేగించిన ఉన్న అప్పడాన్ని తింటూ.

"నా మాటలు నీకు కామెడీలా విన్పిస్తున్నాయా తల్లీ... అవున్లే వెనకటికేదో సామెత చెప్పినట్లు 'ఇల్లుకాలి ఒకాడేడుస్తుంటే సిగరెట్ ముట్టించుకోవచ్చా ఈ మంటతోనన్నాడడిగాడట' అలా వుంది నీ చందం. ఈ జిడ్డుగదిలో నీకెందుకు కానీ వెళ్లి మీ ఆయన పక్కన కూర్చోమ్మా! ఇక్కడ చేసుకోడానికి మాకింకా కాళ్లూ చేతులూ బాగానే పనిచేస్తున్నాయి''

అంది వెటకారంగా కళ్యాణమ్మ.

అంతలో అనసూయ అక్కడికొచ్చింది.

"అత్తగారికప్పుడే శ్రమ తగ్గించేస్తున్నావా అక్కా'' అంది వసంతతో నవ్వుతూ.

"శ్రమ తగ్గించాలనే ఉంది. కానీ... అలాంటి అవకాశమేదీ ఇవ్వడంలేదు అత్తయ్యగారు'' అంది వసంత.

"నీవెళ్లి గదిలో కూర్చో అక్కా కాఫీలు తెస్తాను'' అంది అనసూయ.

"అత్తయ్యకు మూడ్ బాలేనట్లుంది. మరోసారి మాట్లాడుకుందాం. నేనెళ్లి కాస్త రిలాక్సవుతాను. థాంక్స్ సిస్టర్' అంటూ అనసూయకు చెప్పి బయటకు వచ్చేసింది వసంత.

"ఛీ... ఛీ... ఛీ... హవ్వ! కొత్తచోట ముక్కూ మొహం తెలీని మనుషులమధ్య ఎంతెలా సిగ్గులేకుండా మాట్లాడేస్తుందో చూశావా! ఓర్నాయనో వాడి ఖర్మకు తగ్గట్టే దొరికింది టింగులాడి'' అంటూ నెత్తికొట్టుకుంది కళ్యాణమ్మ.

"సొంత అత్తారింట్లో కొత్త మనుషులెవరుంటారు ఆంటీ... కోడలిగా ఆమాత్రం చొరవ ఆమెకుండదా!" అంది అనసూయ.

"చాల్లే! ఒకసారి ముండమోసింది మళ్లీ నాకు కోడలా! ప్రతి అడ్డమైన వాళ్లకూ పవిత్ర



ష్మైన ఈ ఇంట్లో అర్హత ఉండదు. అది తెలీక పిచ్చిగా ప్రవర్తిస్తోందది'' అంది కళ్యాణమ్మ ఉక్రోషంగా.

"అవేం మాటలత్తయ్యా ఊర్కో! ఆమె విన్నా... వినయ్ బావ విన్నా బాధపడతారు. మీకిష్టం లేకపోతే ఒక్కక్షణం ఇక్కడ ఉండమని వాళ్లు చెబుతున్నారుకదా. ఇంట్లోకి రమ్మని ఇలా తిడ్తే ఏం బావుంటుంది? పైగా ఆ అమ్మాయి బాగా చదువుకుంది. మన ఆలోచల్ని చూపుల్తో పసిగట్టేస్తుంది. కాస్త ఓపిక పట్టు ఆంటీ ప్లీజ్!" అంది అనసూయ కళ్యాణమ్మ చేతులు పట్టుకొంటూ.

కళ్యాణమ్మ శాంతించింది. అనసూయ కాఫీ తయారుచేసి గ్లాసుల్లో పోసి హాల్లోకి పట్టుకొచ్చింది. అందరూ కాఫీలు తాగారు. "స్నానం చేద్దువురా అక్కా'' అంటూ వసంతని అనసూయ తీసుకుపోయింది. వసంత స్నానంచేసి వచ్చాక, వినయ్, బాపిరాజు కూడా స్నానాలు ముగించారు. అందరూ టి.వి. ముందు కూర్చుని ప్రోగ్రామ్స్ చూస్తున్నారు. భోజనం టైంకి అందరూ డైనింగ్‌టేబుల్ చుట్టూ కూర్చున్నారు.

"అందరమూ కూర్చుంటే వడ్డించేదెవరు?" ప్రశ్నించింది వసంత.

"నేనున్నానుకదా అక్కా నో ప్రోబ్లమ్! ఆఖర్న నేనూ ఆంటీ తింటాం" అంది అనసూయ ప్లేట్లను సర్దుతూ.

"అదేం కుదర్దు. ఈ ఇంటి ఏకైక కోడల్ని నేనే అందరికీ వడ్డిస్తాను. నువ్వు కూడా కూర్చో చెల్లీ'' అంది వసంత చీరకొంగును నడుం దగ్గర దోపుకుంటూ.

వసంతతో వాదించలేక అనసూయ కూడా భోజనానికి కూర్చుంది.

వసంత మాటల్ని దూరంగా గుమ్మానికి చేరబడి నిల్చుని ఉన్న కళ్యాణమ్మ వింటోంది.

'ఆహా! చొరవకేం తక్కువలేదు టింగులాడికి. లోకువిస్తే నెత్తికెక్కి కూర్చునేలా వుంది. ఈ ఇంటి కోడలంట! పెద్ద పతివ్రతలా!' అని మనసులో అనుకొంటూ కుతకుతలాడిపోతోంది కళ్యాణమ్మ.

"చూడమ్మా! మా ఇంటికోడలిగా మాకు వడ్డించి మెప్పించడం గొప్పకాదు. మీ అత్తగార్ని మెప్పించాలి అది గొప్ప'' అన్నాడు సూర్యనారాయణ.

"థాంక్స్ మావయ్యగారూ... అందరూ మీలా ఆప్యాయంగా వుండలేరుకదా! కొందర్ని మెప్పించడం చాలా కష్టం" అంది వసంత.

ఆ మాటలు విన్న కళ్యాణమ్మకి కోపం తలకెక్కింది.

ఈయనొకడు. తందాన తానా మేళం. సిగ్గూశరం లేదు. దాని మాటలకు ఐసయిపోతున్నాడు. పైగా నేను మనసు మమతలేని కటికదాన్ననుకొంటోందీ పిచ్చిమాలోకం' అని మనసులో అనుకొంటూ ఊగిపోయింది కళ్యాణమ్మ.

అందరూ భోజనాలు ముగించాక వసంత కళ్యాణమ్మ దగ్గరకొచ్చి.

"అత్తయ్యా మరి మీకు కూడా వడ్డించమంటారా!" అంది.

"నాకు ఊహ తెలిసినప్పట్నుండి నా చేతులతో పెట్టుకు తింటున్నాను. నాకు వేరొకరు వడ్డించే ఖర్మ అక్కర్లేదు'' అంటూ కళ్యాణమ్మ అక్కడనుండి కిచెన్‌లోకి వెళ్ళిపోయింది.

అనసూయ అక్కడికొచ్చి వసంతతో.

"అక్కా ఈరోజు శుక్రవారంకదా ఆంటీ ఒక్కపూటే భోంచేస్తుంది. ఈ రాత్రంతా ఉపవాసముంటుందిలే. నీవురా తిందువుగాని'' అంటూ వసంతని డైనింగ్ టేబుల్ వద్దకు లాక్కెళ్లి కొసరికొసరి వడ్డించింది అనసూయ.

"అక్కా! మీకు పక్క ఇంట్లో వెయ్యమంటారా? లేక మేడమీద పడుకుంటారా?" అంది అనసూయ.

"నాకు ఎనిమిదిగంటలవరకూ లేచే అలవాటులేదు. మేడమీదయితే తెల్లారాక చుట్టుపక్కలవాళ్లు చూడరూ'' అంది ఆందోళనగా వసంత.

"చుట్టుపక్కల పెద్ద పెద్ద అపార్ట్‌మెంట్సేవీ లేవులే అక్కా! అసలే వేసవికాలం హాయిగా ఆరుబయట పడుకుని నిద్రొచ్చేవరకూ చుక్కలు లెక్కపెట్టుకుంటూ, చందమామని చూస్తూ ఎంజాయ్ చెయ్యొచ్చు!" అంది అనసూయ చిరునవ్వుతో.

"అయ్యో ఖర్మ! పక్కన భర్తుంటే చుక్కలు లెక్కపెట్టనిస్తారా సిస్టర్! నీకు పెళ్లికాలేదు కనుక ఆ తిప్పలు నీకు తెలీవులే' అంది వసంత చిలిపిగా.

ఆ మాటకు అనసూయ సిగ్గుపడిపోతూ "ఛీ ..." అంటూ, "అక్కా! ఇక్కడొక వారంరోజులు వుండకూడదూ'' అంది అనసూయ.

"మా అత్తగారు నన్నొకపూట కూడా ఇక్కడ వుంచేలా కన్పించడంలేదు. పైగా మాకంత టైంలేదు. రేపు రాత్రికి మా ఇంటికెళ్లి ఆ తర్వాత హైదరాబాద్ వెళ్లిపోవాలి'' అంది వసంత.

"మీ పెళ్లి మా ఆంటీకి ఇష్టంలేక అలా మాట్లాడుతోంది కానీ ఆవిడలాంటి మనిషికాదు అక్కా. నీవు బాధపడకు. వినయ్ బావతో కూడా ఆ విషయాలు చెప్పకు ప్లీజ్' అంది అనసూయ.

"నాకు తెలుసు సిస్టర్! ఆయనతో ఎందుకు చెబుతాను. ఇక్కడ ఎవరెవరు ఎలాంటివారో నాకు ముందే తెలుసు కనుక నేను బాధపడను. అన్నట్టు బాపిరాజుగారితో నీ పెళ్లి సెటిల్ అయి నందుకు 'కంగ్రాచ్యులేషన్స్' మావారు చెప్పారు నీ గురించి'' అంటూ అనసూయని అభినందించింది వసంత. మళ్లీ తానే మాట్లాడుతూ,

"మీ బావను నేను పెళ్లాడినందుకు నా మీద నీకు ఈర్ష్యగా లేదూ'' అంది.

"అదేమిటక్కా! ఎవరి అదృష్టం వారిది. నేను ఈర్ష్య పడినంతమాత్రాన బావ నన్ను మళ్లీ పెళ్లి చేసుకోడుకదా! నేను నీకు అలా కన్పిస్తున్నానా అక్కా'' అంది అనసూయ చిన్నబుచ్చుకొంటూ.

"సరదాకన్నాను. అయామ్‌సారీ! ఫర్‌గెటిట్!" అంటూ అనసూయ తలవెంట్రుకలను సవరించింది వసంత.

ఆ రాత్రి చాలాసేపు ఒక్క కళ్యాణమ్మ తప్ప మిగతావారంతా సరదాగా కబుర్లు చెప్పుకొని నిద్రపోయారు. ఆ మర్నాడు టాక్సీని రప్పించుకొని పాలకొల్లు బయలుదేరడానికి సిద్ధమయ్యారు వినయ్, వసంత. బాపిరాజు కొన్నాళ్లు సూర్యనారాయణగారి వద్దే ఉండి వినయ్ హైద్రాబాద్‌లో సెటిల్ అయ్యి ఉత్తరం




ప్రాశాక వస్తానని ఈలోగా తన ఊరుకూడా వెళ్లి అనసూయతో తన పెళ్లి విషయం తన వాళ్లతో సంప్రదిస్తానని చెప్పాడు. అందరివద్దా వీడ్కోలు తీసుకుని వినయ్, వసంత టాక్సీలో బయలుదేరారు.



వినయ్, వసంత రావడం చూసి మంగతాయారు పరుగున హాల్లోకొచ్చింది. అక్కడే వెంకటరత్నం పేపరు చదువుకొంటున్నాడు.

"రామ్మా రా... ప్రయాణం బాగా జరిగిందా?" అడిగాడు వెంకటరత్నం.

"బాగానే జరిగింది డాడీ... టాక్సీకదా కొంచెం తలతిరిగినట్లయ్యింది అంతే" అంది వసంత.

"వచ్చేశావా తల్లీ! ఒక్కరోజు నీవు లేకపోయేసరికి నాకు పిచ్చెక్కినట్లయ్యిందమ్మా. మీ అత్తమామలునీతో ప్రేమగామాట్లాడారా? బాగా చిక్కిపోయావమ్మా'' అంటూ దుఃఖాన్ని తెచ్చిపెట్టుకుంది మంగతాయారు.

"చూడు తాయారూ!సెంటిమెంట్ క్కూడా ఒక హద్దుంటుంది. అమ్మాయేమన్నా సంవత్సరాల తర్వాత వచ్చిందా చిక్కినట్లు కనిపించడానికి. లేనిదల్లా ఒక్కరోజు మనింట్లో' అంటూ మంగతాయారు మీద చిరాకుపడ్డాడు వెంకటరత్నం.

"ఒక్కరోజుకే ఇలా కంగారుపడితే రేపు మేం పండగలకూడా రాకుండా ఉంటే ఏం చేస్తారత్తయ్యా'' అన్నాడు వినయ్.

"అయ్యో అంతమాట అనకు బాబూ... 'రంజాన్' పండగ మనది కాకపోయినా ఆరోజు సెలవుంటే మీరిద్దరూ నాకళ్ల ముందుండాలని కోరుకునే మనిషిని నేను'' అంది మంగతాయారు.

"సరదాకన్నాను అత్తయ్యా! మీరు బెంగపడాల్సిన పనిలేదు. మీరు కూడా మాతో ఉండాల్సిందే'' అన్నాడు వినయ్.

"నాకూ అలాగే వుంది కానీ నేను ఒక్కపూట కన్పించందే మీ అంకుల్ టీ కూడా తాగలేరు బాబూ. మా అనుబంధం అలాంటిది. ఒకసారి తప్పనిసరయి ఒకరోజు మా పుట్టింటికెళ్లినందుకే ఆయన" అని మంగతాయారు అంటుండగా.

"ఊఁ... నువ్వు సెంటిమెంట్కి ఎమోషన్ కూడా జతచేసి మన రొమాంటిక్ ఎఫైర్ని వాళ్ళకి చెప్పేసి నన్ను ఇబ్బంది పెట్టేటట్టున్నావుగానీ కాస్త కంట్రోలవ్వు'' అన్నాడు వెంకటరత్నం.

ఆ మాటకు వినయ్, వసంత ముసిముసిగా నవ్వుకుంటూ తమ గదికేసి వెళ్లిపోయారు. ప్రయాణంతో బాగా అలసిపోయారేమో ఓ గంట నిద్రపోయారు. ఆ రాత్రి భోజనాలు చేస్తూ రాజమండ్రి విషయాలు మాట్లాడుకున్నారు. తనని వాళ్లెంతో గౌరవించారని వసంత తల్లికి చెప్పింది. రేపు ఒక్కరోజు ఉండి హైదరాబాద్ వెళ్లిపోతామని వినయ్ చెప్పాడు. సరే ఏర్పాట్లన్నీ చేస్తానన్నాడు వెంకటరత్నం. ఒక్క వారంరోజులు అత్తగారు తమ వద్ద ఉండేటట్లు ఆవిడను వినయ్, వసంత ఒప్పించారు. ఆ మర్నాడు మంగతాయారు చాలా పిండివంటలు చేసి ప్యాక్ చేయించింది. ఆవకాయ కూడా పెద్ద పెద్ద సీసాల్లో సర్దించింది. కత్తిపీట దగ్గర్నుండి కాయగూరల బుట్టవరకూ కొత్త కాపురానికి కావలసిన వస్తువులన్నీ రెడీ చేయించింది.

"అన్ని సామాన్లు ఎందుకత్తయ్యా?" అని వినయ్ అడిగాడు.

"అయ్యో అవి వసంత సమర్తకీ, బర్త్‌డేలకీ వచ్చిన సామాన్లలో సగమే నాయనా- అలమారల్లో ఇంకా బోలెడన్ని వున్నాయి'' అంది మంగతాయారు.

ఆరాత్రి వినయ్, వసంత తమ గదిలో...

"ఎప్పుడో పండగలకి పబ్బాలకి వస్తే తప్ప ఈ రాత్రితో మనకీ, ఈ బెడ్‌కీ రుణం తీరిపోయినట్లేనండీ'' వినయ్ పక్కకి జరుగుతూ అంది వసంత.

"ఈ బెడ్ నీకంత ఇష్టమయితే హైద్రాబాద్‌కి రప్పించుకో'' అన్నాడు వినయ్.

"అక్కడికి వేరే కొత్తది కొన్నారట. ఇది ఫుల్‌డబుల్ కాట్ కదా. అక్కడ కంఫర్టబుల్‌గా వుంటుందని రెండు సింగిల్‌కాట్‌లు కొనమన్నాను. ఆ రెండూ జాయింట్‌చేస్తే డబుల్‌కాట్. ఎలా వుంది నా ఐడియా'' అంది వసంత వినయ్ ఛాతీమీద చేతులువేస్తూ.

"ఎప్పుడన్నా కోపగిస్తే వేరేగా పడుకోవచ్చని నీవు చేసుకున్న ఏర్పాట్లవి. నాకు తెలీదనుకోకు నీ ఐడియా సంగతి'' అంటూ వసంత బుగ్గగిల్లాడు వినయ్.

"ష్...! అబ్బా ఏంటది?" గోముగా అంది వసంత.

"పాలకోవాలా మెరుస్తున్న నీ బుగ్గను కొరకాలనిపించింది. అలా చేస్తే అరుస్తావని సరదాగా గిల్లాను'' అన్నాడు వినయ్ ఆమెను మీదకు లాక్కుంటూ.

"అబ్బ! నొప్పి పెడతాయండీ ప్లీజ్! మీ అభిరుచులు క్లాసేకానీ, మీ సరసం మాత్రం పక్కా నాటురకం" అంది వసంత వినయ్‌ని ఏడిపించాలని.

"నీలాంటి అభిసారికలకు ఇలాంటి సరసమే సూటవుతుందని శృంగార గ్రంథాల్లో వ్రాశారు అందుకని'' అన్నాడు వినయ్ వసంత వీపుమీద చక్కిలిగింతలు పెడుతూ.

"మీరు సెక్స్‌బుక్స్ చదువుతారా?" ఆశ్చర్యంగా అడిగింది వసంత.

"నీ దగ్గర ఉన్నాయా పట్టుకురా... చదువుతాను'' బదులిచ్చాడు వినయ్.

"అబ్బా... అది కాదండీ చదివే అలవాటుందా... లేక ఎప్పుడైనా చదివారా అని నా ప్రశ్న'' బుంగమూతి పెడుతూ అంది వసంత.

"యూనివర్సిటీలో ఉండగా ఒకరిద్దరు ఫ్రెండ్స్ దగ్గరుంటే చూశాను. ఫారిన్ మ్యాగజైన్స్ కూడా చూశాను''

"మరి మీరు బ్లూ ఫిలిమ్స్ ఏవైనా చూశారా?" కుతూహలంగా అడిగింది వసంత.

"లేదు... ఇంతవరకూ చూడలేదు'' చెప్పాడు వినయ్.

"నేను చూశాను!!"

ఆ మాటకు వినయ్ గుండె లయ తప్పింది. "వ్వాట్'' అంటూ ఆశ్చర్యపోయాడు.

వినయ్ అవస్థకు వసంత ముసిముసిగా నవ్వుకొని...

"కంగారుపడకుండా వినండి! ఊర్కే ఆందోళన పడకండి. నేను కావాలని చూడలేదు!" అంటూ వినయ్ వంక చూసింది.

ఆమె ఏమి చెబుతుందాని వినయ్ ఆతృత పడుతున్నాడు. వసంత అసలే ఆటంబాంబు లాంటి ఆడది. ఎప్పటికీ కొత్త విషయాలతో పజిల్‌గానే మిగిలిపోయే అర్థంకాని మేధావి. అసలు ఆమె పల్స్ పట్టుకోవడమే సాధ్యపడటంలేదని ఆందోళన పడుతూనే మనసు కుదుట పెట్టుకొనే ప్రయత్నం చేస్తున్నాడు.

"ఏం లేదండీ! యూనివర్సిటీలో ఉండగా ఒకసారి నేను, మా రూమ్మేట్స్ కలిసి వరుసగా ఏవో సెలవులొస్తే బాగా బోర్‌కొట్టి రూంలోనే సినిమాలు చూద్దామని మా మేట్రిన్ పర్మిషన్ అడిగి వీడియో తెచ్చుకొన్నాం. రోజుకి రెండు సినిమాల చొప్పున ఆ సెలవుల మూడు రోజులూ చూద్దామని మా ఉద్దేశ్యం. పైగా మా మేట్రిన్ థియేటర్స్‌కి వెళ్లనివ్వదు. అందుకే వీడియోకి పర్మిషనిచ్చింది. ఒకరోజు స్వాతి ముత్యం, శృతిలయలు చూశాం. రెండోరోజు గీతాంజలి, ఘర్షణ చూశాం. మూడో రోజు




చిరంజీవి సినిమా చూద్దామని ఖైదీ, యముడికి మొగుడు క్యాసెట్స్ తెచ్చుకున్నాం. ఆ రోజు సాయంత్రం మేం ఖైదీ క్యాసెట్‌లో చిరంజీవి డాన్సులు చూడాలని కూర్చుంటే... మెదడులో నరాలు చిట్లిపోయేంత టెన్షన్... ఒక్కసారిగా ఒళ్లంతా భయంతో చెమటలు పట్టేశాయి మాకు. కొన్ని క్షణాలు ఏం చేయాలో తెలీక అలాగే గుడ్లప్పగించి చూసి... నేనే చొరవచేసి వెళ్లి టీవీ ఆఫ్ చేసేశాను. తర్వాత మా మేట్రిన్‌తో విషయం చెప్పి ఆ వీడియో లైబ్రరీ వాడిమీద పోలీస్ కంప్లైంట్ ఇచ్చి వాడి షాపు మూయించేసి వాడిని జైల్లోకి తోయించాం. అది చూసిన నాలుగు రోజులూ మేమంతా షాక్‌తో నీరసంగా ఉండిపోయాం. అదండీ నా బ్లూఫిలిం కథ" అంది వసంత వినయ్‌ని కొంటెగా చూస్తూ.

"హమ్మయ్య!" అనుకొంటూ మనసులో టెన్షన్ తగ్గించుకొని పక్కనున్న తలదిండుకి చెమటలు తుడుచుకున్నాడు వినయ్.

"ఏమిటండీ డల్‌గా అయిపోయారు! సారీనండీ... నా గురించి మరోవిధంగా భావించకండి. ఏమిటో... నా మనసులో ఏమున్నా దాగదు. అలా దాచుకోలేనండీ. నా జీవితంలో జరిగిన ఏ సంఘటనయినా సరే సమయానికి గుర్తొస్తే చాలు నా నోటినుండి బయటపడిపోతుంది. అదొక్కటే నా వీక్‌నెస్! ఇలా ఫ్రాంక్‌గా మాట్లాడటం తప్పంటారా!" వినయ్ గడ్డాన్ని పట్టుకుని తనవైపు తిప్పుకుంటూ అడిగింది వసంత.

వినయ్ మాట్లాడలేదు. ఆలోచిస్తున్నాడు. వసంతతో జీవితం ఒక సస్పెన్స్ థ్రిల్లర్. కొన్ని క్షణాల్లో ప్రమాదాన్ని సృష్టించి మరుక్షణంలో రక్షించుకోగలదు. ఆమె నవ్వినాసరే దాని అర్థాన్ని స్పష్టంగా చెప్పలేం. అది వెటకారమా లేక వెక్కిరింతా, అమాయకత్వమా! జవాబు చెప్పడం కష్టం. అవును ఆమె చెప్పినట్లు మనసులో ఏమీలేకుండా ముక్కుసూటిగా మాట్లాడటం మంచిదేగానీ ఆమె మాట్లాడే ప్రతిమాటా ఒక్కో బులెట్‌లా తన గుండెల్లో దిగబడిపోతుందనేదే బాధాకర విషయం. ఇలా పరిపరి విధాల ఆలోచిస్తూ నుదిటిమీద చేయిపెట్టుకుని సీలింగ్‌వైపు చూస్తున్నాడు వినయ్.

"అబ్బా! ఎందుకండీ ప్రతి విషయానికీ కొంపలంటుకుపోయినట్లు బాధపడతారు. ఆ విషయాలు మరచిపోయి ఇటు తిరిగి పడుకోండి" అంటూ వినయ్‌ని పూర్తిగా తనవేపుకు తిప్పుకుంది వసంత.

★ ★ ★

"వసంత నా ప్రాణంతో సమానం బాబూ! నీ చేతుల్లో పెడుతున్నాను జాగ్రత్తగా చూసుకో బాబూ!" అంటూ వెంకటరత్నం వినయ్ చేతులు పట్టుకున్నాడు.

"అరెరే! ఏంటిది. వసంత మీకు కూతురయితే నాకు భార్య. మీకన్నా ఆమె పట్ల నాకే బాధ్యత ఎక్కువుంటుంది అంకుల్! ఆమెకేలోటూ రానివ్వను" చెప్పాడు వినయ్.

"చూడమ్మా! నీవు కొత్తకాపురంలోకి ఇల్లాలిగా వెళుతున్నావు. చాలా బాధ్యతలుంటాయి కనుక ఓపిగ్గా, వినయ విధేయతలతో భర్తను గౌరవిస్తూ కాపురం చెయ్యాలమ్మా. ఎంత చదువు, తెలివి తేటలున్నా సరే భర్త దగ్గర తలవంచుకోవడంలోనే భార్యగా నీ స్థానాన్ని పదిలపరచుకోగలవు. లేనిపోని గొప్పలకు పోయి భర్త దగ్గర నీ స్థానాన్ని కోల్పోకు. అలా జరిగితే జీవితంలో మనశ్శాంతి లేకుండా పోతావు. ఇదే తండ్రిగా నీకు ఆఖరిగా చెబుతున్న మాటలు. ఇకనుండి నీకు తండ్రీ, తల్లీ, భర్తా అన్నీ ఆయనే!" అంటూ వసంతని ఆప్యాయంగా దగ్గరకు తీసుకుని తలమీద చెయ్యేసి నిమిరాడు వెంకటరత్నం. అతని కళ్లల్లో నీళ్లు తిరిగాయి. వసంతక్కూడా కంటి నుండి కన్నీళ్లు జలజలారాలాయి. ఆ దృశ్యాన్ని చూసిన మంగతాయారు భోరున ఏడ్చేసింది. కొన్ని సెకనుల నిశ్శబ్దం తరువాత...

"కూతురంటే విపరీతమైన సెంటిమెంట్ మీ అత్తయ్యకు. మీతోపాటు వచ్చి ఒక వారం రోజులు మీకు తోడుంటుంది కనుక ఆమెను

కూడా శ్రద్ధగా చూసుకోబాబూ... అక్కడ మీ అత్తయ్య సెంటిమెంటల్‌గా ఎలాంటి రిస్క్ ఇచ్చినా తప్పుగా అర్థం చేసుకోకుండా నవ్వుతూ సర్దుకుపోవాలి బాబూ! లేకుంటే ఆమె హార్టయ్యి బాధపడిపోగలదు'' అంటూ వినయ్‌తో చెప్పాడు వెంకటరత్నం.

అంతలో వెంకటరత్నం దగ్గర పనిచేసే ఒకతను వచ్చి,

"సార్! సామాన్లతో మన లారీ హైద్రాబాద్‌కి బయలుదేరింది. మీరు చెప్పిన నంబర్‌కి ఫోన్ చేసి సామాన్లు రిసీవ్ చేసుకోమని చెప్పాను'' అని చెప్పాడు.

అంతలో ఒక మారుతీవ్యాన్ వచ్చి ఇంటి ముందు ఆగింది. కొన్ని సామాన్లు పట్టుకెళ్ళి పనిపిల్ల ఆ వ్యాన్‌లో పెట్టింది.

"చూడు తాయారు అక్కడ నీకు బోర్ కొడుతోందని అస్తమానూ అమ్మాయితో కబుర్లేసుకుని మాత్రం వాళ్ల ఏకాంతానికి భంగం కలిగించకు. వారం రోజులేకదా కాస్త సెంటిమెంట్‌ని గ్రిప్‌లో పెట్టుకో' మంగతాయారుతో చెప్పాడు వెంకటరత్నం.

"వెళ్లొస్తాం మావయ్యా'' చెప్పాడు వినయ్.

"డాడీ... వెళ్లొస్తాను. మీ ఆరోగ్యం జాగ్రత్త! నాకు బెంగ తిరిగినపుడల్లా ఫోన్ చేస్తాను'' చెప్పింది వసంత.

"అలాగే జాగ్రత్తగా వెళ్లిరండి. విష్ యూ హేపీ జర్నీ'' అంటూ వెంకటరత్నం చేయి ఊపాడు. వినయ్, వసంత, మంగతాయారు వ్యాన్‌లో కూర్చున్నారు. వ్యాన్ ముందుకు కదలి మెయిన్‌రోడ్డు మీదగా వెళ్లిపోయింది.

★ ★ ★

హైద్రాబాద్‌లో ఉదయం ఏడు గంటలకు వ్యాన్ ఆగింది. వారికోసమే ఎదురు చూస్తున్న వెంకటరత్నం సోదరుడు చలపతిరావు వినయ్‌కి, వసంతకి, మంగతాయారుకి స్వాగతం చెప్పి ఇంట్లోకి తీసుకొచ్చాడు. చలపతిరావు భార్యా పిల్లలు వసంతకి, మంగతాయారుకి బాగా తెలుసుకనుక ఆప్యాయంగా కలిసిపోయారు. వినయ్‌ని చలపతిరావు తన భార్యా పిల్లలకు పరిచయం చేశాడు. తర్వాత వినయ్ వసంతలకు కేటాయించిన పోర్షన్‌లోకి తీసుకెళ్లి ఇల్లంతా చూపించాడు. ఆ రోజంతా సామాన్లు ఇద్దరు పనిమనుషుల్ని పెట్టి నీట్‌గా సర్దించాడు చలపతిరావు. భోజనాలయ్యాక బాగా అలసట వచ్చి వసంత, వినయ్, మంగతాయారు నిద్రపోయారు. ఆ మర్నాడు చలపతిరావు తన కుటుంబ సభ్యులతో కలసి హైద్రాబాద్ అంతా తిప్పి చూపించాడు. మూడు రోజులు కొత్తగా గడచిపోయాయి. వీలున్నప్పుడల్లా పాలకొల్లు నుండి వెంకటరత్నం చలపతికి ఫోన్ చేసి విషయాలు తెలుసుకుంటున్నాడు. చలపతిరావు పలుకుబడిగలవాడు కావడంతో వసంతకి ఒక ప్రైవేట్ కాలేజీలో ఎకనామిక్స్ లెక్చరర్‌గా ఉద్యోగం చూశాడు. వినయ్ తనకి రికమండేషన్ వద్దన్నాడు. అయితే నీవు కోరుకున్న ఉద్యోగం వచ్చేవరకూ కాలక్షేపం కోసం చెయ్యి' అంటూ మరో ప్రైవేట్ కంపెనీలో పర్సనల్ ఆఫీసర్‌గా ఉద్యోగం చేయడానికి వినయ్‌ని ఒప్పించాడు చలపతిరావు. రోజూ మీ ఇంట్లో తినడం మాకు ఇబ్బందికాదుకానీ వసంత సంసార బాధ్యతలు నేర్చుకోవాలికదా అంటూ చలపతిరావు భార్యని ఒప్పించి వసంతచేత తమ పోర్షన్లో వంటచేసే ఏర్పాట్లు చేసింది మంగతాయారు.

వసంత లెక్చరర్‌గా పని చేసే కాలేజి ఇంటికి బాగా దగ్గరకావడంతో కాలినడకనే వెళ్లడానికి ఇష్టపడింది. వినయ్ ఆఫీస్ కాస్త దూరం కావడంతో ఒక స్కూటర్ ఎరేంజ్ చేశాడు చలపతిరావు. వినయ్ తన కాపురం ప్రారంభమయ్యిందంటూ, తల్లితండ్రుల యోగక్షేమాలను విచారిస్తూ రాజమండ్రికి ఉత్తరం రాశాడు. అందులో తన ఇంటి అడ్రస్, ఆఫీస్ అడ్రస్‌కూడా రాశాడు. ఎక్కడికయినా సరే మీరు ఉత్తరాలు రాయండంటూ. తానొచ్చి వారం పైనే అయిపోయింది. అక్కడ నాన్నగా




రు ఇబ్బంది పడతారుమరి అంటూ మంగతాయారు వెళ్లిపోతానంది. వసంత ఫోన్లో తండ్రితో మాట్లాడి మరోవారం ఉండేలా పర్మిషన్ పొందింది.

"నాన్నగారికేం ఫర్వాలేదు. కానీ ఆయన్ని చూడకుండా నీవు ఉండలేవుకదూ మమ్మీ" అంది వసంత కొంటెగా.

"ఛీ ... నోర్మూయ్యవే! టైంకి పెద్దమ్మవాళ్లు భోజనమయితే పంపిస్తారు కానీ ఆయనతో సరదాగా మాట్లాడే వారెవరున్నారు చెప్పు. పైగా నేను లేకపోతే మన పనిపిల్ల అస్సలు వాకిలి కూడా తుడవదు. నన్నిలాగంటున్నావు కానీ ఇంకో రెండు నెల్లుపోతే నువ్వుకూడా మీ ఆయన్ని వదిలి ఒక్కరోజు కూడా వుండలేవు. చూస్తాకదా!" అంటూ వసంత నెత్తి మీద చిన్నగా మొట్టింది మంగతాయారు.

వసంత నవ్వేసింది.

ఎకనామిక్స్‌బుక్స్ మొత్తం రప్పించుకొని జూనియర్ ఇంటర్ సిలబస్‌కి నోట్స్ రాసుకొని కాలేజీలో చెబుతూ విద్యార్థులను బాగా ఆకట్టుకుంది వసంత.

వినయ్ కూడా పర్సనల్ ఆఫీసర్‌గా తన ఉద్యోగంలో బిజీ అయిపోయాడు.

వారం రోజులు పూర్తి కావడంతో వసంతకి ఎన్నో జాగ్రత్తలు చెప్పి చలపతిరావుకి, అతని భార్యకు వసంత, వినయ్ దంపతులను శ్రద్ధగా చూసుకోమని చెప్పి మంగతాయారు పాలకొల్లు వెళ్లిపోయింది.

★ ★ ★

వసంత కాలేజీ నుండి వచ్చి వంట చేసేసి టీవి చూస్తోంది. వినయ్ ఆలస్యంగా వచ్చాడు. రాగానే స్నానం చేసి భోజనం చేసి వసంత పక్కన కూర్చుని నిద్రవచ్చే వరకూ టీవి చూసి వెళ్లి బెడ్ మీద నడుం వాల్చాడు. వసంత చీరవిప్పేసి నైటీ తొడుక్కొని బెడ్ రూంలో కొచ్చింది. వినయ్ మగతగా కళ్లు మూసుకొని ఉండటం చూసి, వినయ్‌దగ్గర కూర్చుని అతని తలను తన ఒళ్లో పెట్టుకుని అతని కణతలను మర్దనా చేస్తూ...

"ఏం డల్‌గా వున్నారు! పనెక్కువగా ఉందా ఆఫీసులో" అంది వసంత.

"ఏం లేదు... ఇక్కడ ఎట్‌మాస్ఫియర్‌కి ఇప్పుడే అలవాటవుతున్నాం కదా కాస్త నలతగా వుందంతే" చెప్పాడు వినయ్.

వసంత సుతిమెత్తగా తన వేళ్లను వినయ్ తలమీద కదిలిస్తుండటంతో వినయ్‌లో కాస్త ఉత్సాహం పుంజుకుంది. వసంతవెళ్లి హార్లిక్స్ కలుపుకొచ్చి ఇచ్చింది. వినయ్‌కి నీరసం తగ్గినట్లనిపించి వసంతని దగ్గరకు తీసుకున్నాడు.

"ఎలా వుంది నీ జాబ్! లెక్చర్లిస్తున్నావా! లేక హరికథలు చెబుతున్నావా" అంటూ వసంత వంక కొంటెగా చూశాడు.

"నా లెక్చర్ మీరు వినలేదుకానీ... వింటే! నోర్మూసుకుని కూర్చోవలసిందే!" అంది వసంత.

"అంటే!" అడిగాడు వినయ్.

"పాఠం చెప్పడంలో నాకున్న టెక్నిక్ అలాంటిది. ఎన్నో ఉదాహరణలు చెబుతాను. జోక్స్ వేస్తాను. అందుకే అందరూ ఆనందంగా వింటారు. చాలామంది ట్యూషన్‌కి ఇంటికొస్తామంటున్నారు. మీకు డిస్టర్బెన్స్‌గా వుంటుందని నేనొప్పుకోవడంలేదు" అంది వసంత.

"ఒకరోజు వీలుంటే వచ్చి నేనూ నీ లెక్చర్ వింటాను" అంటూ వసంతని కౌగిలించుకొంటూ పక్కనున్న టేబుల్ వంక చూసి ఆశ్చర్యపోయాడు. వెంటనే వసంతని వెనక్కి తోసేశాడు. వసంత ఆశ్చర్యంగా మొహం పెట్టి ఆయన చూస్తున్న దిక్కుగా చూసింది. టేబుల్‌మీద ఒక ఫొటో అమర్చబడివుంది.

"ఎవరిదా ఫొటో" వినయ్ కోపంగా ప్రశ్నించాడు.

"ఓ.. అదా నేనూ నా మొదటి భర్తా అప్పట్లో తీయించుకున్న ఫొటో. మీకెప్పుడూ చూపించలేదుకదూ... ఇదిగో నేనూ ఆయనా!

పాపం చనిపోయి ఎక్కడున్నాడోకానీ చాలా గొప్పవ్యక్తి'' అంటూ ఆ ఫొటో తీసి వినయ్ చేతికిచ్చింది.

"వసంతా! నీకు పిచ్చెక్కిందా... ఏమిటీ పనులు!" గట్టిగా అరిచి ఫోటోని బెడ్‌మీదకి గట్టిగా విసిరాడు.

"ఎందుకండీ అలా గొంతు చించుకుంటారు. ఇందులో తప్పేం ఉంది! ఆయన్ని మీరెప్పుడూ చూడలేదుకదా! మీకు చూపించాలనుకున్నాను. పైగా ఈ రోజు ఆయన బర్త్‌డే. ఆయన జ్ఞాపకాలు గుర్తొచ్చి అలా టేబుల్ మీద పెట్టాను. దీనికే ఇంత రాద్ధాంతం చేస్తున్నారేంటి... పక్కన మా బాబాయ్ వాళ్లు వింటే మీ గురించి తప్పుగా అర్థం చేసుకుంటారు'' అంటూ రుసరుసలాడింది వసంత.

"ఫోర్మయ్ పిచ్చిగా వాగకు. ఈ ఫొటోని వాళ్లు చూస్తే నీ మొహంమీద ఉమ్మేస్తారు. లక్షణంగా నన్ను పెళ్లి చేసుకున్నాక కూడా నీ మొదటి భర్తని ఇంకా గుర్తు చేసుకున్నందుకు, బుద్ధి లేకుండా ప్రవర్తిస్తున్నందుకు'' అంటూ కోపంగా బెడ్ దిగి వెళ్లి చెయిర్లో కూర్చున్నాడు.

"మన గొడవల్లో వాళ్లంత వెర్రిగా ఇన్‌వాల్వ్ కారుకానీ మీరు వర్రీ అవకండి! మీకెందుకంత ఈర్ష్య, నాకు ఒకసారి పెళ్లయిందికదా! ఎప్పుడన్నా ఆయన్ని గుర్తు చేసుకొంటే ఎందు







కలా నా మీద విరుచుకు పడతారు! మీరెంతో ఆదర్శవంతులనుకొన్నాను. పైగా ఆయన చచ్చిపోయారు కదా! ఆయన మీకేం ద్రోహం చేశారు'' అంటూ కళ్లు తుడుచుకుంది వసంత.

"నీదంతా వితండ వాదం వసంతా! నీకెలా చెప్పాలో అర్థం కావడం లేదు! నీకు నేను భర్తని. నీ గతాన్ని మరచిపొమ్మని, అది నీకే మంచిదని చెబుతూనే ఉన్నాను. ఒకవేళ నీకు అతని జ్ఞాపకాలు గుర్తొస్తుంటే అవి నీలోనే వుంచుకో.. వాటిని ఇలా ప్రదర్శించడం బావోదు. ఎంతటి ఆదర్శవంతులైనా అలాంటివి సహించలేరు. ఇలా నీవు ప్రవర్తిస్తుంటే నీ మీదున్న ప్రేమకాస్తా పోగొట్టుకుంటావు. నీవు నా భార్యగా స్థానాన్ని కోల్పోయి కేవలం ఒక ఆడదానిగా మాత్రమే నాతో కాపురం చేయాల్సి ఉంటుంది. భర్తగా నా మీద నీకెంత హక్కుందో... నీ మీద నాకూ కొన్ని హక్కులుంటాయని గుర్తుంచుకో. జాగ్రత్తగా కాపురాన్ని నిలబెట్టుకోవడం ముఖ్యంగా నీకు చాలా మంచిది'' అంటూ ఆవేశంతోనే నెమ్మదిగా చెప్పాడు వినయ్.

"ఛీ .. ఆడదానిగా పుట్టడమే మహాపాపం. ఇలా సొంతంగా ఆలోచించుకొనే స్వేచ్ఛ కూడా లేకపోవడం నా దురదృష్టం" అంటూ ఆ ఫొటోని నేలకేసి కొట్టింది వసంత.

ఫొటోగ్లాస్ బద్దలయ్యి ఫొటో బయటపడింది. దాన్నందుకొని వసంత ముక్కలుగా చించేయబోతుంటే.

"చూడు ఆ ఫొటోని నీవు భద్రపరుచుకొంటానంటే నాకభ్యంతరం లేదు. నేను నీతో తగవుపడేది నీ మొదటి భర్తమీద ద్వేషంతో కాదు. నీ ముందు జీవితం మీద ప్రేమతో మాత్రమే'' అన్నాడు వినయ్.

అయినా వినకుండా వసంత ఆ ఫొటోని ముక్కలుగా చించేసింది. వెంటనే డబుల్ కాట్‌గా జాయింట్ చేసిన రెండు సింగిల్‌కాట్‌ల లోని ఒక బెడ్‌ని దూరంగా లాక్కొని దానిమీద పడి ముసుగు తన్నేసింది వసంత.

వినయ్ అరగంట పాటు కుర్చీలోనే ఉండి తర్వాత వచ్చి బెడ్ మీద వాలిపోయాడు. అలా రెండు రోజులు ఒకరితోఒకరు మాట్లాడుకోకుండా గడిపారు. వసంత భోజనం వండేసి తాను ముందు తినేసి డైనింగ్ టేబుల్ మీద వినయ్‌కోసం అన్నీ అమర్చేసి తాను అక్కడ ఉండకుండా మరో గదిలోకెళ్లిపోయేది. బెడ్‌లు రెండూ వేరువేరు కనుక ఎవరికి వాళ్లే కాసేపు చదువుకొని నిద్రపోయేవారు. వినయ్, వసంత ముభావంగా ఉండటం గమనించిన చలపతిరావు భార్య వసంత నడిగింది ఏమన్నా గొడవపడ్డారా! అని. అదేం లేదంది వసంత.

అయితే ఈ పూట మా ఇంట్లో భోంచే యండంటూ వినయ్‌ని, వసంతనీ పిలిచిందా విడ. వినయ్‌కి, వసంతకి వెళ్లక తప్పలేదు.

"ఏమండీ మనం మౌనంగా వుంటున్నా మని ఏదో కీచులాడుకున్నామనుకొందట మా చిన్నమ్మ'' అంది వసంత డైనింగ్ టేబుల్ కింద వినయ్ కాలుతొక్కుతూ.

"అబ్బే అలాంటిదేం లేదు ఆంటీ... ఎవరి పనులతో వాళ్లం బిజీగా వున్నాం అంతే'' అంటూ వసంత వంక కొరకొరా చూశాడు వినయ్.

"ఒకవేళ మీకు ఏవన్నా మనస్పర్థలొస్తే ఒకరినొకరు ద్వేషించుకోకండి. ధైర్యంగా నా దగ్గరకు రండి. నేను మీ సమస్యకి పరి ష్కారం చెబుతాను. మీరు చిన్నవాళ్లుకదా! ఆమాత్రం బాధ్యత మాకుంటుంది బాబూ! మరోవిధంగా భావించకండి, ఇలా అన్నానని'' అంది చలపతిరావు భార్య.

"అయ్యో మాకు అసలు గొడవలే లేవు చిన్నమ్మా! చూడు ఆయనకి నేను ముద్దు పెడితే ఎలా నవ్వుతారో' అంటూ ఒక స్వీట్ తీసి వినయ్ నోటి దగ్గరపెట్టింది వసంత.

వినయ్‌కి దాన్ని నవ్వుతూ తినక తప్పలే దు. అది చూసి చలపతిరావు పిల్లలు పెద్దగా నవ్వేశారు. చలపతిరావు భార్యకు థాంక్స్ చెప్పి తమ పోర్షన్‌లోకి వచ్చేశారు వినయ్, వసంత.

"ఛీ ... సిగ్గులేదు నీకు! యాక్టర్‌గా ప్రయ త్నించుంటే ఆలిండియాలో నెంబర్‌వన్ స్టార్ వయ్యుండేదానివి'' అన్నాడు వినయ్ వసంత తన భుజాలమీద వేసిన చేతులను తీసేస్తూ.

"మా చిన్నమ్మకు మనం దొరక్కూడదని అలా ప్రవర్తించానుకానీ లేకపోతే సంవత్సరా లైనా సరే నా అలక తగ్గదు'' అంది వసంత వినయ్‌ని ముద్దాడుతూ.

"వసంతా! భార్యాభర్తల అన్యోన్యం ఎలాంటిదో చూస్తున్నావుకదా ఇంకెప్పుడూ ఇలాంటి మధుర క్షణాలని పిచ్చిగా వ్యర్థం చేసుకోకు. జీవితం చాలా చిన్నది. ఒకరోజు మిస్సయినా అది తిరిగి మనకిరాదు'' అంటూ వసంతని దగ్గరకి తీసుకున్నాడు వినయ్.

రెండు నెలలు గడచిపోయాయి. ఒకసారి వెంకటరత్నం పనిమీద హైద్రాబాద్ వచ్చి వసంతని, వినయ్‌ని చూసి వెళ్లాడు. వినయ్ అడ్రస్‌కి ఒక శుభలేఖ వచ్చింది. విప్పి చూస్తే బాపిరాజు, అనసూయ కళ్యాణమహోత్సవం అని డేటూ వివరాలు ఉన్నాయి. పెళ్లి రాజ మండ్రిలో. శుభలేఖతోపాటు ఒక ఉత్తరం కూడా వుంది.

"వినయ్, వసంత దంపతులకు!

మీరు క్షేమమని భావిస్తాను. నా పెళ్లికి మా తండ్రి ఆనందంగా ఒప్పుకొన్నాడు. పెళ్లొక్కటే నాకు తగిన శిక్ష అని కూడా అన్నాడు. ఆర్థికంగా నేను బలహీనుణ్ణి కనుక మా పెళ్లి ఖర్చులన్నీ మా మావగారే భరిస్తున్నారు. మా పెళ్లికి ప్రత్యేక ఆహ్వానితులు మీరే కనుక నాలుగు రోజులు ముందుగానే రావలెను. వెంకటరత్నంగారు సతీసమేతంగా విచ్చేస్తాన న్నారు. తప్పకుండా రావలెను. పెళ్లి పనులతో బిజీగా వున్నాను.

శుభాకాంక్షలతో మీ బాపిరాజు

ఉత్తరం చదివి బాపిరాజు పెళ్లి అంటూ ఆనందంగా వసంతకి కార్డు, లెటర్ అందించా డు. వసంత చాలా ఆనందించింది. ఆ మర్నా డు అనసూయ కూడా వినయ్‌కి వసంతకి తన పెళ్లికి రమ్మంటూ రాసిన ఉత్తరం అందింది.

"ఏమండీ బాపిరాజుకి, అనసూయకి మనం ఏం గిఫ్ట్స్ పెడదాం" అంటూ వినయ్‌ని అడిగింది వసంత.

"అదేదో నీవే నిర్ణయించు'' అన్నాడు వినయ్.

తర్జన భర్జనలనంతరం బాపిరాజుకి బట్టల తోపాటు ఒక బంగారు ఉంగరం, అనసూయకి పట్టుచీరతోపాటు గోల్డ్‌చెయిన్ పెడదామని నిర్ణ




యించుకున్నారు.



"థాంక్స్ వసంతగారూ నా పెళ్లికి వచ్చినందుకు" బాపిరాజు ఆనందంగా చెప్పాడు వసంతతో.

"అయ్యో నా ఒక్కదానికేనా ఆయనకి చెప్పరే" అంది వసంత వినయ్‌ని చూపిస్తూ.

"వాడు నా పెళ్లికి గల్ఫ్‌లో ఉన్నా రావల్సిందే! కనుక వాడికి థాంక్స్ అనవసరం" అన్నాడు బాపిరాజు.

"ఆయనొస్తే నేను రాకుండా ఎలా ఉంటానండీ! సరే... అనసూయ ఎలా ఉంది" అంది వసంత

"పెళ్లి ముహూర్తాలు పెట్టుకున్నాక అనసూయని వాళ్లింటికి తీసుకుపోయారు వాళ్ల పేరెంట్స్. నేను వినయ్ వాళ్ల ఇంట్లోనే ఉంటున్నాను. నిన్ననే మా నాన్న, అక్క, బావ వాళ్ల పిల్లలు కూడా వచ్చి ఆ ఇంట్లోనే దిగారు. నా పెళ్లి పనులన్నీ మగపెళ్లి వాళ్లతరపున వినయ్ తల్లిగారూ, తండ్రిగారూ తమ సొంత కొడుకులా భావించి చేస్తున్నారండీ. నేను వారి రుణాన్ని ఈ జన్మలో తీర్చుకో లేను" అంటూ బాధగా తలదించుకున్నాడు బాపిరాజు.

కొన్ని క్షణాలయ్యాక.

"పెళ్లికి వచ్చి మీరిలా హొటల్లో దిగారని తెలిస్తే మీ అమ్మగారు బాధపడతారేమో" అన్నాడు బాపిరాజు వినయ్‌ని ఉద్దేశించి.

"ఏం ఫర్వాలేదు! నేను కవర్ చేస్తానులే. పైగా పెళ్లి వాళ్లతో ఇల్లంతా ఇరుగ్గా వుంటుందని ఊహించే మేం లాడ్జిలో దిగాం" అన్నాడు వినయ్.

"ఈ రాత్రికి మీ నాన్నగారు, మీ అమ్మగారు వస్తున్నారు. వారి కోసం ఈ లాడ్జిలోనే రూం బుక్ చేస్తాను. మీరొచ్చారని ఫోన్ చేస్తాను" అంటూ బాపిరాజు బయలుదేరబోయాడు.

"ఒరేయ్ అవన్నీ నాకు చెప్పు నేను చూసుకుంటాను. నీవు డబ్బులు ఖర్చుచేసుకోకు. ఏవన్నా కావలిస్తే నన్నడుగు" అంటూ వినయ్ బాపిరాజు భుజం తట్టాడు.

"ఇందులో నా ఖర్చేముందిరా! మా మావగారు ఖర్చులకని నాకు అడ్వాన్స్‌గా ఇరవై వేల రూపాయలిచ్చారు" అని చెప్పాడు బాపిరాజు.

"అయితే కట్నం ముందే తీసేసుకున్నారన్న మాట" నవ్వుతూ అంది వసంత.

"నేనడిగితే కట్నం అవుతుందండీ. అడక్కుండానే ఇచ్చారు కనుక కానుక అవుతుంది" అన్నాడు బాపిరాజు.

"ఏం ఫర్వాలేదులే మీ మామకి ఒక్కతే కూతురు. బాగానే కూడబెట్టాడు కూతురి కోసం" నవ్వుతూ అన్నాడు వినయ్.

"ఇక నేనెళతాను. ఈ రాత్రికే ముహూర్తంకదా మిగతా పనులు చూడాలి. అన్నట్టు నీ పెళ్లికి హెల్ప్ చేసిన ఫ్రెండ్సంతా నాకు వాళ్ల సాయశక్తులా పనుల్లో సహాయం చేస్తున్నార్రా. గిరి కళ్యాణమండపం ఎరేంజ్‌మెంట్స్, మోహన్ వంటలు, శేషగిరి షామియానాలు, వెంకట్ బ్యాండ్ మెయింటెయిన్ చేస్తున్నారు. వాళ్లంతా నిన్ను అడిగినట్లు చెప్పమన్నారు. సాయంత్రంపెళ్లి దగ్గర వాళ్ళందరికీ నా తరపున కృతజ్ఞతలు చెప్పు" అని చెప్పి వెళ్లిపోయాడు బాపిరాజు.

ఆ సాయంత్రానికి వెంకటరత్నం, మంగతాయారు వచ్చారు. రాగానే వినయ్‌ని, వసంతని ఆప్యాయంగా పలకరించి ఆనందపడ్డారు. బా

పిరాజు పెళ్లి కారణంగా అంతా కలుసుకున్నాం అంటూ మంగతాయారు చాలా ఆనందపడింది. బాపిరాజు పెళ్లయ్యాక పాలకొల్లు వచ్చి రెండు రోజులుండి వెళ్లమని వినయ్‌ని కోరారు. వినయ్ సరేనన్నాడు. అందరూ తయారయి ముహూర్తానికి అరగంట ముందుగా కళ్యాణ మంటపం చేరుకున్నారు.

వేదిక ముందు వేసిన కుర్చీల్లో పెళ్లికి వచ్చిన వాళ్లంతా కూర్చుంటున్నారు. సూర్యనారాయణగారు గుమ్మం దగ్గరుండి అందర్నీ ఆహ్వానిస్తున్నాడు. వినయ్‌ని, వసంతని చూసి తబ్బిబ్బయిపోయాడు. 'మా అత్తమామలు' అంటూ వెంకటరత్నంని, మంగతాయారుని పరిచయం చేశాడు వినయ్! సూర్యనారాయణ వారికి నవ్వుతూ నమస్కారం చేశాధు. వెంకటరత్నంని వేదికముందు వేసిన కుర్చీదాకా తీసుకెళ్లి కూర్చోబెట్టి కొంచెంసేపు మాట్లాడి వచ్చాడు సూర్యనారాయణ.

"ఆయన ఇంతకుముందే తెలుసా నాన్నా'' అన్నాడు వినయ్.

"అదే ఎక్కడో చూసినట్లుందే అని గుర్తు చేసుకొన్నాం. నీ పెళ్లికి ఒకసారి చూశానుకానీ మేం ముప్ఫయ్ ఐదేళ్ల క్రితం ఒక ట్రెయినింగ్‌లో కలిశాంలే' అది గుర్తుచేసి "మనమిలా వియ్యంకులు కావడం కూడా చాలా వండర్' అంటుండగా...

"ఏమండీ మీరు వచ్చేవాళ్లని ఆహ్వానించకుండా కబుర్లలోపడి..." అంటూ వినయ్‌ని చూసి కంగారుతో తలదించుకుని అక్కడి నుండి వెళ్లిపోయిందిమంగతాయారు

"సరే తర్వాత మాట్లాడుకుందాం" అంటూ సూర్యనారాయణ గుమ్మంవైపు వెళ్లిపోయాడు.

"మీ అమ్మగారు సట్టుచీరలో చాలా హుందాగా వుందండీ అచ్చం ఎమ్మెస్ సుబ్బలక్ష్మిగారిలా వుంది. చాలా ఉత్సాహంగా వుంది చూశారా!" అంది వసంత వినయ్‌తో.

"అవును నా పెళ్లితో ఏర్పడిన నిరాశను ఇపుడిపుడే మరచిపోతోందావిడ. బాపిరాజు పెళ్లి చేస్తూ నేను వాళ్లకి చేసిన గాయాన్ని మాన్పుకుంటున్నారు'' అన్నాడు వినయ్.

అంతలో ఫ్రెండ్స్ వినయ్‌ని వేదిక మీదకు తీసుకుపోయారు.

"అదిగో మా అత్తగారు'' అంటూ మంగతాయారుకి దూరంగా హడావిడిగా తిరుగుతున్న కళ్యాణమ్మని చూపించింది వసంత.

నీ పెళ్లప్పుడు నేను గమనించలేదుకానీ చాలా పద్ధతిగా వుందావిడ. నీ మావగారు కూడా చాలా గౌరవంగా ఉన్నారు'' అంది మంగతాయారు.

అంతలో బాపిరాజు పెళ్లికొడుకుగా మెరిసిపోతూ పీటలమీద కూర్చున్నాడు. అనసూయ పెళ్లి చీరలో బుట్టబొమ్మలా ఉంది. సిగ్గుతో నేల చూపులు చూస్తూ తల బాగా కుంచించుకుని పీటల మీద కూర్చుంది. ఎవరితోనో కబురంపి వసంతని కూడా వేదికమీదకు రప్పించుకుంది తనకి తోడుకోసం అనసూయ. పురోహితుడు పెళ్లితంతు ప్రారంభించాడు.

బాపిరాజు తండ్రి తాతబ్బాయ్ సూర్యనారాయణని వెదుక్కుంటూవచ్చి ఆయన పక్కన కూర్చున్నాడు.

"మా వెధవకి ఇంత ఘనంగా పెళ్లి జరిపిస్తున్నావు నీ ఋణం తీర్చుకోలేనిదయ్యా! చిన్నప్పుడు అల్లరిచిల్లరిగా తిరిగేవాడు. వాణ్ణి మందలించాలని కొట్టినా నవ్వేసేవాడు. నాకు వాడి నిర్వాకం చూసి ఏడుపొచ్చేది. ఒకసారి మాత్రం వాడిమీద బాగా కోపం వచ్చి కొట్టానని ఇంట్లోంచి పారిపోయి పదేళ్ల తర్వాత కనిపించాడు వాడు. ఆ రోజు ఎందుక్కొట్టానంటే వాడికప్పుడు పదకొండేళ్లు. ఒక కోతి పిల్లను తెచ్చి దాన్ని ఇంట్లో ఒక స్తంభానికి కట్టేసి అరటిపళ్లు తినిపిస్తున్నాడు. ఎందుకురా అదన్నాను. పెంచుకుందాం అన్నాడు. ఛీ నోర్ముయ్ వెధవా కుక్కనో, మేకనో, ఆఖరికి పందినో పెంచుకోవచ్చు కానీ కోతిని పెంచుకొంటే ఊళ్లో మనల్ని హీనంగా చూస్తారు దాన్ని వదిలెయ్యరా! అన్నాను. వాడు ససే




మిరా వినలేదు. నాకు ఒళ్లుమండి వాణ్ణి కొట్టాను అంతే ఇంట్లోంచి పారిపోయాడు. వాడి మీద బెంగతో వాళ్లమ్మ చనిపోయింది. తర్వాత పది పదిహేనేళ్ల తర్వాత కనిపించి ఎమ్మే చదువుతున్నానని చెప్పి నన్ను ఆశ్చర్యంలో ముంచేశాడు. అలా గాలికి పెరిగి ఇలా మీ చేతిలోపడి ఒకింటివాడవుతుంటే ఇది ముమ్మాటికీ మీ చలవేనండీ'' అంటూ సూర్యనారాయణ చేతులు పట్టుకున్నాడు తాతబ్బాయ్ కన్నీళ్లు తుడుచుకుంటూ.

"ఫర్వాలేదు ఊర్కోండి! మంచి వాళ్ళకెక్కడయినా ఆదరణ ఉంటుంది. పదండి అందరూ అక్షింతలు వేస్తున్నారు. మనం కూడా వేసివద్దాం అంటూ సూర్యనారాయణ లేచాడు. వెనుక తాతబ్బాయ్ కూడా లేచివెళ్ళి అక్షింతలు వేసివచ్చాడు.

పెళ్ళి అయిపోయింతర్వాత డిన్నర్ ప్రారంభమయ్యింది. వేదిక వద్దకు వెళ్ళి వధూవరులను అభినందించి గిఫ్టులు ఇచ్చి డిన్నర్ కెళుతున్నారు అందరూ. వినయ్, వసంత, తాము తెచ్చిన బట్టలు గోల్డ్‌రింగూ, చెయినూ, బాపిరాజుకి, అనసూయకి ప్రెజెంట్ చేశారు. "థాంక్స్ అక్కా, థాంక్స్ బావా'' అంటూ కృతజ్ఞతలు చెప్పుకుంది అనసూయ.

వెంకటరత్నం అయిదువేల రూపాయల చెక్ ఇస్తూ మీకు నచ్చిన వస్తువు కొనుక్కోండోయ్' అంటూ బాపిరాజు దంపతులను ఆశీర్వదించారు.

డిన్నర్ అయ్యాక వినయ్'వసంత, వెంకటరత్నం"మంగతాయారు బాపిరాజుని, సూర్యనారాయణని కలసి వీడ్కోలుచెప్పి లాడ్జికెళ్ళిపోయారు. తల్లితో మాట్లాడాలనుకున్నాడు వినయ్. కాని ఆమె ఆ అవకాశమివ్వలేదు.

★ ★ ★

బాపిరాజు ముంజేతికి మల్లెదండ చుట్టుకొని ముక్కు దగ్గరపెట్టుకుని గట్టిగా పీల్చాడు వెంటనే 'హాచ్చ్' అంటూ తుమ్మేశాడు. 'అరే పూలు నాకు ఎలర్జీకదూ మరచిపోయాను' అని మనసులో అనుకొంటూ డోర్ వంక ఆశగా చూస్తున్నాడు. కొన్ని నిమిషాల తర్వాత అనసూయ పాలగ్లాసుతో లోపలకి అడుగుపెట్టింది. అమ్మలక్కలు ముసిముసిగా నవ్వుకొంటూ ధడాల్న తలుపులు వేసి వెళ్ళిపోయారు. అనసూయ సిగ్గుపడుతూ తలుపు దగ్గరే నిలబడివుంది.

"రా అనసూయా! సిగ్గేస్తోందా... నీ సిగ్గుల పరదాలను తొలగించి చందమామలా నవ్వుతూ వచ్చి ఇలా కూర్చో'' అంటూ అనసూయని పిలిచాడు బాపిరాజు.

అమె రాలేదు అలానే నిలబడింది.

"పోనీ ఇంకో డైలాగ్ చెబుతాను వచ్చి నా హృదయంలో చిలకలా వాలిపో' అంటూ,

"నా హృధయ సామ్రాజ్ఞికి స్వాగతం! నా ముద్దు అనూ కి స్వాగతం. ఈ రాత్రి మనకి మరపురాని రాత్రిగా మిగిలిపోవాలి. అవసరమయితే అసలు తెల్లవారకుండా ఈ రాత్రి ఇలానే నిలచిపోవాలి. రా... అనూ! రా'' అంటూ పిలిచాడు బాపిరాజు.

అనసూయ పాలగ్లాసుతో ఒయ్యారంగా రెండడుగులు ముందుకు వేసింది. అంతలో కరెంట్ పోయింది. అంతా చీకటి,చిమ్మచీకటి.

అయ్యో ఇదేం ఖర్మరా బాబూ శుభమా అని శోభనం జరుపుకుంటుంటే అంటూ మంచంమీదనుండి లేచి "అనసూయా! అనసూయా!" అంటూ తడుముకుంటూ అక్కడ అమర్చి ఉన్న స్వీట్లు, పళ్ళు పెట్టిన పళ్లాన్ని తన్నేశాడు.

అవన్నీ కిందపడిపోయి పళ్లెం టంగ్ మంటూ చప్పుడు చేసింది.

"ఏమండీ ఎక్కడవున్నారు'' అంటూ అనసూయ బెంబేలెత్తుతూ బాపిరాజుకి గుద్దుకుంది.

ఆమె చేతిలోని పాలు బాపిరాజు మొఖంమీద బట్టలుమీద ఒలికిపోయాయి.

"ఓ మైగాడ్' అన్నాడు బాపిరాజు.

"సారీ అండీ చూసుకోలేదు" అంది అనసూయ బాధపడుతూ.

"ముందు... గుమ్మం ఏవైపుగా వుందో తెలిస్తే తలుపు కొట్టి క్యాండిల్స్ అడుగుతాను" అంటూ మరో రెండడుగులు వేసి ఒక అరటి పండుమీద కాలేసి జర్రున జారిపడ్డాడు బాపిరాజు.

"అయ్యో ఏంటండీ ఆ చప్పుడు. ఏమైంది!" అంటూ అనసూయ మరో అరటి పండుమీద కాలేసి బాపిరాజుమీద దబ్బుమంటూ పడిపోయింది.

"ఎంతో రొమాంటిక్‌గా మన శోభనం జరగాలని ఎన్నో కలలు కన్నాను. ఇలా గుడ్డివాళ్ళలా ఇబ్బందులపాలవుతామనుకోలేదు" అంటూ బాపిరాజు బాధగా అన్నాడు.

"ఈ రాత్రి ఎప్పటికీ మరచిపోకూడదన్నారు కదా... మరి నిజంగా ఈ అనుభవాన్ని ఎప్పటికీ మరువలేమండీ" అంది అనసూయ.

అంతలో కరెంట్ వచ్చి లైట్ వెలిగింది.

బాపిరాజు జుట్టంతా చిందరవందరగా, మొఖానికి స్వీట్లు, అరటిగుజ్జు అంటుకొని, పాలతో తడచిపోయిన బట్టలమీద మల్లెపూలు అంటుకొని వింతగా కనిపించేసరికి అనసూయ పకపకా నవ్వేసింది. అనసూయ మొఖానికూడా స్వీట్లు, బట్టలకి అరటిపళ్ళ గుజ్జు అంటుకొని ఆమె కూడా వింతగా వుండటంతో బాపిరాజు కూడా నవ్వేశాడు.

ఇద్దరూ ఒకరినొకరు శుభ్రం చేసుకున్నారు ఒక టవల్‌తో. అలా దగ్గరగా ఒకరినొకరు తాకుతూ, ఒకరి కళ్ళల్లోకి మరొకకరు చూసుకొంటూనే హత్తుకుపోయి అలానే మంచంమీద వాలిపోయారు.

★ ★ ★

పాలకొల్లులో రెండురోజులుండి హైద్రాబాద్ వచ్చేసిన వసంత, వినయ్, తమ విధుల్లో మునిగి బిజీ అయిపోయారు. అలా మరో నెల గడచిపోయింది. ఒకరోజు వసంత నీరసంగా వుందని కాలేజికి వెళ్ళలేదు. వినయ్ ఆమెను జాగ్రత్తగా చూసుకోమని చలపతిరావు భార్యకు చెప్పి ఆఫీసుకు వెళ్ళిపోయాడు.

"ఏమైందమ్మా డాక్టర్ని పిలవనా" అంటూ చలపతి భార్య పద్మావతి వచ్చేసరికి వసంత వాష్‌బేషిన్ దగ్గర వాంతులు చేసుకుంటోంది. పద్మావతివెళ్ళి వసంత తలపట్టుకొంది. కొన్ని నిమిషాల తర్వాత వసంత స్థిమితపడింది. పద్మావతి వాళ్ళ ఫామిలీ డాక్టరికి ఫోన్ చేసింది. ఆవిడ వసంతని పరీక్షించి "నెల తప్పిందంటూ" చెప్పింది. పద్మావతి సంబరపడిపోయింది. థాంక్స్ చెప్పి డాక్టరమ్మని పంపించేసింది

"వసంతా కంగ్రాచ్యులేషన్స్.. నేను ముందే ఊహించాను" అంటూ పద్మావతి వసంతని అభినందించింది.

వసంత మొహం ఆనందంతో మరింత కాంతివంతమైంది.

"ఈ శుభవార్త మీ అమ్మ వింటుంటే ఎగిరి గంతేస్తుంది. నేను ఫోన్ చేస్తాను. నీ నోటితోనే ఈ వార్త వాళ్ళకి చెప్పమ్మా" అంది పద్మావతి.

"వద్దు పిన్నీ ముందు వారికి చెప్పి ఆ తర్వాత ఆయనతోనే మా పేరెంట్స్‌కి చెప్పిస్తే బావుంటుందికదా" అంది వసంత.

"నిజమే! నీవు చెప్పినట్లే బావుంటుంది" అంటూ బత్తాయి ఒలిచి వసంతకిచ్చింది పద్మావతి.

సాయంత్రం వినయ్ వచ్చి 'ఎలా వుంది ఆరోగ్యం' అనడిగాడు.

కొద్దిసేపు మామూలుగా మాట్లాడి వినయ్ చెవిలో మీరు తండ్రి కాబోతున్నారని చెప్పింది వసంత. వినయ్ ఆనందంతో వసంతని గుండెలకు హత్తుకున్నాడు. వెంటనే మీ నాన్న గారికి కూడా చెబుతానంటూ చలపతిరావు ఇంట్లోకెళ్ళి ఫోన్ రింగ్ చేశాడు వినయ్. అవతలినుండి ఫోన్‌లో మంగతాయారు





హలో అంది.

"అత్తయ్యా నేను వినయ్‌ని. బావున్నారా అంకుల్ ఏం చేస్తున్నారు... మీకో శుభవార్త.. 'మీరు త్వరలో అమ్మమ్మ కాబోతున్నారు'" అన్నాడు వినయ్. కొన్ని నిమిషాలు అవతలి నుండి సమాధానం రాలేదు. బహుశా ఆనందంతో ఆవిడ వెనక్కి పడిపోయిందేమో అనుకొన్నాడు ఫోన్‌లో ఏదో చప్పుడయితే. తర్వాత వెంకటరత్నం లైన్లోకొచ్చి.

"హల్లో! చాలా సంతోషం అల్లుడూ! అమ్మాయి ఆరోగ్యం జాగ్రత్త. డాక్టర్ పర్యవేక్షణ చాలా అవసరం. ఇలాంటి శుభవార్త డైరెక్ట్‌గా చెప్పేసరికి మీ అత్తయ్య సెంటిమెంట్‌తో ఫెయింటయిపోయింది. ఆమె ఇంకా భోంచెయ్యలేదు. ఈ ఆనందంతో ఇవాళ రేపు కూడా తినదు. పాపం సెంటిమెంటల్ కదా! సరే అల్లుడూ మీ అత్తయ్యని పంపిస్తాను. వసంతకి కొన్ని జాగ్రత్తలు చెబుతుంది" అంటూ వెంకటరత్నం ఫోన్ పెట్టేశాడు.

వినయ్ తన తల్లితండ్రులకు కూడా వసంత నెలతప్పిందంటూ ఉత్తరం రాసి ఆ మర్నాడు పోస్ట్ చేశాడు. ఆరోజునుండి వసంతని ఎక్కువగా కష్టపడనీయకుండా వినయ్ కూడా కొన్ని పనులు స్వయంగా చేసుకుంటున్నాడు. రెండురోజులు పోయాక మంగతాయారు రకరకాల పిండివంటలు చేసుకొని పనిపిల్లను తీసుకుని హైద్రాబాద్ వచ్చేసింది. వసంతకి పనులు చేసి పెట్టడానికి పాలకొల్లునుండి వాళ్లింట్లో పనిచేసే అమ్మాయిని తీసుకొని వచ్చానని, ఇకనుండి నీవు పెద్దగా కష్టపడద్దని ఎన్నో జాగ్రత్తలు చెప్పింది మంగతాయారు.

★ ★ ★

"ఏమండీ! మీరు తాతకాబోతున్నారు!" అంటూ ఆనందంగా సూర్యనారాయణకి ఎదురొచ్చి ఉత్తరం ఇచ్చింది కళ్యాణమ్మ.

ఉత్తరం పూర్తిగా చదివి సూర్యనారాయణ కూడా ఆనందపడ్డాడు.

"పాపం! వాడిని అసహ్యించుకున్నానండీ పాపిష్టిదాన్ని! కోడలిముందు కూడా అలాగే ప్రవర్తించాను. ఆ ఉత్తరంలో శుభవార్త చదివాక నేనింతకాలం వాళ్ళమీద అన్యాయంగా పగతీర్చుకున్నానేమో అనిపిస్తోంది" అంటూ కన్నీళ్ళు పెట్టుకుంది కళ్యాణమ్మ.

"నువ్వు అసహ్యించుకున్నా వాడికింకా మనమీద ప్రేమ పోలేదు. నేను చెబితే మాత్రం విన్నావా! నీ ధోరణిలో నువ్వు ప్రవర్తించావు. ఇప్పుడు బాధపడుతున్నావు" అన్నాడు సూర్యనారాయణ.

"నేను వెంటనే వాడిని, కోడల్నీ చూడాలి! ఎంత కాదనుకున్నా వాడు నా కొడుకు, ఆమె నా కోడలు. వాళ్ళని మనింటికి పిలుద్దామండీ! సంవత్సరంక్రితం నా చేతితో వడ్డిస్తే తిన్నాడు వాడు. ఇన్నాళ్ళు వాడిని దూరంగా ఉంచిన పాపానికి నేనేదన్నా వ్రతం చేస్తాను. కానీ ముందు మీరు హైద్రాబాద్ వెళ్ళి వాళ్లని బతిమాలయినా సరే మనింటికి తీసుకురండీ! నాకెందుకో బుల్లిబుల్లి అడుగులేసుకుంటూ బుజ్జిబాబు మనింట్లో తిరుగుతున్నట్లనిపిస్తోంది" అంది కళ్యాణమ్మ.

"సరే! ఊర్కో నేను వెళ్ళి వాళ్ళని తీసుకొస్తాను" అన్నారాయన.

ఆ మర్రాడు సెలవుపెట్టి సూర్యనారాయణ హైద్రాబాద్ బయలుదేరాడు. మావగారిని సాదరంగా ఆహ్వానించింది వసంత. ఆ రాత్రి వినయ్ వచ్చి తండ్రిని పలకరించి మర్యాద చేశాడు. సూర్యనారాయణ జరిగిందంతా చెప్పి వినయ్‌ని, వసంతనీ ఒక వారంరోజులుండమని ఇంటికి ఆహ్వానించాడు. వసంత సరేనంది.

"వెళ్ళమ్మా మీ అత్తగారు మనసు మార్చుకొని ఆహ్వానిస్తుంటే కాదనకూడదు వెళ్ళు" అంటూ మంగతాయారు కూడా వసంతని ప్రోత్సహించింది.

వసంత, వినయ్, సూర్యనారాయణ రాజమండ్రి రైలులో బయలుదేరారు. రైలు దిగి

ఒక టాక్సీలో వచ్చి ఇంటిముందు దిగారు. కళ్యాణమ్మ ఒక చేత్తో కొబ్బరికాయ, మరోచేత్తో దిష్టి నీళ్ళు పట్టుకొని నవ్వుతూ కొడుకూ, కోడలికి ఎదురువచ్చి కొబ్బరికాయను ఇద్దరికీ దిష్టితీసి నేలకేసి కొట్టింది. తర్వాత దిష్టినీళ్ళతో కూడా దిష్టితీసి పచ్చని చెట్టుకింద పోసింది.

"రామ్మా! ఆరోగ్యం బావుందా! రా... ముందు కుడికాలు లోపలపెట్టమ్మా'' అంటూ కోడలి భుజాలు పట్టుకుని ఇంట్లోకి నడిపించింది కళ్యాణమ్మ.

కాళ్ళు కడుక్కోమని బాత్‌రూం దగ్గరకు తీసుకెళ్ళి నీళ్ళు అందించింది కళ్యాణమ్మ.

వసంత కాళ్ళు కడుక్కొంటూ ముందుకు వంగి కాళ్ళమీద కాళ్ళతోనే రుద్దుకొంటోంది.

"నెమ్మదిగానమ్మా... అంతలా వంగకూడదు జారిపడతావు'' అంటూ కళ్యాణమ్మ కంగారు పడుతోంది.

దూరాన్నుంచి ఆ దృశ్యాన్ని చూస్తున్న వినయ్, సూర్యనారాయణ కళ్యాణమ్మలో వచ్చిన మార్పుకి ఆశ్చర్యపోయారు.

టవల్‌తో కాళ్ళ తడిని తుడుచుకుంటున్న వసంతతో,

"జాగ్రత్త! అంత గట్టిగా రుద్దుకొంటే కాలి పట్టాశీల గుచ్చుకోగలదమ్మా'' అంది కళ్యాణమ్మ.

"నువ్వేమిట్రా అలా చిక్కిపోయావు'' అంటూనే కళ్ళనీళ్ళు పెట్టుకుంది కళ్యాణమ్మ వినయ్‌వంక చూస్తూ.

"ఏం లేదమ్మా! ప్రయాణంలో అలసట అంతే! నేనేం చిక్కిపోలేదు. పెళ్ళయ్యాక బాగా లావెక్కానని అందరూ అంటున్నారు మరి'' సమాధానం చెప్పాడు వినయ్.

"చూడమ్మా నీవిక్కడే చల్లగాలిలో కూర్చో! నేను పాలు వేడిచేసి పట్టుకొస్తాను'' అంటూ వసంతకి చెప్పి కిచెన్‌లోకెళ్ళిపోయింది కళ్యాణమ్మ.

'అత్తా! గతంలో ఎంత బెట్టు చేశావు. కావాలని నేను ఆప్యాయంగా పలకరిస్తున్నా సరే ఈసడించుకున్నావు కదూ! ఇప్పుడు మన వడు పుట్టబోతున్నాడని ప్లేటు ఫిరాయించేసి సకల మర్యాదలూ చేస్తున్నావు. ఉండు! నిన్నో ఆట పట్టించి నేనేమిటో నిరూపించుకుంటాను' అని మనసులో అనుకొని ముసిముసిగా నవ్వుకుంది వసంత.

"ఇంద పాలుతాగి కాసేపు విశ్రాంతి తీసుకోమ్మా... ప్రయాణంలో అలసిపోయావు! అసలే వట్టి మనిషివి కాదు కూడాను'' అంటూ పాలగ్లాసుతో వసంత ముందు నిలబడింది కళ్యాణమ్మ.

"థాంక్స్ అత్తయ్యగారూ! కానీ నేను వట్టి పాలను తాగలేను అందులో కాస్త హార్లిక్సయినా కలపాలి'' అంది వసంత.

"అయ్యయ్యో! ఇపుడెలా! ఇంట్లో ఎవరికీ హార్లిక్స్ తాగే అలవాటు లేదాయే! ఫర్వాలేదు నీవడిగావుకదా తెప్పిస్తాను'' అంటూ కళ్యాణమ్మ కంగారుగా,

"ఏవండీ... మీరు తొందరగా బజారుకెళ్ళి హార్లిక్స్ సీసాలు రెండు కొనుక్కురండి'' అంటూ సూర్యనారాయణని కంగారు పెట్టేసింది.

"హార్లిక్స్ తేవడానికి మీ మావయ్యని పంపించాను! ఈ లోగా ఈ గ్లాసుడు పాలూ తాగమ్మా! అదొచ్చాక మళ్ళీ కలిపిస్తాను'' అంటూ గ్లాసు వసంతకిచ్చి పక్కనే కూర్చుంది కళ్యాణమ్మ.

"సారీ అత్తమ్మా! మీకు శ్రమ కలిగిస్తున్నాను'' అంది వసంత పాలు తాగుతూ.

"అయ్యో... ఇందులో శ్రమేముందమ్మా! పాపిష్టిదాన్ని గతంలో చెడామడా మాటలనేసి నిన్ను బాధపెట్టానమ్మా'' అంటూ కళ్ళనీళ్ళు పెట్టుకుంది కళ్యాణమ్మ కొన్ని నిమిషాలయ్యాక.

"నీకిష్టమైన వంటకాలన్నీ అడిగి చేయించుకోమ్మా... నాకేం అభ్యంతరం లేదు. ఇది నీ ఇల్లు. రేపు నీకు పుట్టబోయే పిల్లల ఇల్లు'' అంది కళ్యాణమ్మ.




"నాకు బూరెలు తినాలనుందత్తయ్యా" అంది వసంత గారంగా.

"దాన్దేముందమ్మా! రేపు చేసి పెడతాను. ఇలా మొహమాటపడకుండా అన్నీ అడిగి తినాలి'' అంటూ కోడలి తలను సవరించి మెటికలు విరుచుకుంది కళ్యాణమ్మ.

"నిజంగా మీదెంత మంచి మనసత్తయ్యా! మిమ్మల్ని చూస్తుంటే నా మొదటి అత్తగారు గుర్తొస్తున్నారు. పాపం చనిపోయి ఎక్కడుందో మహాపుణ్యాత్మురాలు. నేను తిన్న ఎంగిలి కంచం కూడా కడిగేసేదావిడ" అంటూ కళ్లు తుడుచుకుంది వసంత.

"అలా మాట్లాడకూడదమ్మా! నీవు చిన్న పిల్లవికదా నీకు తెలీదులే! అలా పాత విషయాలు గుర్తుచేసుకోకూడదు. ఇంకెప్పుడూ అలా అశుభం పలకొద్దమ్మా'' అంటూ కళ్యాణమ్మ కంగారు పడిపోయింది.

దూరాన్నుంచి వచ్చింది కదా! ఏదో గాలిసోకుంటుందని రెండు ఎండు మిరపకాయలు తెచ్చి వసంతకి దిష్టితీసి పొయ్యిలో పారేసింది కళ్యాణమ్మ.

ఆ రాత్రి భోజనాలయ్యాక కోడలి దగ్గర కాసేపు కూర్చుంది కళ్యాణమ్మ. నడుం దగ్గర కాస్త నొప్పిగా వుందని వసంత అనడంతో అమృతాంజనం తెచ్చి మర్దనా చేసింది. బట్టలు బిగించి కాకుండా లూజ్‌గా కట్టుకోవాలని, కడుపుకి వత్తిడి లేకుండా ఎలా పడుకోవాలో ఎలా లేవాలో, ఎలా కూర్చోవాలో చేసి చూపించింది కళ్యాణమ్మ. అంతలో వినయ్ గదిలోకి రావడంతో "అలసిపోయారు ఇక నిద్రపోండి'' అంటూ అక్కడనుండి వచ్చేసింది.

ఉదయాన్నే ఐదు గంటలకు లేచి స్నానాది కార్యక్రమాలు ముగించి తులసిపూజ చేయడం కళ్యాణమ్మకు అలవాటు. కోడలు కూడా ఆ సమయానికి లేస్తుందేమోనని చూసింది. కానీ వసంత ఏడు గంటలకు లేచి నోట్లో బ్రష్ పెట్టుకుని వరండాలోకొచ్చి పచార్లు చేస్తూ పళ్లుతోముకుంటోంది. ఆమె వాష్‌బేసిన్ దగ్గర మొఖం కడుక్కున్నాక కళ్యాణమ్మ అక్కడికొచ్చి "చూడమ్మా ఇంకా పెందరాళే లేచి స్నానం చేసి తులసి పూజ చెయ్యాలమ్మా! అలా చేస్తే ఆయురారోగ్యాలు, సిరిసంపదలు సిద్ధిస్తాయి'' అంది కళ్యాణమ్మ.

"నేను తులసి పూజ చెయ్యనత్తయ్యా'' అంది వసంత.

"మరేం చేస్తావమ్మా... అసలు పూజచేసే అలవాటు లేదా నీకు?" అంటూ ఆశ్చర్యంగా అడిగింది కళ్యాణమ్మ.

"ఉంది! కానీ నాకు చిన్నప్పట్నుండీ 'మిరప చెట్టుకి' పూజ చెయ్యడం అలవాటు. మా అమ్మమ్మల కాలంనుండీ మేం మిరపచెట్టుకే పూజ చేస్తాం" అంది వసంత గోముగా.

ఆ మాటకు కళ్యాణమ్మ. నోరు తెరచి అలానే కొన్ని సెకన్లు ఉండిపోయింది.

"ఎన్నోరకాల పూజల గురించి విన్నాను కానీ, మిరప చెట్టుకి పూజ చెయ్యడం నీ దగ్గరే వింటున్నానమ్మా! చాలా విడ్డూరంగా వుంది నాకు'' అంది కళ్యాణమ్మ ఆశ్చర్యపోతూ.

"మా పూర్వీకులు ఒక మహర్షికి భోజనం పెడుతూ కాస్త గొడ్డుకారం కూడా వడ్డించారట. పాపం ఆ మహర్షి గొడ్డుకారంతిని అల్సరొచ్చి చనిపోయాడట. చనిపోతూ మా ముత్తాతని "మీ వంశంలో ప్రతి ఆడపిల్లకూ మొదటి భర్త చనిపోతాడని శపించాడట! శాపవిమోచన చెప్పమని మా ముత్తాత విలపించి వేడుకున్నాడట. మీ తరతరాలవాళ్ళూ మిరపచెట్టుని పూజించండి విముక్తులవుతారని చెప్పి చనిపోయాడటండీ. అప్పట్నుండీ మా వంశపారంపర్యంగా ఈ అలవాటొస్తోంది మాకు'' అంటూ చెప్పి కళ్యాణమ్మకి కనపడకుండా ముసిముసిగా నవ్వుకుంది వసంత.

"చాలా చిత్రంగా వుందమ్మా! ఇంకా నయం ఏ బ్రహ్మజెముడుకో పూజచెయ్యమని శపించలేదు. లేకపోతే చాలా ఇబ్బంది పడిపోయేవారు. ప్రస్తుతానికి తులసి చెట్టుకి చెయ్య

మ్మా. మిరపమొక్క ఎక్కడన్నా దొరికితే తెప్పించి మన పెరట్లో పాతిస్తాను'' అంది కళ్యాణమ్మ.

"ఫర్వాలేదత్తయ్యా! తులసిచెట్టునే మిరప మొక్కగా భావించి పూజ చేసినా చెల్లుతుందని పండితులు చెప్పారు. ఏవీ దొరక్కపోతే మిర పకాయని ముందుంచుకొని పూజచేస్తే సరిపో తుందట" అంటూ నవ్వుతూ స్నానాల గది వేపు టవలు తీసుకుని వెళ్ళిపోతూ.

"స్నానం చేసి పూజ చేసుకుంటానత్త య్యా!" అంటూ లోనికెళ్ళిపోయింది.

"జాగ్రత్తమ్మా! తొట్రుపాటు పడకు జారగ లవు'' అంటూ హెచ్చరించి కిచెన్‌లోకి వెళ్ళిపో యింది కళ్యాణమ్మ.

వసంత స్నానం చేసొచ్చి పూజ ముగించి కిచెన్‌లోకెళ్ళింది. కళ్యాణమ్మ బూరెలకోసం పిండి కలుపుతోంది. వసంత కూడా ఒక పీటమీద కూర్చుని అక్కడ ఉన్న బెల్లాన్ని ముక్కలుగా చితగ్గొడుతోంది.

"నీకెందుకమ్మా శ్రమ! నేను చేసిపెడతాను కదా! నువ్వెళ్లి మీ ఆయనకి టిఫిన్ పెట్టు'' అంది కళ్యాణమ్మ.

"ఆయన స్నానానికెళ్ళారత్తయ్యా. అర గంటక్కాని బయటకి రాడాయన. ఈలోగా మీక్కాస్త హెల్ప్ చేద్దామని'' అంటూ చె ప్పింది వసంత.

"మొన్నటిదాకా అనసూయ అన్ని పను లూ చేస్తూ నన్ను బాగా సుఖపెట్టేసి వెళ్ళిపో యింది. పాపం పిచ్చిపిల్ల. దాని పుణ్యంకొద్దీ మంచి భర్తే దొరికాడమ్మా. బాపిరాజు మా అందరికీ తలలో నాలికలాంటివాడులే. ఆ పిల్లాడు కూడా మేం వద్దంటున్నా సరే వంటింట్లోకొచ్చి కూరగాయలు తరిగి పెట్టేవా డు. అంత చదువున్నా ఎలాంటి భేషజాలులేని బాపిరాజుని చూస్తే మా అందరికీ ముచ్చటే'' అంటూ కళ్యాణమ్మ ఉత్సాహంగా చెప్పుకుపో తోంది.

వసంత బూరెల పాకంలో శనగపప్పు కలిపేసి పూర్ణం సిద్ధంచేసింది. అంతలో వినయ్ స్నానం చేసి కిచెన్‌లో కొచ్చాడు.

"ఏమంటుందమ్మా మీ కోడలు'' అంటూ వెళ్ళి ఖాళీగ్యాస్ సిలెండర్‌మీద కూర్చున్నాడు వినయ్.

"ఇంకో ఆరునెలల్లో నాకు బహుమతిగా బంగారు బుజ్జికొండనిస్తానంటుంది'' అంటూ ప్లేట్లో రెండు దోసెలువేసి వినయ్‌కిచ్చింది కళ్యాణమ్మ.

"మొత్తంమీద ఒక్కరోజులో మిమ్మల్ని ఆకట్టేసుకుందన్నమాట! మీ కోడలు మహా ఇంద్రజాలికురాలు. అజాగ్రత్తగా వున్నామంటే బురిడీకొట్టించేస్తుంది మరి'' నవ్వుతూ అన్నా డు వినయ్.

"మొదట్లో అర్థం చేసుకోకుండా ఆదరించలే కపోయాను కానీ... మహాలక్ష్మిలాంటి ఇల్లా లు. కళకళలాడే మొహంతో అచ్చు సీతమ్మవా రిలా వుందిరా నీ భార్య'' మెచ్చుకుంది.

"అయితే ఇద్దరూ ఒక్కటయిపోయారన్న మాట. ఇక ఇక్కడ నేను ఏం మాట్లాడినా ప్రయోజనముండదు. నేనలా బయటకెళ్ళి లంచ్‌టైం కొస్తానమ్మా'' అంటూ వినయ్ వెళ్ళిపోయాడు.

కళ్యాణమ్మ బూరెలు వండి ఒక పెద్ద పళ్లెంలో పోస్తోంది. అంతలో సూర్యనారాయణ వచ్చాడు. ఆయన్ని చూసి వసంత గౌరవంగా లేచి నుంచుంది. పళ్లెంలోని బూరెలు చూస్తూ సూర్యనారాయణ,

"వెనకటికెవడో తన్నితే బూర్లగంపలో పడ్డాడట! మరి నేను ఎవరూ తన్నకుండానే బూరెల దగ్గరకొచ్చేశాను'' అంటూ ఒకటి తీసుకుని విరిచి నోట్లో వేసుకున్నాడు.

"బూరెల గంపలో పడ్డారు కనుక సరిపో యింది! పొరపాట్న బూరెలువండే నూనెలో పడుంటే తిక్క కుదిరుండేది'' అంది కళ్యాణ మ్మ. పకపకా నవ్వేసింది వసంత.

"చూడమ్మా! నేనేం మాట్లాడినాసరే నా మాటలనే తిరిగి ఆయుధంలా ప్రయోగించ




డంలో మీ అత్తకి గొప్ప నైపుణ్యముందిలే' అంటూ సూర్యనారాయణ నవ్వేశాడు.

"ఇంకా తినండి అంకుల్' అంటూ ఒక ప్లేట్లో బూరెలు వేసిచ్చింది వసంత.

"వద్దమ్మా ఏదైనా సరే టేస్ట్ చూస్తాను గానీ ఎక్కువగా తినలేను. తిన్నానంటే స్కూల్లో నిద్రొచ్చేయగలదు. సరే! నేనలా బజారుకెళ్లి కూరలు తెస్తాను. ఏం కావాలో చెప్పండి'' అన్నాడు సూర్యనారాయణ.

"అమ్మాయ్! కాయగూరలు, ఆకు కూరల్లో నీకేవిష్టమో చెప్పమ్మా తెప్పిస్తాను'' అంది కళ్యాణమ్మ.

"పర్వాలేదండి నా కోసం ప్రత్యేకం ఏం వద్దు. మీరేం చేసుకుంటే నాకూ అదే'' అంది వసంత.

"ఏవండీ! దొరికితే పచ్చి మామిడికాయలు, బత్తాయిలు, సపోటాలు, ద్రాక్షపళ్ళు తీసుకురండి'' అంటూ లిస్ట్ చెప్పింది కళ్యాణమ్మ.

సూర్యనారాయణ మరో బూరె నోట్లో వేసుకుని బయటకెళ్ళిపోయాడు.

"నువ్వెళ్ళి అలా చావిట్లో కూర్చోమ్మా. హార్లిక్సు కలిపి తెస్తాను'' అంది కళ్యాణమ్మ వసంతతో.

వసంత హాల్లోకొచ్చి పేపరు తిరగేస్తూ కూర్చుంది. కళ్యాణమ్మ ఒక ప్లేటునిండా బూరెలు, మరో గ్లాసునిండా హార్లిక్స్ కలిపి కోడలిముందు పెట్టి తినమంటూ ఆప్యాయంగా వసంత ముందు కూర్చుంది. బూరెలు తింటూ వసంత,

"మీ ప్రేమాభిమానాలు చూస్తుంటే... పాపం చనిపోయి ఎక్కడుందో కానీ మహాపుణ్యాత్మురాలు నా మొదటి అత్తగారు గుర్తొస్తుందండీ... నేను అడక్కపోయినా సరే వారానికోసారి అరిసెలు చేసిపెట్టేది'' అంటూ కళ్ళు తుడుచుకుంది వసంత.

కళ్యాణమ్మ ఆ మాటకు ముఖం మాడ్చుకుంది. మళ్ళీ నవ్వు తెచ్చుకొని.

"పాత విషయాలు గుర్తుచేసుకొని బాధపడటం మంచిపద్ధతికాదు... ఇంకస్తమానం నీ మొదటి అత్తగార్ని తలుచుకొంటే నాకు బాధ కలుగుతుందమ్మా! అసలు నీ మొదటి అత్తగారి ఆత్మ నీ చుట్టూ తిరుగుతూ నిన్నిలా మాట్లాడిస్తోందేమోనమ్మా! సాయంత్రం మంత్రాల మరిడయ్యని పిలిపించి నీకు శాంతి చేయిస్తాను'' ఆందోళనగా అంది కళ్యాణమ్మ.

"గుర్తొచ్చి తలుచుకున్నాను కానీ, ఆత్మాలేదు! ప్రేతాత్మాలేదు! మీరేం ఆందోళనపడకండత్తయ్యా. ఏదో అలవాట్లో పొరపాటు'' అంటూ సమాధానం చెప్పింది వసంత.

"నన్నంటే అన్నావు కానీ... పొరపాట్న మీ మామగారితో 'నామొదటి మాంగారు నేనడక్కుండానే తలంటుకోడానికి నాకోసం కుంకుడుకాయలు కొట్టిపెట్టేవారు' అన్నావనుకో! ఇలాంటి విషయాల్లో ఆయనకి పక్కా వీక్‌నెస్. తట్టుకోలేక మనకు చెప్పకుండా ఏ తీర్థయాత్రలకో వెళ్ళిపోతాడాయన" అంటూ వసంత తినేసిన ప్లేటును, గ్లాసుని తీసుకోబోయింది కళ్యాణమ్మ.

"వద్దత్తయ్యా! మీచేత ఇలా చేయించుకోవడం మీ అబ్బాయి చూస్తే ఊరుకోరు'' అంటూ లేవబోయింది వసంత.

"వద్దమ్మా! వట్టప్పుడయితే నేను చేస్తానా! నీవు నెలల మనిషివి! నీకు విశ్రాంతి అవసరం" అంటూ కళ్యాణమ్మ ప్లేటు, గ్లాసూ పట్టుకొని వెళ్ళిపోయింది.

"పాపం. ఈవిడకు ఈ 'డోస్' సరిపోతుందిలే ఇక ఏడ్పించకూడదు'' అని మనసులో అనుకొని లెంపలు వేసుకుంది వసంత.

అలా నాలుగురోజులు గడచిపోయాయి. కోడల్ని అపురూపంగా చూసుకొంటోంది కళ్యాణమ్మ.

"అమ్మా! మాకు సెలవుల్లేవుకదా రేపు వెళ్ళిపోతాం" అన్నాడు వినయ్.

"ఇలా వచ్చి, అలా వెళ్ళిపోతారా! నాకస

లు బెంగ తీరలేదు మరి'' అంది కళ్యాణమ్మ బాధగా.

"సంవత్సరాలున్నా నీకు బెంగ తీరదు. వాళ్ళూ నాలాగ ఉద్యోగాలు చేసుకోవాలి కదా'' అన్నాడు సూర్యనారాయణ.

"నాన్నగారికోసం వారి ఉద్యోగం కోసం కానీ మిమ్మల్నిద్దర్నీ మా దగ్గరే ఉంచుకోవాలని నాకుంది'' అన్నాడు వినయ్.

"నాకు రిటైరయ్యేలోగా ఇప్పుడు పుట్టబోయేవాడు కాకుండా మరొకడ్ని కూడా రెడీ చేశారంటే మేమిద్దరమూ చెరొకరితో ఆడుకొంటూ కాలక్షేపం చేస్తాం" అని సూర్యనారాయణ అనగానే అందరూ నవ్వేశారు.

ఆమర్నాడు వినయ్, వసంత హైద్రాబాద్ రైలు ఎక్కేశారు.

★ ★ ★

"సార్! మీకోసం ఎవరో పద్మజగారట వచ్చి రిసెప్షన్‌లో కూర్చున్నారు'' అంటూ చెప్పాడు ఆఫీస్‌భోయ్.

పద్మజా! ఎవరబ్బా! అని మనసులో సందేహపడుతూ సీట్లోంచి లేచాడు వినయ్. అలాంటి పేరుగల అమ్మాయితో పరిచయమే లేదే! అనుకొంటూ మెట్లు దిగి రిసెప్షన్ కేసి నడిచాడు.

పదడుగుల దూరంలో కనిపిస్తున్న ఆమెను డోర్ దగ్గర నిలబడి రెండు సెకన్లు పరిశీలనగా చూశాడు.

అందం, ఆరోగ్యంతో కళకళలాడే మొహం. పొడవుకు తగ్గలావు, కొనదేరిన ముక్కు, కళ్లతోనే ఎదుటివార్ని మైండ్‌ని ఎక్స్‌రే తీయగల తీక్షణమైన చూపులు. ప్రయాణం చేసి వచ్చినట్లు కాస్త అలసటగా వుంది. పక్కన చిన్న ఎయిర్‌బాగ్. చేత్తో చెదరిన తల వెంట్రుకలను సరిచేసుకుంటూనే వినయ్‌ని చూసి "నమస్కారం" అంటూ లేచింది.

వినయ్ ప్రతి నమస్కారం చేసి "మీరు!..."

"నా పేరు పద్మజ. వసంత స్నేహితురాలిని'' ఎంతో పరిచయమున్న దానిలానే మాట్లాడుతోంది.

వినయ్‌కి ఇంకా మనసు కుదుటపడలేదు. మర్యాదకోసం నవ్వుమొహం పెట్టాడుకానీ మొహం క్వశ్చన్ మార్క్‌లానే కనిపిస్తోంది.

"మిమ్మల్ని డిస్టర్బ్ చేసివుంటే క్షమించండి. మీతోమాట్లాడాలి. మీ ఆఫీస్ వర్క్..." అంటూ సందేహించింది.

"నో ప్రోబ్లమ్! పదండి'' అన్నాడు వినయ్.

ఇద్దరూ ఆఫీస్‌గేటు దాటి బయటకొచ్చారు. వినయ్ గేటు వెలుపల ఉన్న తన స్కూటర్ని తీయబోతూంటే,

"మీరు స్కూటర్ని ఇక్కడే వుంచండి! ఓ పది నిమిషాలు మీతో ఏకాంతంగా మాట్లాడే అవకాశమివ్వండి'' అంది పద్మజ.

ఇద్దరూ బయటికి నడిచారు.

"వసంత క్షేమం చెప్పండి ముందు'' అంది పద్మజ.

"వసంత బానేవుంది'' చెప్పాడు వినయ్.

"హమ్మయ్య'' అని నిట్టూర్చింది పద్మజ.

ఇదెక్కడి గొడవరా బాబూ! వసంత అసలే వండర్ ఉమెన్ అనుకుంటే ఆమె ఫ్రెండ్స్ కూడా మరింత వింతగా వున్నారే! అని వినయ్ ఆశ్చర్యపోతున్నాడు.

"పదండి! ముందు టీ తాగేక విపులంగా మాట్లాడుకోవచ్చు'' అంటూ అక్కడికి కాస్త దూరంలో ఉన్న హొటల్‌కేసి నడిచాడు వినయ్. ఆమె వినయ్ వెనకాలే నడిచింది. హొటల్లోకెళ్లి ఫామిలీస్ కోసం స్పెషల్‌గా ఏర్పాటు చేసిన క్యాబిన్‌లోకెళ్లి కూర్చున్నారు. ఎయిర్ కండిషన్‌తో చల్లగా ఆహ్లాదంగా వుందక్కడ. దూరంగా ఒక జంట తప్ప మరెవ్వరూ లేరు. టిఫిన్‌కి ఆర్డరిచ్చాడు వినయ్.

"సారీ, మీకు ట్రబులిస్తున్నాను'' అంది పద్మజ చెయిర్లో వెనక్కి వాలుతూ.

"నిజంగా ట్రబులిస్తుంటే బాధపడనండీ... దాన్ని అస్తమానూ గుర్తు చేస్తేనే బాధపడతా




ను'' అన్నాడు వినయ్. అప్పటికి కాస్త చొరవ వచ్చిందతనికి

పకపకా నవ్వేసింది పద్మజ.

ఆమె అలా నవ్వుతుంటే తళుక్కుమనే పలువరుస అందంగా కనిపిస్తూ ఆమె అందాన్ని రెట్టింపు చేస్తోంది.

"నేను వసంత స్నేహితురాలిని. వసంత వైజాగ్‌లో నా రూంమేట్! నేను, వసంత, శ్రీలత అనే మరో అమ్మాయి కలిసి ఉండేవాళ్లం" అంది పద్మజ.

'ఆ లక్షణాలు కొట్టొచ్చినట్లు కనిపిస్తూనే ఉన్నాయ్! వసంత స్నేహితురాల్లానే సూచిస్తున్నాయ్‌లే' అనుకొన్నాడు వినయ్.

"వసంత పెళ్లికి నేను రాలేకపోయాను. బాడ్ లక్కేమిటంటే వసంత వెడ్డింగ్‌కార్డ్ అందే సమయానికి నేను మా ఇంటివద్దలేను. కంప్యూటర్ కోర్సు చెయ్యడానికి బెంగుళూర్ వెళ్లాను. సరైన కమ్యూనికేషన్‌లేక వసంత పెళ్లయిపోయిన వారం రోజులకు ఆ సంగతి తెలిసింది నాకు. దాని ఉత్తరం, శుభలేఖ ఒకేసారి చూశాను. నా ప్రాణానికి ప్రాణం వసంత! ఆమె పెళ్లికి రాలేకపోయినందుకు చాలా బాధపడ్డానుకానీ... వసంత మళ్లీ పెళ్లి చేసుకున్నందుకు పొంగిపోయాను'' ఆమె చెబుతున్న విషయాన్ని హఠాత్తుగా ఆపి ఎందుకో కొంచెం ఫీలవుతూ.

"అయామ్ సారీ!" అంది.

"డోంట్ ఫీల్. వసంతకి అంతకుముందు పెళ్లయిందన్న సంగతి నాకూ తెలుసు! ఫర్వాలేదు నేనేమనుకోను చెప్పండి'' అన్నాడు వినయ్.

"వసంత ఎలాంటిదో భర్తగా మీరు గ్రహించే ఉంటారు. కానీ ఆమె రూంమేట్‌గా ఆమె మనోభావాలను ఎక్కువగా పంచుకున్నది నేనే! వసంత కష్టనష్టాలంటే ఏమిటో తెలీకుండా పెరిగింది. తల్లితండ్రులు అంతగా గారాబం చేశారు. ఒక్కోసారి ఆమె చాలా సరదాగా వుంటుంది. హఠాత్తుగా మనం కోలుకోలేనంతగా షాక్ కూడా ఇస్తుంది. అందుకే వసంత విషయంలో నేను చాలా జాగ్రత్తలు తీసుకున్నాను. ఒకసారి మేమంతా రూంలో గోళ్లకు పాలిష్ వేసుకుంటున్నాం. గోళ్ల రంగు పింక్ కలర్‌లో వుంది. అప్పటిదాకా సరదాగా జోక్‌లేసుకుంటూ మాట్లాడుకుంటుంటే "నా రక్తం కూడా ఈ కలర్‌లోనే వుంటుంది'' అంది వసంత. "నీ మొహం! నువ్వు పైకి తెల్లగా కనిపిస్తున్నావుకానీ నీ రక్తం నల్లగా వుంటుంది'' అన్నాం నేనూ మరో అమ్మాయిను. అంతే! వసంత సడెన్‌గా కిచెన్‌లోకెళ్లి చేతిని గాయం చేసుకుని వచ్చింది. ఆమె వేలినుండి రక్తం కారుతోంది.

"చూశారా! నేను చెబితే నమ్మలేదు మీరు. చూడండి నా రక్తం, ఆ గోళ్ల రంగూ ఒకటే కలర్' అంది.

పద్మజ గంభీరంగా నిట్టూర్చింది. వినయ్ కూడా ఆమె చెప్పిన సంఘటనకి చలించిపోయాడు.

"ఆమె ప్రేమని కూడా ఓపట్టాన అంచనా కట్టలేం. ఒకసారి ఎవరో నిరుపేదరాలు కింగ్ జార్జ్ హాస్పిటల్లో తన వెన్నుకు ఆపరేషన్ చేయించుకోడానికి కష్టపడి కూలి డబ్బులు పోగేసుకుని పల్లెటూరునుండి వైజాగ్ వచ్చింది. ఎవడో మోసగాడు మాయమాటలు చెప్పి ఆమె దాచుకున్న డబ్బుని దోచుకుపోయాడట. ఆమె విలవిలా ఏడుస్తూ గుండెలు బాదుకుని జగదాంబ సెంటర్లో చెయ్యి చాచి అడుక్కొంటుంటే, వసంత ఆమె అవస్థకు జాలిపడి ఆమెకు స్వంత ఖర్చుతో వైద్యం చేయించి పదిరోజులు సొంత బంధువులా సాకి ఆమెకు చీర/కొనిపెట్టి మరీ వాళ్ల ఊరికి పంపించింది. అలాంటి సమయాల్లో ఆకాశమంత ఎత్తుకు ఎదిగిపోయేది మా దృష్టిలో' అంటూ చెప్పి రెండు నిముషాలు మౌనంగా ఉండిపోయింది పద్మజ.

"ఇవన్నీ నేనెందుకు చెబుతున్నాననేది మీకు చాలాకన్‌ఫ్యూజింగ్‌గా వుండొచ్చు! కానీ

వసంత ఇంకా బతికుందంటేనే నాకు ఆశ్చర్యంగా వుంది. వసంతకి జీవితం అంటే ఆఫ్టాల్! ఆమెను ఆ దారిన ఆలోచించనివ్వకుండా బతికించుకోవాలి! రోజులు గడిచాయంటే ఆమె ఏమైనా కావచ్చు. అందుకే ముందుగా మీకో విషయం చెప్పాలని వచ్చాన్నేను'' అంది పద్మజ నుదుటపట్టిన చెమటని కర్చీప్‌తో అద్దుకొంటూ.

వినయ్‌కి టెన్షన్ పెరిగింది. ఆతృత, ఆందోళనతో ఉక్కిరి బిక్కిరవుతున్నాడు.

"వసంత మొదటి భర్త ఎలా చనిపోయాడో మీకు తెలుసా!" అంది పద్మజ.

"తెలీదు. నేనెప్పుడూ వసంతని గానీ, మరెవర్నిగానీ ఆ సంగతి అడగలేదు. ఆమె కూడా చెప్పలేదు. యాక్సిడెంట్లో పోయాడని మాత్రం వసంత తండ్రి చెప్పాడు'' అన్నాడు వినయ్.

"వసంత మొదటిభర్తని నేనూ చూడలేదు. ఆమె పెళ్లినాటికి ఆమెవరో! నేనెవరో! ఆమె భర్త చనిపోయాక కాకతాళీయంగా వైజాగ్‌లో చదువుల నిమిత్తం నా రూంమేట్ అయ్యింది వసంత. జీవితంలో ఆమె చవిచూసిన అత్యంత విషాదం తన మొదటి భర్త మరణం"

★ ★ ★

"అబ్బా! ఇంకా కాలేదా నీ సింగారం. పిక్చర్‌కి టైమయిపోతోంది. అనవసరంగా అడ్వాన్స్ టికెట్స్ కూడా తెప్పించాను'' అంటూ వచ్చి వసంత నడుం దగ్గర కితకితలు పెట్టాడు మనోహర్.

"ఊc ఏంటండీ! కాస్త హుక్స్ పెట్టరూ అందటంలేదు'' అంది వసంత.

"సరే!" అంటూ అంతకుముందు ఆమె పెట్టుకున్న హుక్స్‌ని కూడా విప్పేశాడు మనోహర్.

"ఆలస్యమయిందంటూ నన్ను తిడతారే! మరి మీరు చేసే కోతి పనులకు నేనేమనాలి'' అంటూ టక్ చేసుకున్న మనోహర్ షర్ట్‌ని పైకి లాగేసింది వసంత.

"సరే! నువ్వు నాకు టక్ చేసి పెట్టు. నేను నిన్ను డ్రెస్సప్ చేస్తాను'' అన్నాడు మనోహర్.

"అలారండి దార్లోకి'' అంటూ వసంత మనోహర్ షర్ట్‌ని సరిచేసింది. ఇద్దరూనీట్‌గా తయారయి మేడదిగి కిందికొచ్చారు.

"అమ్మా! మేం బయటకెళుతున్నాం" అంది వసంత.

"వస్తానత్తయ్యా!" మనోహర్ చెప్పాడు.

"మంచిదిబాబూ! త్వరగా వచ్చేయండి'' అంది మంగతాయారు.

మనోహర్ స్కూటర్ స్టార్ట్ చేశాడు. వసంత వెనుక కూర్చుని అతని నడుంచుట్టూ చేతులు వేసింది. మనోహర్ స్కూటర్ని చాలావేగంగా నడుపుతాడు. అతను స్కూటర్ నడుపుతుంటే చూసేవాళ్లకి రేస్‌లో పాల్గొంటున్నాడా అన్నట్లుంటుంది. వసంత చాలాసార్లు అంది. అలా నడపొద్దు నాకు భయమేస్తుంది అని.

"భయమా! గియమా! నాతో ఎవరున్నా సరే నా అనుభవాలు సమానంగా పంచుకోవలసిందే కనుక నువ్వే అలవాటుపడాలిమరి'' అంటూ స్పీడ్ ఇంకాస్తపెంచి మరింతగా వసంతని ఏడిపించే వాడు మనోహర్.

"మనోహర్ నీ అంత సరదా మనిషి ఈ ప్రపంచంలో మరొకరుండరేమో'' అంటూ వసంత మనోహర్ భుజాలపై వాలిపోతుంది.

ఆ రోజు సినిమా చూసి ఇంటికి తిరిగొచ్చేస్తున్నారు మనోహర్, వసంత.

"ఏమండీ! మల్లెపూలు కొనడం మరచిపోయాం! ఇంక ముందుకు పోతే దొరకవు'' అంది వసంత.

"వెంటనే స్కూటర్ని ఆపి వెనక్కి తిప్పాడు మనోహర్. మల్లెపూల దుకాణం అరఫర్లాంగు దూరంలో వుంది. మనోహర్ స్కూటర్ని వెనక్కి పోనిచ్చాడు.

"అయ్యో ఇది వన్‌వే! మనం రాంగ్ రూట్లో




వెళితే ట్రాఫిక్ వాడు పట్టుకుంటాడు'' అంది వసంత.

"డోంట్‌వర్రీ! మనకి మల్లెపూలు కావాలి అంతే! నేనెప్పుడూ లక్ష్యం వైపే గురిపెడతాను నా నిర్ణయాన్ని. మధ్యలో పోలీసొచ్చినా, యమకింకరుడొచ్చినా లెక్కచెయ్యను'' -అన్నాడు మనోహర్.

గతుకులరోడ్డు, రోడ్‌మీదున్న నాలుగు కరెంట్‌పోల్స్‌కి లైట్లు వెలగడంలేదు. దూరంగా ఒక లైట్ కనిపిస్తోంది. ఏవో వాహనాలు తమ పక్కగా దూసుకుపోతున్నాయి. అయినా మనోహర్ స్కూటర్ స్పీడ్‌ని తగ్గించలేదు. ఎదురుగా లోడ్‌తో పెద్ద కొండలా దూసుకువస్తుందో లారీ. కీస్‌మంటూ హారన్ కర్ణ కఠోరంగా మోగింది. అంతే! టప్‌మని ఏదో ఢీకొన్న చప్పుడు వసంత ఎగిరెళ్లి పదడుగుల దూరంలో రోడ్‌పక్క పొదల్లో పడింది. మనోహర్ స్కూటర్ లారీ వెనుక చక్రాల కింద నుజ్జునుజ్జు అయింది.

మనోహర్ కూడా...!!

★ ★ ★

ఊపిరి బిగబట్టివింటున్న వినయ్ ఒక్కసారి భారంగా నిట్టూర్చాడు. పద్మజ అక్కడవున్న గ్లాస్‌లో నీళ్లు తాగి చేత్తో కణతలు నొక్కుకుంది.

"మనోహర్‌కి యాక్సిడెంటయిన మరుక్షణమే వసంత స్పృహకోల్పోయింది. మూడు రోజుల తర్వాత ఆమె హాస్పిటల్లో కోలుకొనేసరికే మనోహర్ అంత్యక్రియలు జరిగిపోయాయి. మనోహర్ చనిపోయాడనే చేదునిజాన్ని ఆమె భరించలేకపోయింది. గుండెలు రగిలే బాధతో ఆమె కళ్లు కన్నీళ్లతో నిండి వుండేవి. నెల రోజులు ఆమెతో ఏమీ తినిపించలేకపోయారు. నీరసంతో ఆమె కూడా బాగా కృశించిపోయింది. మళ్లీ హాస్పిటల్లో చేర్చి సెలైన్ ఎక్కించి బతికించుకున్నారు.

కాల ప్రవాహంలో వసంత మెల్లిగా కోలుకోసాగింది. ఆమెను కంటికి రెప్పలా చూసుకొని రక్షించుకున్న తల్లితండ్రులు ఆమెను పాత జ్ఞాపకాల నుండి వేరు చేయడానికి వైజాగ్ తీసుకొచ్చి ఎమ్మేలో చేర్పించారు. ఆమె పరిస్థితి పూర్తిగా అవగాహన చేసుకున్న హాస్టల్ మేట్రిన్ ఆమె రూంమేట్స్‌గా నన్నూ, శ్రీలక్ష్మి అనే మరో అమ్మాయిని నిర్ణయించింది. మొదట్లో వసంత చాలా రిజర్వ్‌డ్‌గా వుండేది. నా చొరవతో ఆమెకు కాస్త ఉత్సాహం పుంజుకుంది. ఆమెతో నవల్స్ చదివించడానికే ఆరు నెలలు పట్టింది మాకు. సినిమా చూపించడానికి సంవత్సరం టైం పట్టింది. ఆమె ఒంటరిగా వుంటే చాలు మనోహర్ ఆలోచనలతో అప్‌సెట్ అయ్యేది. తనవల్లే తన భర్త చనిపోయాడని ఆమె నిత్యం కుమిలిపోతుండేది. ఆ రోజు తాను మల్లెపూలు అడగకుండా వుంటే తన మనోహర్ తనకు దక్కివుండేవాడని తనే చేతులారా తన భర్తని పోగొట్టుకున్నానని పశ్చాత్తాపపడేది. నిజానికి తనకు బతకాలని లేదనీ, జీవితం మీద ఆశ చచ్చిపోయిందనీ చెబుతుండేది. మేం ఆమెకు ధైర్యం చెప్పడానికి, జీవితపు విలువలు బోధించడానికి సతమతమయ్యేవాళ్లం.

తర్వాత వసంత మామూలుగా జీవితాన్ని ఎంజాయ్ చేస్తోందని భావించాక మెల్లిగా ఆమె దృష్టిని వివాహంవైపు మరల్చాలని తల్లి తండ్రులు మాతో చెప్పుకుని హెల్ప్ చెయ్యమని వేడుకున్నారు. అందులో భాగంగా వసంతని రోజూ సముద్రతీరానికి తీసుకెళ్లి ఆమె భావాలను స్వేచ్ఛగా వెలిబుచ్చే అవకాశమిచ్చి సరదాగా చర్చించేవాళ్లం.

'వసంతా! పరిస్థితులు మళ్లీ నిన్ను పెళ్లికూతుర్ని చేస్తే ఏం చేస్తావ'నే దాన్ని.

'జీవితంలో మనోహర్ ఒక్కడికే సమస్తం అర్పించాను. అతను చనిపోయాక నేనిలా బతుకుతున్నందుకే సిగ్గుపడుతున్నాను. నేను ఏ క్షణంలోనైనా చచ్చిపోతాను. నా మనోహర్ దగ్గరకెళ్లిపోతాను తప్ప మరో పెళ్లి ససేమిరా చేసుకోను' అనేది.

అయినా పట్టువదలక ఆమె పెళ్లికి సిద్ధపడే లా స్లోగా ఆమె మైండ్‌ని మోల్డ్ చేశాం. వసంతకి తన తల్లితండ్రులంటే ప్రాణం. అందుకే వారి ఆనందంకోసం పెళ్లి చేసుకోడానికి అతికష్టమ్మీద ఒప్పుకుంది. అయితే నాతో ఒక విషయాన్ని ఖచ్చితంగా చెప్పేది 'పద్మజా! నేను పెళ్లి చేసుకున్నా నా ఎంగిలి జీవితాన్ని పంచుకోడానికి ముందుకొచ్చే అర్భకుడిని నేను ప్రేమించలేను. ఒకవేళ అతనికి నా శరీరాన్ని అప్పగించినా నా మనసు మాత్రం నాతోనే సమాధి అవుతుందని చెప్పేది. ఒకవేళ నేను పెళ్లి చేసుకొన్నాక ఆ జీవితం నాకిష్టం లేకపోతే పెళ్లయిన తేదీనుండి నా భర్త మనోహర్ చనిపోయిన తేదీ వరకే నేను బతికేది' అని మరింత ఖచ్చితంగా చెప్పింది'' పద్మజ మధ్యలో ఆగింది.

వినయ్‌కి ఏసిలో కూడా చెమటలు పట్టి ఊపిరి వేడిగా బయటకొస్తోంది. పద్మజ మళ్లీ చెప్పడం ప్రారంభించింది.

"ఆమె బతకనీ, చావనీ మొత్తమ్మీద పెళ్లికి ఒప్పుకుందికదా అనేదే మా ఆనందం. వసంత తల్లితండ్రులు నన్నెంతో అభినందించారు, వసంతకి మళ్లీ జీవం పోసావని. అయితే మేం వసంతని మాత్రం పూర్తిగా మార్చలేకపోయాం. ఆమెకు మనోహర్ ఎప్పటికీ గుర్తుండిపోవచ్చు. నాకు డైరీ రాసుకొనే అలవాటు ఉంది. నా డైరీలో వసంత కోసం కేటాయించిన పేజీలే ఎక్కువ. చదువులు పూర్తయ్యాక ఎవరిళ్లకు వాళ్లం వెళ్లిపోయాం. తర్వాత వసంతకి మీతో పెళ్లి కావడం. మీ పెళ్లికి నేను రాలేకపోవడం ఇవన్నీ ముందు చెప్పాను కదా! తర్వాత యధాలాపంగా నా డైరీలు తిరగేస్తున్నాను ఒకరోజు. నా డైరీలో ఒకచోట రాసుకున్న వసంత అన్నమాట చదివి కంగారుపడ్డాను. 'నేను పెళ్లి చేసుకొన్నాక ఆ జీవితం నా కిష్టం లేకపోతే పెళ్లయిన తేదీ నుండి మనోహర్ చనిపోయిన తేదీవరకే నేను బతికేది' అని ఆమె అన్నమాట చదివినప్పటి నుండీ నా మనసు చాలా ఆందోళనగా మారిందండీ! అసలే వసంత జగమొండి, ఏం చేసినా చేస్తుంది. అందుకే నేను ఈ రోజు ఇలా వచ్చి ముందుగా మిమ్మల్ని కలవటం! ఆమె మొదటి భర్త చనిపోయిన తేదీ మరో వారం రోజులేవుంది'' అని చెప్పి మనసులో ఉన్న బరువుని దించుకున్న దానిలా భారంగా ఊపిరిపీల్చుకొంది పద్మజ.

వినయ్‌కి పరిస్థితి మరింత గందరగోళంగా మారింది.

'అవును! వసంత అణువణువునా ఆమె మొదటి భర్త జ్ఞాపకాలు ఉన్నాయనేది వాస్తవం' అని మనసులో అనుకొన్నాడు వినయ్.

"ఇలా అడుగుతున్నానని మరోవిధంగా భావించకండి, మీ పట్ల వసంత ఎలా ప్రవర్తిస్తోంది'' అనడిగింది పద్మజ.

"వసంత నన్ను ప్రేమిస్తోందో! ద్వేషిస్తోందో స్పష్టంగా చెప్పలేనండీ. అయితే సగటు భార్యగా మాత్రం నాకు అన్నీ టైంకి చేసి పెడుతుంది'' అని ముక్తసరిగా జవాబిచ్చాడు వినయ్.

"వసంత లేకుండా మీరు బతకగలరా!" అంది పద్మజ. వినయ్ మాట్లాడలేదు.

"నేను వసంతని కలిసి ఏడాది పైనే అయ్యింది. వసంతతో మాట్లాడితే ఆమె ఆలోచనలను నేను కొంతవరకూ అంచనా వెయ్యగలను. ముందు మీ ఇంటికెళ్లి నేను వసంతతో మాట్లాడుతుంటాను. మీరు చాటుగా గమనించండి. ఆమె ఉద్దేశాన్ని తెలుసుకోవచ్చు'' అంది పద్మజ.

సరేనన్నాడు వినయ్. ఆటో పిలిచి తమ ఇంటికి దారి చెప్పి పద్మజని పంపించేసి తన స్కూటర్ని తెచ్చుకోడానికి వెనక్కి వచ్చాడు వినయ్.

అతని మనసంతా టెన్షన్‌తో విలవిల్లాడుతోంది. వసంతకి తన మీదున్న స్పష్టమైన అభిప్రాయాన్ని పద్మజతో చెబుతుండగా వినాలి అనే తహతహతో వినయ్ స్కూటర్




స్టార్ట్ చేశాడు.

★ ★ ★

డోర్ బెల్ మోగింది. వసంత వెళ్లి తలుపు తీసింది. ఎదురుగా పద్మజ.

వసంత సంతోషంతో తబ్బిబ్బవుతూ "పద్మజా'' అంటూ కౌగిలించుకుంది. పద్మజ కూడా వసంతని ఆప్యాయంగా అక్కున చేర్చుకుంది.

"ఏమిటే! ఇన్నాళ్లూ ఎక్కడికి పొయ్యావే! ఏ గంధర్వుడితోనో స్వర్గంలో విహరిస్తున్నావేమో అనుకొన్నాలే!" అంది వసంత సంతోషంతో.

"నాకా అదృష్టం కనుచూపుమేరలో కన్పించడంలేదే! నాకింకా బాధ్యతలు ఉన్నాయి మరి'' అంది పద్మజ వసంతని పరిశీలనగా చూస్తూ.

వసంత బాగా ఒళ్లు చేసి కళకళలాడుతోంది. తానెన్నడూ చూడని తృప్తి ప్రశాంతత వసంత మొహంలో కనిపిస్తున్నాయి. వసంత ఎంతలా మారిపోయింది. విచారంగా సదా వడిలిపోయినట్లుండే వసంత నిండుగులాబిలా వుందిప్పుడు. తను భయపడినంత ఆందోళనగా మాత్రం లేదు. హమ్మయ్య అనుకొంది పద్మజ.

"నా పెళ్లికి రాకుండా నాకు చాలా ద్రోహం చేశావే! ఏవో కారణాలు వ్రాశావు కానీ లేకపోతే నిన్ను శపించి వుండేదాన్ని'' అంది వసంత చిరుకోపంతో.

"ఏమని శపించేదానివి?" అడిగింది పద్మజ

"వైజాగ్ సముద్రతీరంలో ఒక కఠినశిలగా మారిపోయి నిరంతరం అలలతాకిడిని అనుభవిస్తూ బాధపడమని శపించేదాన్ని'' అంది వసంత నవ్వుతూ.

పద్మజ కూడా నవ్వేసింది.

"ఎలావుందే! నీ వివాహజీవితం. పూర్తిగా సంసారంలో లీనమైపోయినట్లున్నావు! త్వరలో ఒక బాబుని కూడా ఎత్తుకోబోతున్నావన్నమాట" అంది పద్మజ వసంత ఇచ్చిన కాఫీ తాగుతూ.

వసంత మాట్లాడలేదు.

"మేరీడ్ లైఫ్ ఎలా వుందంటే జవాబు చెప్పవేం" రెట్టించి అడిగింది పద్మజ.

"బానే వుంది'' అంటూ పొడిగా చెప్పింది వసంత.

"మీవారు బాగానే చూసుకుంటున్నారన్నమాట! నీ మొహమే చెబుతోందిలేవే. నీ జీవితం సరదాగా గడుస్తోందని''

"మావారు అరగంటక్రితమే రావాల్సింది. ఎందుకో ఆయన ఈరోజు లేట్ చేశారు'' అంది పద్మజ.

"పరిచయం చేద్దువుగానిలేవే! తొందరెందుకు. అదుగో ఆ ఫోటోలో చూస్తున్నానుగా మీ ఆయన్ని. అబ్బ చాలా హాండ్సమ్‌గా వున్నాడు'' అంది పద్మజ, టేబుల్‌మీదున్న వసంత వినయ్‌ల ఫోటోను చూస్తూ.

అలా ఆ కబుర్లు, ఈ కబుర్లు చెప్పుకున్నాక పద్మజ అంది.

"మరి నీవిప్పుడు మనోహర్‌ని పూర్తిగా మరచిపోయినట్లేనా?" వసంత మొహం గంభీరంగా మారిపోయింది.

"మళ్లీ పెళ్లి చేసుకుని ఒకవేళ ఆ జీవితం నచ్చకపోతే ఆయన చనిపోయే తేదీవరకే బ్రతుకుతానన్నావు! అంటే నీకు ఈ జీవితం నచ్చినట్లేకదా'' అంది పద్మజ వసంతని గమనిస్తూ!

వసంత కొన్ని నిమిషాలు మౌనంగా వుండిపోయి తర్వాత పెదవి విప్పింది.

"పద్మజా! జీవితమంటే ఏమిటో తెలీని నాకు నువ్వే లోకాన్ని పరిచయం చేశావు. నాకు నచ్చినవాళ్లని ప్రేమించడం తప్ప ద్వేషించడం తెలీదు. నిన్న మొన్నటివరకూ 'మనోహర్' జ్ఞాపకాలు నన్ను వెంటాడినమాట నిజమే! ఈ పెళ్లయ్యాక మావారిని అసలు భర్తగా గౌరవించలేదు. సరిగదా అనుక్షణం ఆయన హృదయాన్ని తూట్లుపడేలా చేశాను.

నాకు ఒంటరిగా బ్రతకడమే బావుంటుందని పించి రకరకాలుగా మావారిని తూలనాడాను. అలా అయినా ఆయన నన్ను వదిలేస్తే ఒంటరి గా బ్రతుకుదామని భావించేదాన్ని. నేనలా ఎందుకు మారిపోయానో నాకే తెలియదు. కానీ నా భర్త వినయ్ 'దేవుడు'. ఆయన సహనం, మంచితనం నన్ను బాగా ఆకట్టుకు న్నాయి. బహుశా ఆ మంచితనమే నేను కొండెక్కికూచునేలా చేసిందేమో! ఒక మంచి ధ్యేయంతో అతను ఎన్నో కాదనుకొని వితంతు నయిన నన్ను పెళ్లాడాడు. మొదట్లో అతను సమాజంలో పేరుకోసం, మా నాన్న డబ్బు కోసం అలా చేస్తున్నాడేమో అనిపించింది. కానీ ఆయన ఆశయాలు వెలకట్టలేనివి. మంచి తనంతో మూర్తీభవించిన ఆ సహనమూర్తిని చూశాక మళ్లీ నాకు బ్రతుకుమీద ఆశపెరి గింది. బతకాలనే కోరిక బలపడింది. అదంతా మావారి ఆదర్శంవల్లే! మనోహర్‌ని కేవలం కుర్రతనంగా, పిచ్చిగా, ప్రేమించాను కానీ వినయ్‌ని భర్తగానే కాదు. ఆదర్శమూర్తిగా కూడా ఆరాధిస్తున్నాను. మనోహర్‌ని కోల్పోవ డంతో జీవితం ఇక లేదనుకున్న నాకు అసలు జీవితాన్ని మరింత స్పష్టంగా వినయ్ నాకు చూపిస్తున్నాడు. నేను బ్రతకాలనే నిర్ణయించు కున్నాను'' అంటూ కన్నీళ్లు పెట్టుకుంది వసంత.

పద్మజ ఆమెను ఓదార్చింది.

"ఆయన్ని నేను చాలా విషయాల్లో కావా లని మరీ కించపరిచాను పద్మజా! ఆయన నిజాయితీలో నమ్మకం కుదరకపోవడమే అందుకు కారణం. ఇప్పుడు నాకనిపిస్తుంది. నేను వినయ్‌కి ద్రోహం చేశానని. ఆయనకి ఎలా క్షమాపణ చెప్పుకోవాలో తెలీక కుమిలిపో తున్నాను'' అంది వసంత ఉద్వేగంగా.

"హమ్మయ్య! ఇప్పటికయినా జీవిత సత్యాన్ని గ్రహించావు వసంతా కంగ్రాట్సు! జీవితం ఒక అద్భుతవరం మనిషికి. దాన్ని వినియోగించుకోవడమే మనిషి కర్తవ్యం. పోన్లే జరిగిన దాన్ని మరచిపో పశ్చాత్తాపాన్ని మించిన క్షమాపణలేదు. ఇకనుండయినా నీ జీవితాన్ని అందంగా మలుచుకో వసంతా!

వసంత తబ్బిబ్బయ్యింది. కళ్లనుండి రెండు వెచ్చటి కన్నీటిచుక్కలు బుగ్గలమీదికి జారాయి. ఆ కన్నీటి చుక్కలను తుడిచింది పద్మజ.

★ ★ ★

పద్మజ నాలుగురోజులుండి మళ్లీ వస్తాను వీలుచూసుకొని అని చెప్పి వెళ్లిపోయింది. పద్మజలాంటి ప్రాణస్నేహితురాలు ఉన్నందుకు వసంత మనసు ఆహ్లాదంతో నిండిపోయింది.

ఆరోజు రాత్రి తమ పడకగదిలో.

"ఇంద పాలు తీసుకోండి'' అంటూ గ్లాస్‌తో వచ్చి పక్కనే కూర్చుంది వసంత.

వినయ్ పాలుతాగి వసంతని సున్నితంగా మీదకు లాక్కున్నాడు.

"ఊఁ రోజూ తమరికి కొత్త పెళ్లికొడుకులాగా నే ఆరాటం!" అంటూ అతని చేతులు విడి లించుకుంది వసంత.

"ఆరాటం అనేది కొత్తవాళ్లకయినా పాతవాళ్ల కయినా ఒక్కటే'' అంటూ వసంత బుగ్గని గిల్లాడు వినయ్.

"ష్ఁ అబ్బా! ఏమిటా నాటు సరసం! కాస్త మెల్లగా గిల్లలేరూ!" అంది వసంత బుగ్గని తడుముకుంటూ.

"ఇదే నీ మొదటి భర్త చేస్తే ఏమనేదానివీ?" అన్నాడు వినయ్.

వసంత ఉలిక్కిపడింది.

"ఏమిటా మాటలు!! తప్పుకదూ!! తప్పుక దూ!" అంది వసంత కోపంగా.

"ఓస్! అలాగా! సారీ! నాకు తెలీదులే'

వినయ్ తనని ఆటపట్టిస్తున్నాడని తెలిసి అతన్నిక మాట్లాడనీయకుండా తన పెదవు లతో అతని అధరాలను అదిమిపట్టి అతనిమీద వాలిపోయింది వసంత!






# చతురత ప్రపంచం

## అమెరికన్ డైమండ్స్

బంగారం ధర ఆకాశాన్నంటుతున్నా కొనేవాళ్ళు విరగబడి కొంటూనేవున్నారు. అయితే బంగారు నగలకి మేమేమీ తీసిపోమనీ, అమాటకొస్తే మాకే తళుకెక్కువనీ మార్కెట్‌లోకొచ్చి పడుతున్నాయి కృత్రిమమైన ఆభరణాలు. ఎన్నో అందమైన చెక్కడాలతో తళుకుబెళుకులతో కనిపించే కృత్రిమ నగలను ప్రజలు కూడా విరివిగానే కొంటున్నారు. ఏ రంగుచీర కట్టుకున్నా దానికి మ్యాచ్ అయ్యే రంగుల రాళ్ళు పొదిగిన గాజులు, నెక్లెస్‌లు వగైరా వస్తువులు చూడముచ్చటగా దర్శనమిస్తున్నాయి.

మహిళలు ఈమధ్య ధరించే అమెరికన్ డైమండ్ ఆభరణాలు కృత్రిమమైనా జిగేల్‌మనిపించి చూపరులను ఆకట్టుకుంటున్నాయి. ఈ అమెరికన్ డైమండ్‌లను మొట్టమొదట మార్కెట్‌లోకి తెచ్చిన ఘనత ఇండియాకు చెందిన రంజిత్‌సింగ్ అనే ఆసామికి దక్కుతుంది. అందరూ ఎన్నో వస్తువులను ఇండియానుండి దిగుమతి చేసుకుని వ్యాపారం నడుపుతుంటే రంజిత్‌సింగ్ అమెరికాలో స్థిరపడి అక్కడే వీటి తయారీ ప్రారంభించాడు.

ప్రస్తుతం అమెరికాలో ఈ కృత్రిమ డైమండ్ వ్యాపారంలో అక్కడివారందరికంటే ముందంజలో వున్నాడు రంజిత్. ఇవి చూడ్డానికి అచ్చమైన వజ్రాల్లాగే వుండి, చూపరులను చాలా మోసంచేస్తున్నాయి. అందుకే వీటి ధర కూడా చాలా ఎక్కువగానే పలుకుతోంది.

రంజిత్‌సింగ్ తయారుచేసిన కృత్రిమ వజ్రపు నగలను ధరించడమంటే ఒకప్పటి ప్రఖ్యాత ఆంగ్లనటి ఎలిజబెత్ టేలర్ అమితమైన ఉత్సాహాన్ని చూపించేది. ఎన్నో విందువినోదాలకు కూడా ఈమె ఈ కృత్రిమ నగలనే ధరించి వెళ్ళేది. ఇవి మార్కెట్‌లోకి వచ్చాక చాలామంది అసలైన వజ్రపు వస్తువులను బ్యాంక్ లాకర్లలో భద్రపరిచి, రోజువారీ వాడకానికి ఈ అమెరికన్ డైమండ్ వస్తువులను కొనడానికి ఎగబడుతున్నారు. ధనవంతులేగాక మధ్య, కిందితరగతి మహిళలు కూడా ఈ వజ్రాలయందు మోజుచూపిస్తున్నారు.

రంజిత్‌సింగ్ అమెరికాలోని సిలికాన్‌వాలీలో నివశిస్తాడు. అమెరికాలోని మెసాచుసెట్స్




టెక్నాలాజికల్ యూనివర్శిటీనుంచి డాక్టరేట్ పట్టా పొందాడు సింగ్. అతని పార్టనర్ శ్రీనాథ్ సింగ్ అనే వ్యక్తి కూడా మెసాచుసెట్స్ యూనివర్శిటీనుంచి డాక్టరేట్ తీసుకున్నాడు. వీరితో కలిసిన మరో ఇద్దరు భాగస్థుల్లో ఒకరు అమెరికాకు చెందిన డర్బీ, మరొకరు కేరళలో పుట్టి అమెరికాలో స్థిరపడిన ఎడ్వర్ట్.

భాగస్వాములు నలుగురున్నా ఈ వజ్రాల తయారీలో ముఖ్యపాత్ర రంజిత్, శ్రీకాంత్‌లదే. మొదట్లో వీటి తయారీలో చాలా కష్టనష్టాలు ఎదుర్కొన్నారు ఇద్దరూ. అటుపైన తమతమ ఉద్యోగాలకు తిలోదకాలిచ్చి కేవలం వీటి

తయారీలోనే నిమగ్నమై కృషిచేశారు.

మొదట్లో న్యూజెర్సీలో ఈ అమెరికా వజ్రాల అమ్మకంకోసం ఓ చిన్న షెడ్డులాంటి షాపు నిర్మించారు. అటుపైన దాన్ని కేవలం ఫాక్టరీగా వుంచి, అధునాతన ఆభరణాల షాపుకోసం ఓ పెద్ద భవనాన్ని తీసుకున్నారు. ఈ కృత్రిమ వజ్రాలపక్కనే సిసలైన మేలివజ్రాలను కూడా పెట్టేవాడు రంజిత్. కస్టమర్స్‌కి వాటి తేడాను కనుక్కోడం కష్టమయ్యేది.

రంజిత్‌సింగ్ తను తయారుచేసిన వజ్రాలను కల్చర్డ్ డైమండ్స్ అని పిలిచేవాడు. ఎవరైనా వాటిని డూప్లికేట్ వజ్రాలంటే కోపం పట్టలేకపోయేవాడు. అసలు రంజిత్‌సింగ్ తయారుచేసే ఈ నకిలీ వజ్రాలకి, 'క్యూబీ సిర్కోనియా' అనే శాస్త్రీయనామం వుంది. మంచి మేలురకమైన రాతిని తీసుకుని దానిని 5000 డిగ్రీల ఫారన్‌హీటువద్ద వేడిచేస్తారు. అటుపైన ఆ రాతిని కరిగిస్తే తళుకులీనే వజ్రాలు దర్శనమిస్తాయి.

ప్రస్తుతం ఈ వ్యాపారంలో వారి సంవత్సర రాబడి 10 కోట్లయితే, మరో 3 సంవత్సరాల తరువాత 150 కోట్లు అవుతుందని అంటున్నారు.

ఆమధ్య ఓ పత్రికావిలేకరి రంజిత్ తయారుచేసిన ఓ వజ్రాన్ని వజ్రాల వర్తకుడికి చూపించాడు. దాని విషయం తెలుసుకోలేకపోయిన వర్తకుడు దాన్ని అసలైన వజ్రంగా గుర్తించి దాని ఖరీదు ఒకకోటీ ఏభైలక్షలుండవచ్చని అంచనావేశాడు.

## అరుదైనప్రాణి

సుమారు మూడు అడుగుల పొడవుండే పంగోలిన్ అనే వింతప్రాణి ఎక్కడపడితే అక్కడ కనిపించదు. భూమిలో నెరియలుచేసి అందులో నివసించే పంగోలిన్ ఎర్రచీమల్నీ తెల్లచీమల్నీ మహా ఇష్టంగా భోంచేస్తుంది. దీని శరీరంమీదున్న గట్టి కవచం కారణంగా ఎలాంటి శత్రువులకీ లొంగకుండా నిర్భయంగా బతుకుతోందీ అరుదైనప్రాణి. సుత్తి, కత్తి కూడా ఆ కవచాన్ని ఛేదించలేవుమరి. బల్లిలా కనపడుతుందిగానీ పాలిచ్చి పెంచే జాతికి చెందినదే. దీనికి పళ్ళు దవడలలాంటివి లేకుండా ఆ స్థానంలో ఓ పదునైన పొడవాటి ముక్కులాంటి నోరుంటుంది. అందులోంచి పదహారంగుళాల పొడవైన నాలుక స్ప్రింగ్‌లా మాటిమాటికీ బయటకి, లోపలకీ అతి వేగంగా కదులుతూ చీమల కోసం వెతుకుతూవుంటుంది.

అప్పుడప్పుడు సరదాకోసం ఇది నెరియల్లోంచి బయటకొచ్చి చెట్టెక్కుతూ వుంటుంది. నక్క, కుక్క మొదలైన జంతువులు దీన్నెలాగయినా పట్టుకోవాలని వెంటాడతాయిగానీ దాని రక్షణకవచం ముందు తోకముడిచేసాయి. ఈ క్రూరప్రపంచంలో తన ఉనికిని కాపాడుకుందుకు తనకుపయోగపడే కవచాన్ని దాన్నిచ్చిన భగవంతుడినీ తలుచుకుని మురిసిపోతూ వుంటుంది పంగోలిన్.




Edited, Printed and Published by Ramoji Rao for Vasundhara Publications, Printed at Colorama Printers Pvt. Ltd. Hyderabad. Tel. 290328 Office Address: CHATURA Telugu Monthly, Eenadu Compound, Somajiguda, Hyderabad. Tel. Hyderabad: 223422, 229444; Madras: 470434; Vijayawada: 476685; Visakhapatnam: 52211; Tirupati: 5291; Anantapur: 22977; Rajahmundry: 71390; Karimnagar: 8316.

